# రత్నకవి సాహిత్యానుశీలనము

## ( అంబటిపూడి వెంకటరత్నం )

కవిరత్న రత్నకవి సాహిత్యపీఠం పోటీలో రూ. 1500/-

బహుమతి పొందిన గ్రంథం




రచయిత :-

"సాహిత్య విద్యాప్రవీణ" "భాషాప్రవీణ"

**విష్ఠల సుబ్రహ్మణ్యం ఎం. ఏ.,**

(వ్యాకరణ, దర్శన, తెలుగు, అలంకార)

**Astrologer**

"కవిరత్న రత్నకవి సాహిత్యపీఠం"

**సాహితీ మేఖల**

చండూరు ఏదుబాడు

Ratnakavi Sahityanuseelanamu

By

Nistala Subrahmanyam



A. V. S. Sastry,

Secretary, Sahithimekhala,

EDUBADU.

సాహితీ మేఖల

ఏదుబాడు, చందూరు



ప్రచురణ 34

ముద్రణ :

శ్రీ శంకర్ ఆర్ట్ ప్రింటర్స్,

మెయిన్ రోడ్, పొన్నూరు - 522 124.

ప్రతులకు :

"వత్సల" ఎ. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి,

కార్యదర్శి, సాహితీమేఖల

ఏదుబాడు పోస్టు (వయా & మండలము) పర్చూరు

ప్రకాశంజిల్లా - 523 168

నిష్ఠల సుబ్రహ్మణ్యం, లెక్చరర్,

శ్రీ భావనారాయణస్వామి సంస్కృత కళాశాల,

పొన్నూరు - 522 124.

మే 1986

వెల : **30-00** రూపాయిలు

# ఒక మాట

"ననుగని పెంచినాచదువు నాటికి నాటికి పెంపుజేయదీ
తనుగొని సౌఖ్యమే మఱచి సంతతముందపియించి పోయెనా
జనకుడు జ్ఞానవార్నిధి విచార తమస్సున ముంచినన్నుఁ చి
ద్ఘనము తదాత్మశాంతి గొనగానిది తర్పణ మౌత నేటికిన్"

గాయత్రీ మంత్రోపదేశంమొదలు నాడిగ్రీ చదువు వఱకు అన్ని చదువులు వారే చెప్పారు. తండ్రిగా, గురువుగా నాకు ఆయన చేసిన సేవ అపారము, అందుకనే నిత్యం కళ్లలో మెదలుతూ నన్ను ముందుకు నడుపుతుంటారు మానాయనగారు

మా నాయన గారు పోయిన తరువాత 'టైఫాయిడ్' జ్వరంతో బాధపడుతున్నాను. మూడు రోజులైనా జ్వరం $103^{\circ}$ తగ్గలేదు. డాక్టరు 21 రోజులు ఆహారం వద్దన్నాడు. బాధతోఏడురోజులు గడిచాయి, కంటిమీద నిద్రలేదు, ఎనిమిదవ రోజు రాత్రి కళ్లలో మా నాయనగారు కనిపించి ఏమిటి నేను చేసిన సాహిత్యసేవను మరచావా? వాటికి ఒక రూపం కల్పించే బాధ్యత నీకు లేదా? ధైర్యం తెచ్చుకొని వాటికిఒక రూపం కల్పించి ప్రపంచానికి అందజేయి, అవి బోధించి కనుమరుగయ్యారు. మొదటిరోజు ఏదోలే అనుకొని అశ్రద్ధచేశాను. రెండవ రోజు పై విధంగానే మళ్లీ వెన్నుతట్టి నిద్రలేపిచెప్పారు. చనిపోయిన వారు కళ్ళలో కనిపిస్తారులే అనుకొని ఆరాత్రి ఎట్లో గడిపాను. మూడవ రోజు అదేబోధ. నాలుగో రోజు ఆదేమాట నాలుగురోజులు వరుసగా నా కర్తవ్యాన్ని గుర్తు చేశారాయన.

ఇక ఆలోచనలో మునిగాను. ఏవిధంగా ఆయన సాహిత్యసేవను లోకానికి తెలియ పరచాలో అర్థంకాక రెండు రోజులు సతమతమయ్యాను.

ఒకరోజు దినపత్రికలో 'ఎఱ్ఱన పీఠం'వారి సాహిత్య పోటి ప్రకటన చూచాను. చక్కని మార్గం దొరికిందని భావించాను. కొన్ని కాగితాలు తీసుకొని 'వ్యాసరచన పోటీ' - విషయము - "రత్నకవి సాహిత్యానుశీలనము", "ఉత్తమ రచనకు రు. 1500-00 బహుమతి పోటీ నిబంధనలు తయారుచేసి దినపత్రికకు ప్రకటనను పంపాను.

ఉత్సాహవంతులైన రచయితలు పోటీలో పాల్గొన్నారు. వారికి నా ధన్యవాదాలు. పోటీ అన్నప్పుడు ఎన్నో సాధక బాధకాలు ఉంటాయని రంగంలో ప్రవేశించిన తరువాతగాని తెలియలేదు. పోటీ ఒక పుస్తకం మీద విమర్శకాదు. కవి వ్రాసిన ముద్రిత, అముద్రిత గ్రంథములపై పోటీ విమర్శకులు ఎన్నోవ్యయ

ప్రయాసల కోర్చి వ్రాశారు. పోటీలో ఎవరో ఒకరికి మాత్రమే బహుమతి లభించడం అన్న విషయం సర్వజన విదితం.

'రత్నకవి సాహిత్యాను శీలనము' - వ్యాసరచన పోటీలో మొత్తముఅయిదుగురు రచయితలు పాల్గొని తమ పరిశోధన ప్రతులను అందజేశారు. వారికి నమస్సుమాంజలులు. సాహితీమేఖల, యెడల గల ప్రేమా దరములతో శ్రీవంగల వేంకటచలపతిరావుగారు, శ్రీవంగల రామకృష్ణశాస్త్రిగారు, శ్రీచేరెడ్డి మస్తాన్ రెడ్డిగారు న్యాయనిర్ణేతలుగా నుండి ఉత్తమ రచయితను నిర్ణయించారు. వారికి నమస్సులు.

ఈ పోటీలో ఉత్తమ రచయిత 'శ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యం-లెక్చరర్ - భావనారాయణస్వామి ప్రాచ్య కళాశాల-పొన్నూరు' అని న్యాయనిర్ణేతలు నిర్ణయించారు.

2.6.1984 న చిలకలూరిపేటలో శ్రీ అంబటిపూడి వెంకటరత్నంగారి స్మారకసభ, ఏర్పాటు చేశాము. ఆ సభలో ఉత్తమరచయితకు సన్మానం. పోటీలో పాల్గొన్న మిగిలిన నలుగురు రచయితలకు కూడా ఉచిత రీతిని సన్మానము జరిపాము.

తరువాత ఉత్తమ రచయిత వ్రాసిన గ్రంథాన్ని ముద్రించే బాధ్యతను స్వీకరించి నేటికి ఈ గ్రంథ రూపంలో మీ ముందుంచుతున్నాను. పాఠకులు పూర్వంలో సాహితీమేఖల రచనలను ఏవిధంగా ఆదరించారో అట్లే ఈ గ్రంథాన్ని కూడా ఆదరించ ప్రార్థన. అంబటిపూడి వెంకటరత్నంగారిజీవిత విశేషాలను, ముద్రిత,అముద్రితగ్రంథ విమర్శలను ఈ గ్రంథంలో చదివి ఆనందించ గోరెదను.

ఈ గ్రంథము పై అభిప్రాయములనిచ్చిన శ్రీయస్వీజోగారావుగారికి, శ్రీవంగల వెంకట చలపతిరావుగారికి, శ్రీదీవి దీక్షితులుగారికి, శ్రీ తాడిశెట్టి నరసింహాగుప్త గారికి నమస్కృతములు.

గ్రంథమును చక్కగా ముద్రించి ఇచ్చిన శ్రీ శంకర్ ఆర్ట్ ప్రింటర్స్ పొన్నూరు వారికి ధన్యవాదములు.

ఈ గ్రంథ ముద్రణకు తగు సలహాలనిచ్చిన బంధువర్గమునకు, శ్రీ వంగల వెకంటచలపతిరావుగారికి, శ్రీరాళ్లబండి శ్రీరామమూర్తి గారికి, శ్రీమేళ్లచెఱువు భాను ప్రసాద్‌గారికి ధన్యవాదములు.

సాహితీమేఖలను మొదటినుండి ఆదరిస్తున్న చండూరు ప్రజలందరికి నమస్సులు.

ఇట్లు

భవదీయుడు

'వత్సల'

సాహితీమేఖల కార్యదర్శి

# సహృదయ భూమిక

ఆధునిక యుగాంధ్ర సారస్వత స్రష్టలలో ద్రష్టలలో బహుముఖ ప్రజ్ఞాధురంధరులు శ్రీ అంబటిపూడి వెంకట రత్నంగారు - విద్వత్కవి రత్నము రసజ్ఞ విమర్శక రత్నము. అంతటి అంతర్వాణి వరేణ్యుడీదినములలో మిక్కిలి అరుదు. సువిశాలమైన దాయసదృష్టి వారి సారస్వత విశ్వరూప దర్శన పత్రికలేనియే ప్రకృతకృతి.

ఏతత్కృతి ప్రణేత సంస్కృతాంధ్ర భాషాసాహిత్య నిష్ణాత నిష్ణాల సుబ్రహ్మణ్యం. అనువంశికమైన పేరుప్రతిష్ఠలుగల వైదుష్య సంపదకు 'వారసుడు'. ప్రవచన పటువైన ఉపాధ్యాయుడు. సురుచిర సృజనశక్తియుతమైన సునిశిత వైమర్శిక దృక్పథముగల భావుకలోక పట్టభద్రుడు. బంధుర ప్రజ్ఞాశాలి వెంకటరత్నముగారి సారస్వత విషయమున "ఏకచులుకాహంకార నిశ్శేష శోషిత పాథోధిపయస్కుడైన ముని"

ఈ కృతి విషయ పరిపుష్టిగలట్టిది. కవి హృదయ విశదీకరణమున గట్టిది. సమ్యక్ప్రణాళికమైనట్టిది. రచనయు సర్వతః ప్రసన్నమై రుచిరాభిరుచిద్యోతకమై రమ్యమైనట్టిదే కాని భాష మాత్రము గ్రాంధిక వ్యావహారికముల కలగాపులగమైనది. 1984 లో సాహితీ మేఖల" అను సంస్థ నిర్వహించిన పోటీలో ప్రథమ పురస్కారమునందినది. ఆ సంస్థయే దీనిని ముద్రించినది. ఏవంవిధ కృషి రచనముతో తన సారస్వత భవిష్యత్తునకు రాచబాటలు వైచుకొన్నాడు సుబ్రహ్మణ్యం.

"అభ్యుదయ పరంపరాభివృద్ధిరస్తుతే" అని అతనికి నా ఆశాసనము.

ప్రొ॥ యస్వీ. జోగారావు
వాల్తేరు.

# మున్నుడి

"రత్నకవి సాహిత్యానుశీలనము" అను గ్రంథానికి ముందు మాట వ్రాయుమనిమా గురుపుత్రులు పుస్తకమిచ్చివెళ్ళారు. ఎందుకో ఏమివ్రాయాలనో తోచక కొంత కాలహరణం చేశాను. దానికి కారణం వారితో నాకున్న మమతానుబంధమేకావచ్చు. కలంపట్టగనే వారి మూర్తి నా స్మృతిపథంలో మెదలటం, విషాదచ్ఛాయలు నన్నావరించటం, ఏదో అవ్యక్తమైన స్తబ్ధతలో మగ్నంకావటం ఏక కాలంలో జరుగుతున్న సంఘటనలు.

పూజ్యపాదులు బ్రహ్మశ్రీ అంబటిపూడి వేంకటరత్నం గారు మా గురుదేవులు. వారు దివంగతులైనవెనుక వారి కుమారులు చిరంజీవి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ పితృపాదుల వ్యక్తిత్వాన్నీ రచనల్నీ దిఙ్మాత్రంగానైనా లోకానికి పరిచయంజేయాలనీ, తన్మూలంగా వారి స్మృతి ప్రదీప్తికి శాశ్వతత్వం కలిగించాలనీ సంకల్పించారు. ఆ సంకల్పమే యీ గ్రంథరూపాన్ని సంతరించుకొన్నది.

"రత్నకవి సాహిత్యానుశీలన" మను పేరుతో రచించిన ఉత్తమ రచనకు చంద్రునకు నూలుపోగన్నట్లు కొంత పారితోషికాన్ని ప్రకటించారు. అందుకుద్యుక్తులైన రచయితలకు కావాల్సిన గ్రంథ సంచయాన్ని, రత్నకవిగారి జీవితవిశేషాల్ని అందజేశారు వచ్చిన రచనలలో బ్రహ్మశ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యం ఎం ఏ., గారిది సర్వోత్తమ మైనదిగా న్యాయనిర్ణేతృ సంఘం నిర్ణయించింది. కవిగారి రచనలతో మొదటినుండి పరిచయం గలవాడిని గనుక నన్నుగూడ ఒక న్యాయ నిర్ణేతగా నియమించారు. ఏవిధమైన పక్షపాతం లేకుండ నిర్ణేతలు రచనల్ని ఆమూలాగ్రం చదివి నిగ్గుతేల్చిన గ్రంథమిది. ఇతర రచనలు

లేనివట్టనిగాని, వారు అసమర్థులనిగాని భావంకాదు. సహృదయులైన పండిత ప్రకాండులు వ్రాసిన రచనలు చదివి నిగ్గుతేల్చటం అసిధారా వ్రతం లాంటిది. వారందరికీ మా కృతజ్ఞతాపూర్వక నమోవాకాలు.

ఉత్తమోత్తమంగా నిర్ణయింపబడిన రచనకు చిలకలూరి పేటలో కవిరత్న స్మారకసభలో పండితుల సమక్షంలో పారితోషికం సమర్పించి సన్మానించటమైనది. ఆ వ్రాతప్రతి ఆ రూపంలోనే ఉంటే దానిని వ్రాయించిన ఉద్దేశ్యం పరిమిత ప్రయోజనం కలదిగానే ఉంటుందని భావించి చిరంజీవి అంబటిపూడి వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు దానిని ముద్రింపించి సాహిత్యలోకానికి మహోపకారము చేశారు. వ్యయప్రయాసలను లెక్కచేయని వారి పితృభక్తి ప్రశంస నీయం.

కీర్తికండూతి లేశమాత్రంలేని మనస్తత్వం మా గురువు గారిది. వారిజీవితమే ఒకయోగం. వారి రచనా వ్యాసంగమే ఒక తపస్సు. తుదిక్షణం వరకు నిరంతరం గ్రంథపఠనం చేస్తూనేఉండేవారు. కడసారి కన్నుమూసేవరకు అవిశ్రాంతంగా కావ్యరచనా వ్యాసంగం చేస్తూనే ఉన్నారు. దానికి ప్రబల నిదర్శనం వారి గోపికావ్యమే.

వ్యాకరణశాస్త్రంమీద వారికున్న పట్టు అనన్యసామాన్యం. సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో నిష్ణాతులు. విద్వత్కవులు. వివిధ సాహిత్యప్రక్రియలలో వారి లేఖిని స్పృశింపని ప్రక్రియేలేదు. స్పృశించటమేకాదు, సర్వాంగసుందరంగా తీర్చిదిద్దగల ప్రజ్ఞాశాలి. వారికి వారి గురువుగారైన బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారిమీద ఎంతటి భక్తిగౌరవాలున్నయ్యంటే వారిపేరు తలచితేచాలు, పర వశించి పోతారు. వారిదేహంలో ప్రత్యణువూ కృతజ్ఞతాభావంతో

పులకించిపోతుంది. సంస్కృతభాషమీదకూడ వారికట్టి గౌరవమే ఉన్నది. తెలుగులో ప్రాచీన కవులదగ్గరనుంచి అత్యాధునిక కవుల వరకున్న కవితలన్నీ వారి జిహ్వాగ్రం మీదనే లాస్యం చేస్తుందేవంటే అతిశయోక్తి కాదు. ఇంగ్లీషులో మిల్టన్ దగ్గిరనుండి ఇలియట్ వరకున్న కవుల కవితలు వారికి ముఖస్థానాలే. షేక్స్పియరు నాటకాలు వారు చెబితేనే వినాలి. ఒక్కవిషయం చెబుతాను మన్నించాలి. ఎంతటి ప్రొఫెసరైనా కావచ్చు, ఎన్నేండ్ల అనుభవమైనా ఉండవచ్చు గాక. కవితాత్మగలవారి బోధనలో ఉన్న స్వారస్యం ఇతరుల బోధనలో ఉండదని నా ప్రగాఢ విశ్వాసం. 'దర్దురంబరయగ నేర్చునెట్లు వికచాబ్జ మరందరసైక సౌరభోత్కరము మిళిందముందు క్రియ' యన్నది అక్షరాలానిజం.

ఇటువంటి విద్వత్కవి రచనల్ని అనుశీలనం చెయ్యటమంటే మాటలుకాదు. అది యెంత దుష్కరమో వేరుగా చెప్పనక్కఱలేదు శ్రీ విఠ్ఠలవారు ఆ కష్టతర కార్యాన్ని సర్వసమర్థంగా నెఱవేర్చారు. సాహితీప్రియులు, రసజ్ఞులు ఈ గ్రంథాన్ని ఆదరింతురుగాక!

"జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః"

ఓంతత్సత్

వంగల వెంకట చలపతిరావు బి. ఏ.,

రిటైర్డు సీనియర్ తెలుగు పండిట్,

గుంటూరు.

## శ్రీ వెంకటరత్న గురుభ్యోనమః

శ్రీయుతులు నిమ్మల సుబ్రహ్మణ్యంగారు సమీక్షించిన గురువర్యులు రత్నకవిగారి "సాహిత్యానుశీలనాన్ని" గురుపుత్రులు నాయందలి ఆదరముతో పంపగా అందుకొని ఎంతో ఆనందించితిని. అజ్ఞానతిమిరంలో అలమటిస్తున్న మా తెలంగాణ ప్రాంతానికి, తమ సాహిత్య వ్యవసాయంతో వెలుగు రేఖలు ప్రసరింపజేసిన 'మహామనీషి' మా గురువర్యులు అంబటిపూడి వెంకటరత్నకవిగారు. మా ప్రాంతంలో సాహితీమేఖల చేసిన సేవ నాబోంట్ల నెంతమందినో చైతన్యవంతుల చేసింది.

ఈ గ్రంథ సమీక్షకులైన సుబ్రహ్మణ్యంగారు రత్నకవి సాహిత్యానుశీలనంలో అగ్రశ్రేణిలో ఎన్నిక కావడం ఎంతో ముదావహం. గురువుగారి సాహిత్య వ్యవసాయమంతా మా ప్రాంతంలో జరగడంమూలాన ఈ గ్రంథంలో సమీక్షింపబడ్డ ఎన్నో అంశములతో నాకు సంబంధం ఉంది. అందుచేతనే ఈ అనుశీలనాన్ని చూచి నాకన్నా ఎక్కువ ఆనందించేవాళ్ళుండరని భావిస్తున్నాను. ఈ సాహిత్యానుశీలనములో మొదట సమీక్షింపబడినది గురువుగారి జీవితం. ఆ జీవితమంతా మాతో పెనవేసుకుపోయి వుండడమువలన, గురువును గూర్చి చెప్పినదంతా మా గురించి చెప్పినట్లేఉంది. గతమంతా స్మృతిపథంలో మధురంగా మెదిలి నన్ను పరవశుణ్ణిచేసింది. రత్నకవిగారి వ్యాసపమాలోచనము వీరి అనుశీలనంలో హృద్యంగా సాగింది. గురువుగారి అమూల్యమైన అభిప్రాయాలకు వారి వ్యాసాలు మణిదీపికలు.

ఖండకావ్య పరిశీలనంలో భారతీయధర్మం, జాత్యభిమానం, దేశభక్తి, శిష్యవాత్సల్యం, గురువుగారి లక్షణాలుగా అభివ్యక్తం చెయ్యబడ్డాయి. ఆ తర్వాత సాగిన ఆధ్యాత్మిక, పద్య, గద్య గ్రంథాల అనుశీలనంలో గురువర్యుల సనాతన ధర్మాసక్తి, కృష్ణభక్తి, అత్యద్భుతముగా ప్రకటింపబడింది.

"దక్షిణ" నాటకంలో ప్రతిపాదింపబడ్డ గురుభక్తి, సుబ్రహ్మణ్యంగారి అనుశీలనంలో మరింత దీప్తివంతమైంది. "ఇందిరా విజయము" గురువుగారి సర్వంకష ప్రతిభకు, దేశభక్తికి, ఎత్తినట్టి జయ పతాక అన్న విషయాన్ని ఈ పరిశీలనాగ్రంథం ఆవిష్కరించి చూపింది.

"జీవులు నిష్కామ యోగము చెయ్యాలి" అన్న విషయము గురువుగారి ఆధ్యాత్మిక గ్రంథ పరిశీలనములో తేల్చిచూపడం జరిగింది. గురువుగారి ఆంగ్ల గ్రంథసమీక్షలు గద్యానువాదాలు ఉచితరీతిలో పరిశీలించబడ్డాయి. వివేకశిఖరాలు గురువుగారి చిత్తపరిపాకానికి సంకేతముగా ఉత్తమరచన అన్న విమర్శకుల అభిప్రాయంతో నేను ఏకీభవిస్తాను. ఏకత్వమే ప్రపంచంలో సర్వాంగీణంగా వ్యాపించి ఉన్నదనీ, ఏకత్వసాధనకే కృషిచేయాలన్న తపన గురువర్యుల ఈ గ్రంథం ఆవిష్కరిస్తుందని పరిశీలకులు భావించారు, ఇందేమాత్రం అసత్యంలేదు. ఔచిత్యమే ఉంది.

తరువాత గురువర్యుల కథావళి సమీక్షించింది. కథల్లో కూడా పరమాత్మ కుమారుడై, జీవి ప్రపంచాన్ని వదలి తిరిగి అతనినే చేరడం అంతరార్థంగా తేల్చబడింది. ఇది సార్వకాలీనమైన సత్యం. గురువుగారి తెనాలి రామకృష్ణుని విమర్శనాగ్రంథం ముద్రింపబడి వెలుగుచూడాలని పరిశీలకులు భావించడంలో ఉచితజ్ఞత ఉంది. గురువుగారి సమస్త సాహిత్యాన్ని తమకున్న పరిధిలో తామెంతో ప్రతిభతో ఈ గ్రంథకర్త అనుశీలించారని చెప్పడంలో సందేహంలేదు.

ఈ పరిశీలనాగ్రంథం పఠితలకు గురువర్యుల సాహిత్యాన్ని మరింత సమగ్ర సుందరముగా అనుశీలించి చూపే ఆసక్తిని కలిగిస్తుందని ఆశిస్తున్నాను

నల్లగొండ
24–12–1985

ఇట్లు
తాడిశెట్టి నరసింహగుప్త



2-6-84న చిలకలూరిపేటలో జరిగిన కవిగారి
స్మారకసభలో శ్రీ మాజేటి సుబ్బారావు గ్రంథకర్తను సన్మానించుట

# నా మాట

మహాకవి శ్రీ అంబటిపూడి వేంకటరత్న కవిగారి బహువిధ సాహితీ ప్రక్రియలను, వారి వ్యక్తిత్వమును సమగ్రముగ పరిశోధించి ఒకానొక గ్రంథమును నిర్మింపవలెనను తలంపునకు "సాహితీమేఖల" కార్యదర్శిగారు పోటీని ఏర్పరచుటయే కారణము. కవిగారి ముద్రిత గ్రంథములేగాక అముద్రిత గ్రంథములునూ కార్యదర్శిగారి యింట నున్నవి. వారి సాహిత్యమును అనుశీలించు భారతీయ సంప్రదాయ రహస్యములనే పరిశీలించితినని నేననుకొందును. ఓర్పుతో అనేక అముద్రిత శాస్త్రగ్రంథములను నాకందించి, ప్రోత్సహించిన సాహితీమేఖల కార్యదర్శిగారికి కృతజ్ఞుడను.

గ్రంథ పరిశీలనారంభమున సామాన్యమైన నాశ్రద్ధ పరిశీలించు చుండిన కొలది మిక్కుటమై అంతమున భక్తిరూపమున పరిణమించినది కవిగారి ముద్రితా ముద్రిత గ్రంథములెన్నియో గలవు. ఇతరములైన అరువదియేడు సంస్కృతాంధ్రములనుగూడ విషయపరిపుష్టికై గ్రహించితిని. నా యీ కృతిని ఉత్తమమైనదిగా నిర్ణయించి న్యాయనిర్ణేతలకు కృతజ్ఞుడను. ఇంక గుణ దోష వివేచనము సహృదయులైన పాఠకుల పని. వారి నిర్ణయమును జాదల దాల్తును.

శ్రీ భావనారాయణస్వామివారి గ్రంథాలయము నందు అనేక గ్రంథములుగలవు వివిధ శాస్త్రగ్రంథములను ఆ గ్రంథాలయమునుండి గ్రహించితిని. ఆ గ్రంథాలయాధ్యక్షులైన శ్రీ పి.వి.ఆర్.అప్పారావుగారు మాకు మిత్రులు. విలువైన గ్రంథములను సేకరించుటయందు వారికి శ్రద్ధ ఎక్కువ. కోరినంతనే గ్రంథముల నందించిన వారికి కృతజ్ఞులు. సాహిత్య సంస్థయైన సాహితీమేఖల ఇతోధికంగా వర్ధిల్లాలని ఆశిస్తూ-

మీ

గ్రంథకర్త.

# 'రత్న మేఖల'

"మహతాం జీవనం లోకే ప్రాణినాముపకారకమ్"

ఒక వ్యక్తిలోని చైతన్యం మహాశక్తిగా వ్యక్తమై సాహితీ క్షేత్రాన్ని ప్రభావితం చేయడం, అదే తరతరాలుగా తరగని ఆస్తిగా స్ఫూర్తిగా సమాజానికి అందుబాటులో ఉండటం, ఆ జాతి చేసికొన్న అదృష్టం.

సాహిత్యప్రయోజనాలను ఆకళింపు చేసికొని సరస్వతీ సాక్షాత్కారం పొంది తానొక సాహితీసేవాసంస్థను స్థాపించి తానే సంస్థగా రూపొంది జాతికి సాహిత్య సౌహిత్య పంచామృతాన్ని పంచిపెట్టే మహనీయుని జీవితం ఏ జాతి చరిత్రలోనైనా శాశ్వతంగా ప్రకాశించే రత్నదీపం.

నిరంతర సాహితీ తపస్వి - బహుభాషాకోవిదుడు - ఉత్తమ దేశ భక్తుడు-సహృదయ సౌజన్యమూర్తి-క్రాంతదర్శి అయిన అంబటిపూడి వెంకట రత్నకవిగారి సాహిత్యమూర్తిని సాక్షాత్కరింపజేసే ప్రయత్నానికి ఈ కృతి - అక్షరాకృతి కవి పుట్టిన వంశం గొప్పది. కవి స్వయంగా ప్రతిభామూర్తి. సద్గురువుల శుశ్రూషలో సానపట్టిన రత్నంగా రాణించి వన్నె - వాసి తగ్గకుండా కగ్గకుండా జాగ్రత్తపడి జీవితాన్ని తేజోవంతం చేసికొని తన మాట వేదవాక్యంగా - తన బాట ఆదర్శపథంగా తీర్చిదిద్దుకొన్న మహాత్ములు రత్నకవిగారు.

"ప్రాణిలోకంబు సంసార పతితమగుట-వసుధపై పుట్టిగిట్టనివాడు గలడె ? వాని జననంబు సఫలమెవ్వానివలన వంశమధికోన్నతివహించి వన్నెకెక్కు" అనే సుభాషితానికి ప్రత్యక్షసాక్ష్యము రత్నకవిగారి జీవితము. "ఏ గతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే గదా" అనెడి కవిమాటకు రత్నకవిగారి కవితాజీవితము అపవాదము. సమకాలీన కవుల చేతనే సన్మానములందుకొనిన ఘనత రత్నకవిగారిది. ఇంతటి గొప్ప వ్యక్తిత్వం గల రత్నకవి ఎప్పటివాడు? ఎక్కడివాడు?

ఆయన ప్రత్యేకత ఏమిటి? ఆ మహాకవి నిర్మించిన సాహిత్యప్రపంచం మెటువంటిది ? దానిలో ఈనాడు మనకు అవసరమేముంది ? అనే ప్రశ్నలు జిజ్ఞాసువులైన వారికి తప్పక కలుగుతాయి. వాటన్నిటికి కొద్దోగొప్పో సమాధానం దొరక్కపోతే కవిగారిని గురించి తెలిసి కోవాలనే ఆలోచన వాయిదాపడుతుంది. అట్లాగాకుండా "నానృషిః కురుతే కావ్యం - విశ్వశ్రేయః కావ్యం" అనిన ఆర్యోక్తులకు అద్దం పట్టిన రమణీయ సాహిత్య వ్యవసాయ ఫలితాలను అందుకోవడానికి ఆలంబనంగా, మార్గదర్శకంగా కవిగారిచేతనే స్థాపింపబడిన సాహిత్య సంస్థ "సాహితీమేఖల" రసజ్ఞలోకానికి అందించే "దిక్సూచి" ఈ గ్రంథం.

ప్రకాశంజిల్లాలోని "ఏదుబాడు" అగ్రహారం 1908లో ఆంధ్ర జాతికి ఒకరత్నాన్ని ప్రసాదించింది. ఆరత్నం సరస్వతీ కంఠాభరణంలో నాయక రత్నమై రాణించింది. ఆ అనర్ఘ-అనల్ప—అమోఘ రత్నమే మహాకవి శ్రీ అంబటిపూడి వెంకటరత్నకవి. తపోనిష్ఠాగరిష్ఠులై అలంఘిరుపాదుషాను మెప్పించి అగ్రహారాలు కానుకలుగా గైకొన్న అద్భుతమేధాసంపన్నులు అంబటిపూడి వంశీయులు. అటువంటి అంబటిపూడి వంశంలో పుట్టిన విజ్ఞానమూర్తులు రత్నకవిగారు. ఆత్మబలంతో కృష్ణ తత్వంతో భీష్మాచార్యునివలే బ్రహ్మచర్య దీక్షతో సాహిత్య తపస్సు నుపండించుకొన్న ధన్యజీవి రత్నకవిగారు. సాహిత్యప్రస్థానములన్నింటిని సమన్వయించుకొని సాహిత్యప్రక్రియలన్నింటికి తనరచనలు ఉదాహరణములుగా మలుచుకొని తాను నడుస్తూ పదిమందిని నడిపించిన మహా మార్గ దర్శి రత్నకవిగారు.

రత్నకవిగారి జీవితం సంప్రదాయపద్ధతిలో ప్రణాళికాబద్ధంగా సాగింది. చెరుకువాడ నరసింహం పంతులుగారు పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు శ్రీ పళ్ళపూర్ణప్రజ్ఞాచార్యులుగారు రత్నకవిని సానబెట్టివదిట్టలు. శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారు కవిరత్నంవిలువను లోకానికి వెల్లడించినగురువులు "నేటి

కినారతనంబుగాంచితిన్" అనేమధురానుభూతి గురువులకే కలిగించిన ఉత్తమశిష్యరత్నం వెంకటరత్నంగారు. ఆంధ్రలోపుట్టి తెలంగాణాలో స్థిరపడి ప్రాంతభేదాలకు అతీతంగా తెలుగుజాతికి వెలుగుబాటగా "సాహితీమేఖల" అనే సంస్థను స్థాపించి ఎందరో కవులరచనలు సాహితీప్రియుల కందించిన సహృదయ సమన్వయ సాహితీమూర్తి రత్నకవిగారు. దాశరథిగారి "అగ్నిధార" శ్రీ దేవులపల్లి రామానుజ రావుగారి "స్వాహా" పులిజాల గోపాలరావుగారి "ఖడ్గతిక్కన" సాహితీమేఖల ప్రచురణలలో మచ్చునకు కొన్ని మాత్రమే.

రత్నకవిగారికి సంస్కృతభాష— సంస్కృతసాహిత్యములపైన ప్రత్యేక అభిమానం. మాతృదేశం మాతృభాషపట్ల అపారమైన మక్కువ ఇతిహాసములు, పురాణములు అనిన అంతులేని గౌరవము. ప్రబంధవాఙ్మయముతోపాటు ప్రాచీనకవులపై భక్తిప్రపత్తులుఎక్కువ. ఆధునికకవులు సాహిత్యసమస్యలు, సాంఘికసమస్యలపై స్పష్టమైన అభిప్రాయముంది. అన్యభాషాకవులపై నిర్దిష్టమైన నిర్దుష్టమైన అవగాహనఉంది.

"మంచి ఎక్కడఉన్నా గ్రహిద్దాం. మంచిని అందరికీపంచుదాం" అనే ఆదర్శంతో ఉంటుంది రత్నకవిగారి ఆత్మీయత "ఆనోభద్రాఃక్రత వోయన్తువిశ్వతః" అనేఋక్కుకు ఇటువంటివారిజీవితాలే ఉదాహరణలు.

ఈదృష్టితోనేవ్రాసినరత్నకవిగారి సాహిత్యం గద్యపద్యాత్మకమై బాహ్యస్వరూపాన్నిబట్టిచూస్తే "వ్యాసములు— ఉపన్యాసములు— సమీక్షలు— నాటకాలు—నాటికలు రూపాలుగా గోచరిస్తుంది. విషయపరంగా విభజిస్తే— సాహిత్యరచనలు —సాంఘికరచనలు ఆధ్యాత్మికరచనలు అనేభాగాలుగా కనిపిస్తుంది. భాషాదృష్టితో పరిశీలిస్తే "ఆంధ్రరచనలు — సంస్కృతరచనలు ఆంగ్లరచనలు అనువాదాలు అనే పద్ధతిలో స్పష్టపడుతుంది. వీనిలో కొన్ని అముద్రితాలు కొన్నిఅసంపూర్ణాలు

"జాతి-దేశము-మతము-పవిత్ర సంప్రదాయము సాంఘికరాజకీయపరిస్థితుల సమ్మేళనాత్మకభావమే "జాతీయత" అనిపించుకొంటుంది. అట్టిజాతీయత మనలో సజీవంగాచైతన్యవంతంగా నిలవాలంటే దానికి మార్గము సంస్కృతభాషాధ్యయనమే" అంటారు రత్నకవిగారు అందుకోసమే సంస్కృతభాష జాతీయభాష కావాలి లేకపోతే స్వాతంత్ర్య ఫలితాలు జాతికి గగనకుసుమాలే-ఆంగ్లేయుల పాలనకు-భారతీయుల పాలనకు తేడాలేనట్లే అంటూ "If Sanskrit is not made the national language of India there will be no difference between the British rule and Indian rule" అని ఆవేదన పడిన రత్నకవిగారి సంస్కృత భాషాభిమానము మనకు ఎంతో స్ఫూర్తిదాయకము - వాల్మీకి - కాళిదాసువంటి మహాకవుల కావ్యజగత్తును పరిశీలించిన తీరు - చంద్రకళాలా - ఇందిరా విజయమువంటి సంస్కృతరచనలు కవిగారి సంస్కృత సాహిత్య పరిచయ పాండిత్యాదులకు నిదర్శనాలు.

"తెలుగువాణి నిజమ్ము బాసలకు రాణి" అనే రత్నకవిగారి వాక్కు "దేశభాషలందు తెలుగులెస్స" అనే మాటకు దీటుగా లోకంలో నిలబడుతుంది.

"చల్లనితల్లి మా తెలుగు సంపదకీభువి సాటిలేదు నీ పిల్లల పాటలెన్నొ వినవే జననీ! మధుమాధురీ రసాఢ్యోల్లసితంబులై జగమ్ము నూపునవై దృఢమాతృభక్తి సంపల్లవితంబులై ఒక రవమ్మయి నేడు నిన్నుఁ నుతించునో" అనే మాటల్లో ఆంధ్రాభిమానంతోపాటు ఆత్మాభిమానంకూడా వ్యక్తమవుతుంది.

"అత్రిలింగము తెలంగైనది
తెలుగు తెనుగాంధ్రమ్ములొక చే
అర్థమిచ్చెడి వేరు వేరగు
పేరులన పేరొందియున్నవి" అనే మాటల్లోనూ

"వెఱ్ఱివాడా! విసముగ్రక్కకు

ఆంధ్రుడెవ్వడనాంధ్రుడెవ్వడు? అనే మాటల్లోనూ తెలుగు జాతిలో ఏర్పడిన అపశ్రుతులు తొలగించే ప్రయత్నంలో రత్నకవిగారు తమ కర్తవ్యాన్ని నెరవేర్చారు అని అర్థమవుతుంది.

భారతీయ విజ్ఞాన భాండాగారాలైన వేదములు-ఉపనిషత్తులు - బ్రహ్మసూత్రములలోని అనేక విషయాలను పద్యరూపంలో తెలుగు పాఠకులకు తెలియజెప్పడంలో కవిగారిలోని ఉత్సుకత అభినందనీయము.

"శ్రీమద్వ్యాసమునీంద్ర వాగ్విభవ సుశ్రీనిర్మిత బ్రహ్మసూత్రార్థమ్మగు దర్శనము"ను తానుకూడ దర్శించి "ఒక మృత్పిండము కుండ, మూఢుడను పేర్కొందంగ, నేమాయె నంతకు సర్వమ్మును మృత్తికేగద" అంటూ సాగిన కవిగారి అనువాదంలో వారి ప్రజ్ఞా పాటవాలు పాఠకులకు ప్రస్ఫుటాలవుతాయి.

"ధర్మజనిర్వేదం" వంటి ఖండకావ్యాలు కవిగారికి ఇతిహాస వాఙ్మయముపై గల అధికారానికి గీటురాళ్ళు. వసుచరిత్రవంటి కావ్యములపై సమీక్ష - తెనాలి రామకృష్ణునివంటి కవులపై సమీక్షలు కవిగారికి ప్రబంధవాఙ్మయమెంతటి కరతలామలకమో నివేదిస్తాయి. "మైనాదేవి" కవిగారి దేశభక్తికి ఉదాహరణ. కవిత్వంలో వైభవాలు - నవ్యాంధ్రంలో నవ్య కవిత్వం - రస పర్యవేక్షణం వంటి వ్యాసాలు - ఒటర్లకొక మాట - తెలుగుతల్లి - హితోక్తి వంటి రచనలు కవిగారికిగల సాహిత్య సాంఘిక సమస్యలపట్ల అవగాహనను పాఠకులకు తెలియచేస్తాయి.

బెర్నార్డ్‌షా - కీట్సు - షెల్లీవంటి ఆంగ్లకవుల రచనలు తెలుగు వారికి పరిచయం చేయడం, తన భావాలను సందర్భాన్నిబట్టి ఆంగ్ల భాషలో గూపొందించడం - నాటకాలు - నాటికల రూపాలలో తన భావాలకు సాహిత్యాకృతులు నిర్మించడం చూస్తుంటే కవిలోనిభావన

అవసరమునుబట్టి తానే రూపం ఎన్నుకొంటుంది కాబట్టి భావం వ్యక్తం అయ్యే పద్ధతికి సంపూర్ణ స్వేచ్ఛ అవసరము అని రత్నకవిగారు భావించి ఉంటారనేది స్పష్టం. అందుకోసమే వారి రచనలు అనేక రూపాల్లో దర్శనమివ్వడం జరిగింది.

ఆధ్యాత్మిక పరంగా యోచిస్తే రత్నకవిగారు కృష్ణభక్తులు. కృష్ణకోటి వ్రాసి తరించారు. అందుకే "కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన" అనిన భగవానుని పలుకే ప్రేరణగా రచనసాగించారు. జీవితంలో ప్రతి సంఘటన అనుభవంగా స్వీకరించారు.

"సుఖమోదుఃఖమొ పాలబడ్డదెదియో శోకింప కుప్పొంగక నిఖిలాజాండ సమీకరంగమున నిర్నిద్రులై" నిలిచారు. స్థితప్రజ్ఞులైనారు.

'ఏకోరసః కరుణఏవ' అనిన భవభూతి పలుకులు రత్నకవిగారి కలంలో కలిసిపోయినాయి. "కరుణలేనిదే కవికి వ్యక్తిత్వం లేదు-కవి లేనిదే కరుణకు అస్తిత్వంలేదు" అనిన కరుణశ్రీ మాటలు రత్నకవిగారి సాహిత్యాన్ని చవిచూసినవారికి స్వానుభవాలవుతాయి. "అర్ద్రితకు కవిగారి ప్రతిపలుకూ ప్రమాణమే".

కవిగా సాహిత్యవిహాయసంలో విహంగంగాతీరంలో ఎలా విహరిస్తారో, కర్మయోగిగా కార్యక్షేత్రంలో అంత పరిశ్రమిస్తారు. అదే రత్నకవిగారిలోని వైశిష్ట్యం. నేనేం వ్రాశాను? అని ప్రశ్నించుకొంటూ నేనేం చేశాను ఈ సమాజానికి? అని ఆత్మపరిశీలనకూడా చేసికోవడం రత్నగారి నైజగుణం. దాని ఫలితమే వారికి దరిద్రనారాయణ సంఘం స్థాపించటానికి-గ్రంథాలయం-హరిజన పాఠశాల నిర్మాణానికి-సాహితీ మేఖల ప్రాదుర్భావానికి ఊతనిచ్చింది. ఊపిరిపోసింది.

వివేకానందుడు పేర్కొనినట్లుగా "Have an eastern heart and western mind" అనే భావానికి రత్నకవిగారు ఒక ప్రతీక.

'నిన్న' ను 'నేడు' తో సమీక్షించి 'రేపు' తో భద్రపరచే విశిష్ట లక్షణం రత్నకవిగారి సాహిత్యానికి భద్రపీఠం. అందుకోసం వారికి వేదబుక్కులూ కవితా వస్తువులే ఆకలిమంటలూ కవితాజ్యోతులే అయినాయి.

ఆంధ్రావని మహోజ్జ్వల చరిత్రముచూసి పులకించి భారత జాతీయతను దర్శించి పరవశించి సరిహద్దుతెలుగని సాహిత్యామృతము నాస్వాదించి సమాజసేవకై తన జీవిత సర్వస్వాన్ని అంకితం చేసిన అమృతహృదయుడు అంబటిపూడి వెంకట రత్నకవిగారు. ఆయన జీవితం భారతీయసంస్కృతి అనే పాదులో మొలిచి పరమళించిన పారిజాత వృక్షం.

రత్నకవిగారు భారతీయసంస్కృతిని పాఠకలోకానికి అందించడానికి "తాత్త్వికతరంగాలు" అన్వేషించి "వివేకశిఖరాలు" అధిరోహించి 75 సం॥రాలు కాలంతో పాటు ప్రయాణించి "శాంతితీరాలకు" చేరారు. ఆత్మవిమర్శతో అనుభవాలతో కవితాప్రకటనలిచ్చి సాహితీలోకంలో స్ఫూర్తిప్రదాతగా నిలిచారు.

జీవితానికి ఒక లక్ష్యం ఉంటుందనీ-లక్ష్యసాధనకు ప్రతివ్యక్తీ కృషిచేయాలనీ-అందుకు సాహిత్యం చక్కని ఉపకరణం అనీ విశ్వసించి చిత్తశుద్ధితో చివరిక్షణం వరకు నిలిచిన ఆదర్శమూర్తి రత్నకవిగారు. సనాతన ధర్మాన్ని వినూతనమార్గంలో సమాజానికి అందించిన రత్నకవిగారి జీవిత-సాహిత్యం కొత్తపాతల మేలుకలయిక.

ఉత్తమోత్తమ గురులశిష్యుండనైతి, గురువునయ్యెద సచ్ఛిష్యకోటికెల్ల అనిన కవి సూక్తికి రత్నకవిగారు భాష్య ప్రణేతలు.

"ఈ తెలుగు నాలుకనిచ్చిన మీ ఋణమ్ము ధాత్రి సకలమిచ్చినప్పటికి తీరదు" అని రత్నకవిగారు తమ గురుభక్తిని వెల్లడించుకొంటే

"భావ తరంగములఁ బ్రసన్నములన్ జనియింపగఁజేయుగాదె మీ సదమల ప్రేమవాహిని" అని కవిగారి శిష్యులు నమస్సుమాంజలులు సమర్పించుకొన్నారు. రత్నకవిగారిని ప్రసిద్ధ నవ్యాంధ్ర కవులందరూ ప్రస్తుతించారు. వారి కృషిని ప్రశంసించారు. ఉదాహరణకు రాయప్రోలువారి మాటలు తీసుకొందాం.

"తన అంతః కరణంబు బాహిరవిషాదక్షోభలన్ చీలి
మేళనమై యేగతి నిత్యసాధనల నిల్వాంజాలె నాయాపులో
చనలే పాయక పచ్చగిల్లినవి నీ సాహిత్యమందేత చ
క్కనివయ్యా! భవదీయ సూత్రములు వేంకట్రత్న వాచస్పతీ!"

ఇంతటి సాహిత్య త్రివిక్రమావతారమూర్తి సాహిత్యాన్ని అనుశీలించాలంటే రత్నకవిగారికి ఎన్ని రంగాల్లో ప్రవేశ పాండిత్యాలున్నాయో అన్ని రంగాల్లో అభినివేశం ఉన్నవారికే సాధ్యం. సంస్కృత-ఆంధ్ర-ఆంగ్ల-హిందీ సాహిత్యాలలో తర్క-వేదాన్త వ్యాకరణ మీమాంసాది శాస్త్రాలలో ప్రత్యేకించి జ్యోతిష శాస్త్రముతోను పరిచయం లేనిదే రత్నకవిగారి సాహిత్యంలో విలువలు వెలికితీయడం అసాధ్యం ఎవరికైనా.

అన్నిట సంపూర్ణార్హతలు సంతరించుకొన్న సహృదయులు శ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యంగారు రత్నకవిగారి సాహిత్యాన్ని అనుశీలించడానికి పూనుకొనడం తత్ఫలితాన్ని - సత్ఫలితాన్ని సాహితీమిత్రుల కందివ్వడం సంతృప్తిదాయకం. సుబ్రహ్మణ్యంగారు నిష్ఠతో రత్న పరీక్ష చేశారు. "నరత్నమన్విష్యతి మృగ్యతే హితత్." అనిన సుకవి సూక్తికి నిదర్శనగా నిలిచిన రత్నకవిగారిని వారి సాహిత్యాన్ని తరచి రత్నకవి హృదయం రత్నగర్భ అని ఋజువుచేశారు. సుబ్రహ్మణ్యం గారి "రత్నకవి సాహిత్యానుశీలనం" కవిగారి రచనల బాహ్యస్వరూప క్రమంలో జరిగింది. వారి అముద్రిత రచనలను, అసంపూర్ణ రచనలను

సుబ్రహ్మణ్యంగారు స్వయంగా పరిశీలించి వివరించిన కారణంగా ఈ గ్రంథానికి సంపూర్ణత్వం లభించింది. అనుశీలన అన్వర్థమైంది.

ప్రతి రచనలోను రత్నకవిగారి హృదయాన్ని వెల్లడించడానికి సుబ్రహ్మణ్యంగారు ప్రత్యేక శ్రద్ధవహించారు.

సుబ్రహ్మణ్యంగారి పరిశీలన గ్రంథం చదువుతూంటే—

"జననుత కృష్ణద్వైపా
యన మునివృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడ
తెనుగున రచియింపుమధికధీయుతమెయన్"

అని రాజరాజనరేంద్రుని అభ్యర్థన నన్నయ భట్టారకుని దీక్ష ఒక్కసారి జ్ఞాపకానికి వస్తాయి

సులభమైనభాష-సుస్పష్టమైన భావప్రకటన-సరళమైన శైలి-చక్కని వ్యంగ్యధోరణి రత్నకవిగారి రచనాలక్షణాలు. ఆ లక్షణాలన్నీ సుబ్రహ్మణ్యంగారు కూడ సంపాదించుకొని రత్నకవిగారిని వారి సాహిత్యాన్ని పరిచయం చేయడానికి ఈ గ్రంథంలో కృషిచేశారు రత్నకవిగారి రచనలు రాశిలో వాసిలో సమానములే. వాటన్నిటినీ జాగ్రత్తగా చదివి కవి హృదయం అర్థం చేసుకోవాలంటే ఎంతటి కార్యదీక్ష పాండిత్యాలు అవసరమో ఈ గ్రంథంలో ఉన్న పరిశీలన గ్రంథాల జాబితా చూస్తే తెలుస్తుంది.

"కవిత్వం అంటే ఏమిటి? కవిత్వాన్ని అర్థం చేసికోవడమెట్లా? వ్రాయడం ఎట్లా? కవికి - సమాజానికి ఉన్న సంబంధం ఏమిటి? అనే ప్రశ్నలు కవితాప్రియంభావుకులకు-కవులకు-విమర్శకులకు-సహృదయులైన పాఠకులకు సహజంగా కలుగుతాయి. వాటన్నిటికి ఒక్కటే సమాధానము - "రత్నకవిగారి జీవితాన్ని-సాహిత్యాన్ని చదవండి" అనే మాటే.



## రత్నకవి ప్రశంసానవరత్న మాలిక

1) శ్లో॥ నిర్మాయ కావ్యరత్నాని బహూని గుణవాన్ బుధః
రత్నగర్భాత్వమవనేః కవిరత్నమచీక్లుపత్

2) ప. కవితల్ చెప్పగ నేర్చినాడవుగదా గాంధీపథాలంబివై
నవలాముత్తెము రాధగోల్వపరితో హంసావళి స్తుత్యుడా
నవజీమూతసదృశు జేరి గురుభావప్రాప్త తత్త్వుండవై
నవరత్నావిధనావనైక మతిచే నారాయణుంజేరితే.

3) శ్లో. ఆంగ్లాంధ్ర గీర్వాణవచస్సు కృత్వా
అనూద్యకావ్యాని కవిత్వకన్యాం
ఆంధ్రావనీ మండల పావితాత్మ
విభూషయామాస నితాంతహృద్యామ్.

4) ప. కరుణాసాగర దీనమానవమనః కల్హారహంసుండవై
చిరకాలార్జిత పుణ్యసంపదల సచ్ఛాత్రంబులంగొనియున్
హరిపాదద్వయ భక్తిచే సుకవితా హారావళింబొందియున్
ధరణిన్ నైష్ఠిక కర్మలన్ సలిపి విద్వద్గోష్ఠిరాణించితే.

5) శ్లో॥ సంస్కృతిం భారతీయానాం పాశ్చాత్య విదుషాం స్థితిమ్
సంశీల్యోభయ పూజార్హాం పథానమ సృజద్గుణీ

6) ప. వేంకటరత్నకవీశ్వర
నాకౌకః ప్రభవవాక్య నవతాభాసీ
వైకల్యజన సమర్చా
వైకుంఠపదారవింద వరణశ్రేష్ఠా

7) శ్లో॥ శిష్యకోటిషు చ వత్సలత్వభా
గన్నదాన నిరతో విరజాస్త్వమ్
దర్శితాగురుషు శిష్యతాత్వయా
సేవితోఽసి బహుధా సుహృద్గణైః

8) ప. విబుధుల్మెచ్చగ కూర్చినాడవు మహావీరాంజలిన్ సంస్కృతిన్
నిబిడీభూత పరోపకార సగుణోన్నేయ స్థిత ప్రజ్ఞతా
విభవ! ప్రస్తుత నందగోప విదితవ్యేతున్ నినున్గొల్తునే
నబలా గౌరవపాలనైక గొనుమా యాంధ్రీశపద్యాంజలిన్

9) శ్లో॥ సంగతిం లభతే రత్నం రత్నేనేతి జనశ్రుతిః
కావ్యరత్నాని దదతా కవిరత్న స్ఫుటీకృతా.

# మహాకవి శ్రీ అంబటిపూడి వేంకటరత్నం
# కవిగారి జీవితం

స్వస్తిశ్రీ ప్లవంగనామ సంవత్సర పుష్యశుద్ధ ద్వితీయా ఆదివారం అనగా 5-1-1908 వ తేదిన సూర్యోదయాది పదునెనిమిది ఘడియలకు అనగా 1 గం: 58 ని.లకు శ్రీ సుబ్రహ్మణ్యం, సుబ్బమ్మలనే పుణ్య దంపతులకు శ్రీ అంబటిపూడి వేంకటరత్నంగారు మేషలగ్న వృశ్చికనవాంశమందు జన్మించిరి. ఏదుబాడు గ్రామం.

## కవిగారి వంశ చరిత్ర

వీరి వంశానికి వైశ్వామిత్ర. అఘమర్షణ, కౌశికులు ఋషులు, కౌశికసగోత్రులు. ఆపస్తంబసూత్రులు. యజుశ్శాఖాధ్యాయులు. పూర్వం అలంఘిర్ పాదుషా ఆస్థానంలో ఒక వేశ్య తన నృత్యకళాప్రావీణ్యాన్ని చూపి సభాసదులను మెప్పించింది. తరువాత పాణిగ్రహణంచేసి తనను గ్రహింపుమని కోరింది. ఆస్థానకవి గూడ గుణవతియైన ఈమెను స్వీకరించడం సమంజసమని చెప్పాడు. ఆ రోజులలో కుండిన నగరంలో దారుణమయిన కరువు సంభవించింది. ఆ క్షామబాధ ప్రజలనెంతగానో పీడించింది. కుండిన నగరవాసులు తమ పరిస్థితులను రాజుకు లేఖల ద్వారా తెలియజేసిరి. ఆ రోజు సభాంగణంలో ప్రవేశించి నగరం విడిచి వెళ్ళడానికి నిశ్చయించుకున్నామని తెలియజేసారు. భూపాలుడామాటకు కలతనొంది నగరం విడచి వెళ్ళవద్దనీ ధాన్యం పంపిస్తానని చెప్పి ఓదార్చాడు. తరువాత విప్రులందరి సమక్షంలో ఈ క్షామబాధ నెవరైనా

పోగొట్టగలరా? యని ప్రశ్నింపగా శ్రీ అంబటిపూడి రామకృష్ణసోమయాజులు, శ్రీ రామభద్ర సోమయాజులు లేచి ఇరువది రెండు రోజులు తపోనిష్ఠలో నుండి వరుణ జపం చేయాలనీ అయితే ఈ కాలములో అన్నదానం జరిపించాలనీ చెప్పి "ఓం యూవతీర్వై కా............ దేవతా అనే మంత్రమునుపఠించారు". "అహమన్న మహమన్న మహమన్నాదః" అనే మంత్రాన్ని నైష్ఠికులై జపించారు. భూపతి అన్నదానం చేయగా ఇరువదిరెండవరోజున సలిలధారలు కురిసినవి. నృపతి ఈ ప్రక్రియకు సంతసించి ఏడుబాడు, మక్కెన యనే యగ్రహారాలను ఇద్దరికీ దానం చేసాడు. ఈ వృత్తాంతం క్రీ. శ. 1104 లో జరిగింది.

## వంశవృక్షం

అంబటిపూడి కామయ్య (చినకామయ్య)

వెంకయ్య




చినకామన్న : వీరు రత్నకవిగారికి ముత్తాతగారు. వీరు వ్యవసాయం చేస్తూ, నిరంతరం దేవతార్చనా పరాయణులై కాలం గడిపిన మహనీయులు.

వెంకయ్యగారు : వీరు రత్నకవిగారికి తాతగారు. వీరు తండ్రి మార్గం లోనే పయనించి వ్యవసాయం, దేవతార్చన చేసారు. వీరు సంస్కృత భాషలో మంచి విద్వాంసులు. నిరంతర రామాయణ పారాయణా దీక్షులై రామాయణాన్ని పురాణం చెప్పేవారు. అక్కడక్కడ వ్యాఖ్యానంలోని వివిధ విషయాలను ప్రతిపాదిస్తూ శ్రోతలకు అమం దానందాన్ని కూర్చేవారు. ఎవరేమడిగినా లేదనక ఇచ్చిన వితరణశీలి.

సుబ్రహ్మణ్యం : వీరు తండ్రిగారి ప్రోత్సాహంతో Matriculation వరకు ఆంగ్ల విద్యాభ్యాసంగావించారు. ఇంటివద్ద సంస్కృతాంధ్రభాషలను న్యాయవేదాంత శాస్త్రములను పఠించారు. సీతా రామాంజనేయ సం వాదమనే ఆధ్యాత్మికగ్రంథాన్ని మూడునెలలకాలంలో కంఠస్థంచేశారు. వీరు తమ జీవితకాలంలో వైకుంఠఏకాదశి, నరసింహాజయంతిపండుగలను వైభవంగా జరిపించేవారు, వ్యవసాయంలోని మెళకువులను గ్రహించి పంటలుపండించేవారు. వీరికి ముగ్గురు కుమార్తెలు, ఇద్దరు కుమారులు.

శ్రీ అంబటిపూడి వేంకటరత్నంగారు : వీరే మనం పరిశీలిస్తున్న కవి శేఖరులు. శ్రీ అంబటిపూడి సుబ్రహ్మణ్యం, సుబ్బమ్మయను పుణ్యదంపతులకు ప్రకాశం జిల్లాలోని యేదుబాడు అగ్రహారంలో జన్మించారు. వీరి జనన తేదీ 5-1-1908. వీరి నామధేయం, వీరి తాతగారి నామధేయం ఒకటే. ఏదుబాడు అగ్రహారంలో శ్రీ మాధవపెద్ది వెంకట నరసయ్యగారి వద్ద కవిగారు అక్షరాభ్యాసం చేసారు. నరసయ్యగారు కవిగారికి ఆంగ్లా క్షరములను ఆంధ్రాక్షరములను నేర్పిరి. తండ్రిగారు వీరి యెనిమిదవ సంవత్సరంలో శాస్త్రీయంగాఐదురోజులు 'అష్టవర్షం బ్రాహ్మణముపనయీత' యనే ధర్మశాస్త్రాన్ని అనుసరించి ఉపనయనం జరిపారు. పొన్నూరు నగరాన్ని చేరి యచటి హైస్కూలులో ఆరవతరగతినుండి తొమ్మిదవ

తరగతి వరకు విద్యాభ్యాసం చేసారు. ఈ సమయంలో శ్రీ నాదెళ్ళ కుటుంబరావుగారు, శ్రీ గోగినేని రంగనాయకులుగారు, శ్రీ పాముల పాటి వెంకటకృష్ణయ్యచౌదరిగారు వీరికి మిత్రులయినారు. 1919 లో శ్రీ బాలగంగాధరతిలక్ గారు మరణించడం. గాంధీగారి ఉద్యమం జరిగాయి. ఆ కాలంలో వీరి చదువు ఆగిపోయింది. వీరు బందరు వెళ్ళి యచట తొమ్మిదవ తరగతిలో చేరి. శ్రీ చెరుకువాడ నరసింహంపంతులు గారు వీరికి యాంగ్ల భాషను, శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తెనుగు బాసను బోధించేవారు. స్వాతంత్ర్యోద్యమ ప్రభావితులై విద్యార్థులకు నాయకత్వము వహించి తిలక్ స్వరాజ్యనిధికై డబ్బాలను పట్టుకొని వీధులలో తిరిగి చందాలు వసూలుచేయడం జరిగింది. వీరి పితృదేవులు వీరిని తిరిగి యేదుబాడు తీసుకొని వెళ్ళడం జరిగింది.

తరువాత రత్నకవిగారు నల్లపాడు గ్రామములో శ్రీ బండ్లమూడి వెంకయ్యశాస్త్రిగారివద్ద సంస్కృతభాషాధ్యయనం చేస్తూ కాళిదాసుని రఘువంశ కావ్యాన్ని పఠించారు. ఆ సమయంలో శ్రీ వెంకయ్యశాస్త్రి గారి తనూజుడైన శ్రీ వెంకట కృష్ణయ్యగారు సబ్రహ్మచారిగా నుండేవారు.

తరువాత తిమ్మరాజుపాలెంలో శ్రీ ప్రతాపకృష్ణమూర్తిశాస్త్రిగారి వద్ద సంస్కృతబాషాబద్ధాలైన రఘువంశం, మేఘసందేశం, కిరాతార్జునీయం, శిశుపాలవధమ్, నైషదీయ చరితమనే పంచకావ్యాలను పఠించారు. అట్టి విద్యాభ్యాస సమయంలో కృష్ణమూర్తిశాస్త్రిగారి అనుజుడైన శ్రీ హనుమచ్ఛాస్త్రిగారు శ్రీ అంబటిపూడి నరసింహశర్మగారు వీరికి సహాధ్యాయులైరి. కృష్ణమూర్తిశాస్త్రిగారు రత్నంగారిని రాజమహేంద్రవర సమీపము నందలి కడియం గ్రామానికి తీసికొని వెళ్ళారు. అచట

ప్రసిద్ధ విద్వాంసులైన శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి వద్ద సిద్ధాంత కౌముది కొంత చదివారు. కొంతకాలం గడిచాక పెద్దలు ద్రాక్షారామంలోని శ్రీ జయంతి సూర్యనారాయణశాస్త్రిగారి వద్ద మిగిలిన కౌముదిని చదువమని వెంకటరత్నంగారిని పంపించారు. వీరివద్ద కౌముది అభ్యసిస్తున్న రోజులలో శ్రీ మల్లాది రామకృష్ణచైనులుగారి పుత్రుడైన శ్రీ దక్షిణామూర్తిగారు ఆగిరిపల్లికి విద్యాభ్యాసానికై రత్నంగారి నాహ్వానించారు.

ఆగిరిపల్లిలో శ్రీ మల్లాది కృష్ణమూర్తి గారు, వెంకటరత్నంగారూ కలసి విద్వద్వరిష్ఠులైన శ్రీ సంపత్కుమారాచార్యుల వారివద్ద పశిష్ట కౌముదిని అభ్యసించారు. ఇక్కడ సేగల శ్రీ స్వయంపాకుల వెంకటరమణ శాస్త్రిగారు వీరికి చింతన చెప్పేవారు. ఇలా కొంతకాలం గడిచాక "చీరివాడ"లోని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారిని విద్యా సముపార్జనకై సమీపించారు. శివరామశాస్త్రిగారు సంస్కృతాంధ్రాంగ్లాలలో దిగ్దంతులు. సర్వతోముఖ ప్రతిభా సమున్మేష నిరూపిత దిగన్త విశ్రాంతకీర్తులు. గురువుగారి బహుముఖ విద్వత్తకవిగారికి సర్వాంగీణాహ్లాదాన్నిచ్చేది. తాదృశులైన శివరామశాస్త్రిగారి సాన్నిధ్యంలో వ్యుత్పత్త్యభ్యాస సమేతమైన వీరి ప్రతిభ వన్నెకెక్కినదని చెప్పవగును. ద్విసంవత్సర కాలము గడచినది. శ్రీ అరవిందుని ఆంగ్లగ్రంథ బోధనా సమయంలో స్కూలుఫైనల్ వరకు ఆంగ్లవిద్య నభ్యసించినగాని అరవిందుని భాషాబోధనమలవడదని చెప్పిన మాటననుసరించి యింటికివచ్చి కావలిలోని పాఠశాలలో జేరి తొమ్మిదవతరగతిని పూర్తి జేసిరి. పిమ్మట గుంటూరునగరమందలిపాఠశాలలో జేరి హైస్కూలు విద్యను పూర్తిజేసిరి. U.L.C.M. హిందూ హైస్కూలునందు విద్యాభ్యాసముసాగినది. పిమ్మట గుంటూరు నగరమందలి A. C. కళాశాలలో జేరి F. A. పరీక్ష పూర్తి జేశారు. అదే కళాశాలలో B. A., ఆంధ్రము, చరిత్ర ముఖ్యవిషయము

ప్రసిద్ధ విద్వాంసులైన శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి వద్ద సిద్ధాంత కౌముది కొంత చదివారు. కొంతకాలం గడిచాక పెద్దలు ద్రాక్షారామంలోని శ్రీ జయంతి సూర్యనారాయణశాస్త్రిగారి వద్ద మిగిలిన కౌముదిని చదువమని వెంకటరత్నంగారిని పంపించారు. వీరివద్ద కౌముది అభ్యసిస్తున్న రోజులలో శ్రీ మల్లాది రామకృష్ణచైనులుగారి పుత్రుడైన శ్రీ దక్షిణామూర్తిగారు ఆగిరిపల్లికి విద్యాభ్యాసానికై రత్నంగారిని ఆహ్వానించారు.

ఆగిరిపల్లిలో శ్రీ మల్లాది కృష్ణమూర్తి గారు, వెంకటరత్నం గారూ కలసి విద్వద్వరిష్ఠులైన శ్రీ సంపత్కుమారాచార్యుల వారివద్ద శిష్ట కౌముదిని అభ్యసించారు. ఇక్కడనేగల శ్రీ స్వయంపాకుల వెంకటరమణ శాస్త్రిగారు వీరికి చింతన చెప్పేవారు. ఇలా కొంతకాలం గడిచాక "చీరివాడ"లోని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారిని విద్యా సముపార్జనకై సమీపించారు. శివరామశాస్త్రిగారు సంస్కృతాంధ్రాంగ్లాలలో దిగ్గంతులు. సర్వతోముఖ ప్రతిభా సమున్మేష నిరూపిత దిగన్త విశ్రాంతకీర్తులు. గురువుగారి బహుముఖ విద్వత్తు కవిగారికి సర్వాంగీణాహ్లాదాన్నిచ్చేది. తాదృశులైన శివరామశాస్త్రిగారి సాన్నిధ్యంలో వ్యుత్పత్త్యభ్యాస సమేతమైన వీరి ప్రతిభ వన్నెకెక్కినదని చెప్పవచ్చును. ద్విసంవత్సరకాలము గడచినది. శ్రీ అరవిందుని ఆంగ్లగ్రంథ బోధనా సమయంలో స్కూలుఫైనల్ వరకు ఆంగ్లవిద్య నభ్యసించినగాని అరవిందుని భాషాబోధనమలవడదని చెప్పిన మాటననుసరించి యింటికివచ్చి కావలిలోని పాఠశాలలో జేరి తొమ్మిదవతరగతిని పూర్తి జేసిరి. పిమ్మట గుంటూరునగరమందలిపాఠశాలలో జేరి హైస్కూలు విద్యను పూర్తిజేసిరి. U.L.C.M. హిందూ హైస్కూలునందు విద్యాభ్యాసముసాగినది. పిమ్మట గుంటూరు నగరమందలి A. C. కళాశాలలో జేరి F. A. పరీక్ష పూర్తి జేశారు. అదే కళాశాలలో B. A., ఆంధ్రము, చరిత్ర ముఖ్యవిషయము

చార్యులు, శ్రీ కురుగంటి సీతారామయ్యగార్లు ఉపన్యాసకులుగ నుండి రత్నకవిగారి బహుముఖ ప్రజ్ఞను వేనోళ్ళ కొనియాడి యుండిరి. 1936వ సంవత్సరములో చందూరు గ్రామమున "సాహితీమేఖల" యను సాహిత్య సంస్థను నెలకొల్పి సాహితీ తత్త్వ జిజ్ఞాసను ప్రజలలో బలపరచుటయేగాక అనేకమంది రచయితల గ్రంథములను వెలుగులోనికి దెచ్చిరి. బంగ్లాదేశము నుండి శత్రుపీడితులై భారతదేశమునకు వచ్చిన వారిని వారి నాయకు డగు ముజిబుర్ రెహమానును ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ఆదరించుట యనునితివృత్తమును "ఇందిరా విజయమ్" అను నాటకముగా వ్రాసిరి. ఆ సందర్భమున వీరు శ్రీమతి ఇందిరాగాంధీని కలసికొని వారితో ఫొటో తీయించుకొనిరి.

శ్రీ రత్నకవిగారు ప్రాక్తన సంస్కారబలముచే శ్రీకృష్ణునియందు మనస్సును లగ్నము జేసి భక్త్యావేశముచే తన్మయావస్థ నొందుచుండెడి వారు. వీరు శ్రీకృష్ణభక్తులై కృష్ణ నామోచ్చారణము చేయుటయే గాక కృష్ణకోటిని వ్రాసి సార్థకజన్ములైరి. "మోక్షమిచ్ఛేత్ జనార్దనాత్" అను వృద్ధ వాక్యము ననుసరించి మోక్షమును గోరువారు జనార్దనుని సేవింపవలెను. ముముక్షువులు శ్రీకృష్ణ భక్తులై భాగవతమును చదివి తరింతురు. "కృష్ణేత్యక్షర యోరయం మధురిమోద్గారః క్వచిల్లక్షితః" అని జగన్నాథ పండితుడు కృష్ణుని సేవించి తరించెను. యథాకృష్ణార్పిత ప్రాణః తత్పూరుషనిషేవయా" యని భాగవతము కృష్ణభక్తిని బోధించు చున్నది. "ఏకో దేవో దేవకీ పుత్రఏవ" యని శ్రీ రామానుజాచార్యుల వారు శ్రీకృష్ణుని పరమాత్మనుగా నంగీకరించి యుండిరి. "కృష్ణత్వదీయ పదపంకజ పంజరాన్తః, అద్యైవమే విశతు మానసరాజ హంసః" అని కులశేఖరాళ్వారులవారు శ్రీకృష్ణునే ధ్యానించి ముక్తి నందిరి. పరమ

హంస జనసంసేవ్య కృష్ణుని ధ్యానించి తరించుట వీరి ఉత్కృష్టోత్తమ మార్గాను యాయిత్వమునకు తార్కాణము.

దానములలోకి అన్నదానముగొప్పది. "నహ్యాన్నేన సమందానం" అని అన్నదానమునకు మించిన దానము లేదు. వీరు సామ్యవాదులై ధనిక దరిద్ర భేదమును మఱచి పేదలకన్నదానము చేసి ఇతరులకాదర్శ ప్రాయులైరి.

వీరు 1935వ సంవత్సరములో రాధాకృష్ణుల బొమ్మ గీసిరి. కేవల ముకనితా మార్గము, భజనల ద్వారానేగాక చిత్రకళద్వారా శ్రీకృష్ణుని అర్చించి కళ భగవదారాధన కొఱకే ననెడి సత్యమును నిరూపించిరి. తమ జన్మస్థలమైన ఏదుబాడు లో గురుముఖతః సంగీతము నభ్యసించి వేణువు నూదుచూ శ్రీకృష్ణుని ధ్యానించుచూ శాస్త్రము లన్నియూ భగవంతుని చేరుటకు మార్గములే యను తత్త్వమును చాటిచెప్పిన ధన్య జీవులు.

ఆంధ్ర ప్రాంతమున జన్మించి తెలంగాణమున సాహితీ వ్యవసాయ మును సలిపి ఆంధ్ర తెలంగాణముల సౌమనస్యమును పెంపొందించిరి. చండూరు గ్రామమును చేరి యచటి వారికి విద్యాబోధ జేయుచూ యచట గల మామిడి తోటలో బ్రహ్మచర్యము నవలంబించి బ్రహ్మ చర్యాశ్రమమునకు శోభను వెలార్చిరి.

వికలాంగులను స్వహస్తములతో సత్కరించి మానవతా ధ క్పథ మున పయనించి సర్వజన సమానత్వమును బోధించిన వీరు మహనీయు లనుటయందు విప్రతిపత్తి యేమున్నది?

వీరు దరిద్రనారాయణ సంఘమును స్థాపించి పేదలకు అన్న దానమును, వస్త్రదానమును చేసి ఆచరణలో కూడిన సిద్ధాంతము రాణించునని లోకమునకు తెలిపిన వీరు ఆదర్శ జీవులనుట సర్వజన విదితమే గదా.

అంబటిపూడివారు "కస్తాల" గ్రామమున "విద్యానాథ గ్రంథాలయము"ను స్థాపించి సర్వులకు విద్యనార్జించుట కవకాశమొసగి "విద్యావిహీనః పశుః" యన్నట్లు వారిని పశుత్వమునుండి మానవత్వమునకు నడిపించిన విద్యాప్రదాత. ఇట్లే "చందూరులో" ఆంధ్రరత్న పఠనమందిరము"ను స్థాపించిరి. ప్రకాశం పంతులుగారిపేర విద్యానాథుని పేర గ్రంథాలయములు నెలకొల్పుట వీరికి ఆంధ్రులపై గల యభిమానమును స్ఫుటీకరించుచున్నది.

గాంధీమహాత్మునికివలె వీరికిని ప్రధానలక్ష్యము దీనజనోద్ధరణమే. "హరిజన పాఠశాల"ను నెలకొల్పి చిరకాలమునుండి విద్యాగంధము లేక అజ్ఞానమున తపించుచున్న దీనులైన హరిజనులకు విద్యాకాంతి నొసగి చిరస్మరణీయులైరనుట యతిశయోక్తి కానేరదు. వీరు భోగలాలసులై విలువైన వస్త్రముల ధరింపక సామాన్యము, స్వదేశీయము నైన ఖద్దరునే ధరించి తమ దేశభక్తిని ప్రదర్శించి భారతమాత ఋణములను తీర్చుకొనిరి. గ్రంథాలయముల కనేక పత్రికలను తెప్పించెడి వారు.

వీరు సంస్కృతము, ఆంగ్లము, ఆంధ్రభాషలను సంపూర్ణముగ పఠించి తత్స్వర్శిత్వమునుపొందిరి వీరికి ఉర్దూ అక్షరములు కొన్ని తెలి యును. ఒకతూరి వీరి గ్రంథాలయములను అమీనుషు అపుచేయించెను. వీరు సరాసరి తలగుడ్డజుట్టుకొని కార్యాలయమున ప్రవేశించిరి. అచట ఎవరికినీ తలయొగ్గి సలాముచేయరైరి. ఉర్దూభాషయందు సంభాషణ

చేయక స్వభాషయందే ముచ్చటించిరి. ఈ సంఘటన వారి స్వతంత్ర ప్రతిపత్తిని, వ్యక్తిత్వమును, గాంభీర్యమును తెలియజేయుచున్నది.

పిమ్మట పెద్దలతో సంప్రదించి ఆగిపోయిన హరిజన పాఠశాలను తిరిగి ప్రారంభించుట కనుమతిని పొంది. పాఠశాలద్వారా ప్రజాసేవచేసిరి. ఇది వారి కార్యనిర్వహణాదక్షతకు గీటురాయి యన వచ్చును.

ప్రతి శుక్రవారము హరిజనులు మొదలగు వారితో కలసి, కుంకుమను ధరించి శ్రీకృష్ణ భజనచేసి, పిమ్మట అన్నదానమును జరిపి వారితో భోజనముచేసి సర్వసమానత్వమును స్థాపించిరి. ఇది వారి హృదయ వైశాల్యమును ఎలుగెత్తి చాటుచున్నది.

శ్రీ అంబటిపూడి వెంకటరత్నంగారు B. A., చదివిన రోజులలో A. C. కాలేజీకి శ్రీ H. H. Siphs, M. A., Phd. గారు ప్రధానాధ్యాపకులుగ నుండిరి. వారు కవిగారిని గూర్చి నియమానుసారులు, గాఢాభిలాషులు, శ్రమించు విద్యార్థి, మంచి అభివృద్ధిని సాధించిన వారని నడవడిని తెలుపు యోగ్యతాపత్రమునందు నుడివిరి.

"Earnest, Regular and hard working student and made good Progress in his classes" — Conduct Certificate.

గురువరేణ్యులైన శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారిని గూర్చి వీరు "భక్త్యంజలి" యను పేర కొన్ని పద్యములను వ్రాయుటయేగాక గురువుల శతావధాన పద్యములను గ్రంథరూపమున ప్రకటించుటకు ప్రయత్నమొనర్చి గురుభక్తిని ప్రదర్శించుకొనిరి. శైశవముననే విద్య నేర్పిన గురూత్తముల ఋణము ధాత్రి నిచ్చినను తీరదని ఇట్లు వాకొనిరి —

పసితనమందు నన్నని యపారకృపన్ దగు విద్దెసెప్పి సం
తసమున దేర్చి యీ తెనుగు నాలుకనిచ్చిన మీ ఋణమ్ము ధా
త్రి సకల మిచ్చినప్పటికి దీరదు గాన దయామయా నమః
కుసుమముని త్తు రిక్తుడను కోపములేదుగదా గురూత్తమా"

ఇంకా వారివద్ద నేర్చినదే విద్యయని మీ కుటీ పరిసరమందు నేర్చినదె పాఠము మీరె గురుల్ గురూత్తమా! యనిరి. "మీదు బోధనాభ్యాసనము సాజమున్ దొరకదప్పటి కిప్పటి కెచ్చటన్ గురూ" యని యదార్థ కథనము చేసిరి. ఇవి వీరి గురుభక్తి పరాయణతకు చక్కటి లక్ష్యములు.

రత్నకవిని గూర్చి శిష్యులు ప్రశంసించుటచే వీరి శిష్యవాత్సల్యము, అనేకమంది విద్వాంసులు వీరిని మెచ్చుటచే వీరి సౌజన్యము తెలియుచున్నవి. "శతేషు జాయతే శూరః, సహస్రేషు చ పండితః వక్తాదశ సహస్రేషు దాతా భవతి వా న వా" యను సూక్తి నూఱు మందిలో శూరుడు. వేలమందిలో యొక విద్వాంసుడు. పదివేల మందిలో వక్తయుండుననిదాత మాత్రము దుర్లభమని చెప్పుచున్నది వీరిలో ఈ నాల్గు గుణములు గలవని చెప్పుట నిశ్చపరిచము. ఎవరే మడిగిననూ కాదనక ఇచ్చుట వీరి దాతృత్వమునకు ప్రతీక. వీరి సోదరులైన మార్కండేయశర్మగారు స్వర్గతులైన తరుణమునను, ప్రియశిష్యులైన శ్రీ సిరిప్రెగడ భార్గవరావుగారు దివంగతులైనవుడు వీరు విలపించిన విధము లక్ష్మణమూర్ఛా వ్యసనాకులుడైన శ్రీరాముని దలపించుచున్నది. కవిగారు మాళవికాగ్ని మిత్రాది నాటకములను కోరినంతనే పుత్రునికొఱకు గ్రంథమువంతను వ్రాసియిచ్చిరట. ఇది వారి పితృహృదయమునకు, వాత్సల్యమునకు మచ్చుతునక.

ఒకసారి రాయప్రోలు సుబ్బారావుగారికి తన తొలికావ్యమైన ప్రణయవాహినిని అభిప్రాయనిమిత్తం పంపారు. ఈ కావ్యమును

శ్రీ సుంకవరం ప్రతాపరెడ్డిగారు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ప్రశంసించిరి. ముద్రింపబడిన యీ గ్రంథమునొక పళ్ళెరమునందుంచి యీ పళ్ళెమును కవిగారితో బాటు పల్లకీలోనుంచి మంగళహారతులతో వాద్యములు మ్రోగుచుండగా శిష్యులు మోసికొనివచ్చిరి.

చందూరులో కవిగారి "మేలిముసుగు" "స్వప్నకాంతుడు" నాటకాలు శ్రీ రామచంద్రమూర్తిగారి ఆధ్వర్యంలో ప్రయోగింపబడ్డాయి. అజిత, సాగర్ పాత్రలను శ్రీ అ. సుమిత్రాదేవిగారు పోషించారు. శ్రీ ధవళ శ్రీనివాసరావు, శ్రీ పులిజాల హనుమంతరావు శ్రీ భార్గవరావు, శ్రీ కృష్ణశర్మగారలు దక్షిణనాటకాన్ని చందూరులో ప్రదర్శించారు.

ఆంధ్ర సారస్వత పరిషత్తు వారి సభకు అధ్యక్షత వహించిన శ్రీ అంబటిపూడివారిని శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు ప్రశంసించియుండిరి. వీరు చందూరులో నివసించే సమయంలో "రాధే గోవింద కృష్ణ! రాధే గోపాలకృష్ణ" యనే నినాదంతో భజనచేస్తూ గ్రామస్థుల నుండి బియ్యాన్ని సేకరించి ప్రతి శుక్రవారం పేదలకు అన్నదానం చేయడం కవిగారి దీనపాలనకు నిదర్శనం. మృతులైన అనాథలకు దహనసంస్కారాలు చేయించడం వీరి మానవతకు చిహ్నం. హరిజన పాఠశాలను నెలకొల్పి వారికి విద్యాదానం చేశారు. ఎంతోమందికి హిందూమతాభిమానాన్ని కలిగించి మతమార్పిడులను నిరోధించారు. శ్రీ పులిజాల హనుమంతరావుగారి సన్మానసభలో ప్రసంగించిన శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ, శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి, శ్రీ నూకల సర్వోత్తమ రెడ్డిగారలు, పులిజాల వారినింత వానినిగా తీర్చిదిద్దిన శ్రీ వెంకటరత్నంగారు ప్రథమ ప్రశస్యులని నొక్కి వక్కాణించిరి.

1946 లో జరిగిన "సాహితీమేఖల" దశమ వార్షికోత్సవ సభకు అభినవ పోతన శ్రీ వానమామలై వరదాచార్యులు, శ్రీ దేవులపల్లి రామానుజరావు, కొప్పరపు కవులు, సత్యనారాయణ కవులు, శ్రీ మాడపాటి హనుమంతరావు, శ్రీ సురవరం ప్రతాపరెడ్డి, శ్రీ దాశరథి రంగాచార్య, డాక్టర్ సి. నారాయణరెడ్డి, శ్రీ బిరుదరాజు మొదలగు వారిని వెంకటరత్నంగారు ఆహ్వానించి ఉచితరీతిని సత్కరించారు. ఈ సంఘటన వారి పండితాభిమానానికి మచ్చుతునక. అది శ్రీ సిరిప్రెగడ భార్గవరావుగారి వివాహసమయం. ఆనాటికి సాహితీమేఖలను స్థాపించి యిరువదిరెండు వత్సరములైనవి. ఆ కారణంగా యిరువదిరెండు జతల వృషభములతో కూర్చిన బండిపై కవిగారినూరేగించి సత్కరించిరి. గీతావిజ్ఞానాంధ్ర కళాశాలకు పీఠాధ్యక్షులుగా నుండి కళాశాల సర్వతో ముఖాభివృద్ధికి కృషిచేసిరి ఆ కాలంలో విద్యార్థులలో సాహిత్యాభిలాషను పెంపొందించుటకై శ్రీ వానమామలై వరదాచార్యులు. శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ మొదలగువారిచే సాహిత్య ప్రసంగాలను శ్రీ దూపాటి సంపత్కుమారాచార్యుల వారిచే అష్టావధానములను జరిపించిరి.

విద్యాభ్యాసకాలములో తిమ్మరాజుపాలెంలోని శ్రీ ప్రతాప కృష్ణమూర్తిశాస్త్రిగారిచెంత సంస్కృతభాషా పాండిత్యాన్ని గడించడ మొక విశేషం. ఒక పర్యాయం శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు తమ అవధాన నైపుణ్యాన్ని యింటివద్దనే పరీక్షించుకోదలచి పద్యానికి ఒక్కొక్క పాదం చొప్పున నూటు పాదాలను చెప్పి మరల రెండు, మూడు, నాల్గు పాదాలనిదేవిధంగా పూరిస్తూ శతావధానం చేశారు. అనంతరం నే చెప్పిన పద్యాలను చెప్పగలవా? యని వేలూరి వారు రత్నకవిగారి నడిగిరి. అంత వెంకటరత్నంగారు నలుబది పద్యములను చెప్పగలిగిరట. వేలూరివారు నూటు పద్యములను చెప్పియుండిరి.

వేంకటరత్నంగారు చందూరులోనున్న సమయంలో ఒకనాడు సత్కాల క్షేపమును చేయుచుండిరి. అంత నొక యాచకుడు సమీపింప పై వస్త్రము నాతనికి బహూకరించి కేవలము బనియనుతో మాత్ర ముండి రట. ప్రక్కనున్నవారు ఉన్న యొక వస్త్రమును యిచ్చివేసి రేమని యడిగిరట. భగవానుడైన శ్రీకృష్ణుడే సర్వజీవుల రక్షణభారమును చూచుకొనునని నిశ్చింతగా బలికి భక్తితోనుండిరి. అంత కొంత తడ వైన పిమ్మట నొక సాలెవాడు తన క్రొత్త మగ్గములపై నేసిన మొదటి వస్త్రమును కవిగారి కొసంగి నమస్కరించి వెడలెను. ఇది వారి దాతృత్వమునకు, అచంచలత్వమునకు తార్కాణము.

మద్యపాన నిషేధ ప్రచారమీనాడు కేవలం మాటల్లోనే కనిపి స్తుంది. కవిగారు పద్యాలలో కవితలల్లి, తాను కృతార్థులైనట్లు భావించలేదు. సామాన్యుల నడుమ సంచరిస్తూ "కల్లొద్దురా బాబు కల్లొద్దురా" వంటి గీతాలను సులభశైలిలో రచించి పాడుతూ మద్య పానం నుండి ఎంతోమంది అమాయకులను నివారించారు. కేవలం తాను భోగాలనుభవిస్తూ, పేదలపై కవితలల్లినంత మాత్రాన మహాకవి కాలేడని నా భావన. రత్నకవిగారు పేదలకు తన ధనాన్ని వినియో గిస్తూ, కవితలల్లుతూ రాజిల్లిన సార్థకజన్ములు. "నరి దరిద్రతయా పరితాపితే వ కవితా క్షుధయా హృది మోదదా" అని మానవత్వం ఉదారత లేని కేవల కవులను "శక్తినుతి" యనే సంస్కృత భక్తి కావ్యంలో నేను నిరసించాను. రత్నకవిగారు అందుకు భిన్నులు, సజ్జ నాగ్రేసరులు. వారికనేక నమస్సుమాలు.

---

"మతము పవిత్రము జీవ
న్మృతుడతడెవ్వాడు దాని మీఱి చరించున్
(మొరానుకన్య)

తత్కాల గ్రహ సంపత్తిని పరిశీలింప వారి జాతకచక్ర మిట్లున్నది.

| | | | |
|---|---|---|---|
| కు | అ | | రా |
| శ | రాశిచక్రం | | గు |
| చం శు | | | |
| ర బు కే | | | |

| | | | |
|---|---|---|---|
| | రా చం | | శ శు |
| | అంశచక్రం | | |
| | | | కు బు |
| గు | | ర కే | |

జన్మకాల చంద్రదశాశేషము: 8సం॥-8నె॥-25రో.

## జ్యోతిశ్శాస్త్రము ననుసరించి కవిగారి పాండిత్యాదులు

లగ్నాధిపతి కుజుడై నందున యాతడు మిత్రక్షేత్రమున మిత్ర దృష్టినొందుట వలన ధైర్యము, పట్టుదల, కార్యసాధన, కష్టముల నెదిరించు స్వభావము సూచితములు. దశమశుక్రుడు న్యాయనిర్ణేతృత్వము నిచ్చును. శుక్ర చంద్రస్థితివలన కవిభావుకులు. రావలువుచ్చలో నుండుటవలన వ్యక్తిత్వము, బృహస్పతి విద్యాస్థానమున బలవంతుడు. బుధాదిత్య యోగం వల్ల పండితుడు. అష్టమాధిపతి వ్యయంలో విపరీత రాజయోగమునిచ్చును. లాభ శని, మిత్రులు సేవకులను పరివారము నొసంగును. శని లాభమందుండుట శుభమని "మందస్యార్త్రి సుతాయ శత్రుషు శుభమ్" అనెడి వరరుచి వార్తికమున గలదు. లగ్నమును శని చూచుటచే సాత్త్వికులు. ఇందులకు జ్యోతిషామృత సారము ప్రమాణము. భాగ్యరాజ్య లాభాలలోనే ఐదు గ్రహము లుండుట సర్వవిధములా శుభకరము. "గజకేసరి యోగోఽయం చంద్రకేంద్రే బృహస్పతిః" అని లక్షణము. ఈ యోగముండుటవలన శాసనాధికారము, పలుకుబడి, హోదా, దాతృత్వము కలుగును. దశమమందు శుక్రుడుండుటచే సత్కార్యముల జేసిరి. "దశమే గురు శుక్రౌ సత్కర్మ కరౌ" అని కేరళసూత్రము. శని లాభమందుండుటచే భాగ్యము, దీర్ఘాయుర్దాయము కలిగినవి. ఇందుకు "ఆయుష్కారే శనౌ షష్ట పంచమాష్టమ లాభగే ఐశ్వర్యం సతతం బ్రూయాద్దా యుర్వృద్ధిర్యశస్సుఖమ్" అని జాతక మార్తాండమునగలదు. ద్వితీ యాధిప గురులు బలులగుటచే విద్యావిశారదత్వము గలిగినది. "స్థాన బలే విద్యావిశారదత్వమ్" అని సూత్రము. చంద్రయోగే సత్త్వగుణ ప్రాధాన్యం శాంతి పౌష్టిక కర్మ యాజకత్వ మితిహాస పురాణ ప్రవచన ప్రవీణతా భవతి" యని కేరళభాష్యము. ఇట్లు జాతకము కవిగారి వ్యక్తిత్వమును నిరూపించుచున్నది.

## రత్నకవిగారి శిష్యసంతతి

1] శ్రీ అంబటిపూడి శ్రీరామమూర్తిగారు (గుంటూరు) వీరు కవిగారి వద్ద రఘువంశం, శబ్దాలు చదివారు. 2] శ్రీ అంబటి రాధాకృష్ణ

మూర్తి (ఏదుబాడు) వీరు రఘువంశం, శబ్దాలు, మేఘసందేశం చదివారు. 3] శ్రీ కలగా చెన్నకేశవులుగారు వీరు కవిగారికి మేనల్లుడు, ఏదుబాడు అగ్రహారం. వీరు పంచకావ్యాలు చదివారు. 4] శ్రీ పులిజాల హనుమంతరావు (కొండాపురం) వీరు సంస్కృతాంగ్లాలు చదివిరి. 5] శ్రీ పులిజాల గోపాలరావు (దోనిపాముల) వీరు కవిగారివద్ద విద్యాభ్యాస మొనరించుటయేగాక ఖడ్గతిక్కన, శతకమంజరి గ్రంథాలను వ్రాశారు. 6] శ్రీ ధవళా శ్రీనివాసరావు (కోటయ్యగూడెం) వీరు సంస్కృతంలోని పంచకావ్యాలు, ఆంగ్ల కావ్యాలు చదివారు. చక్కని కవిత్వం వ్రాయగలరు. శ్రీ మద్దోజు సత్యనారాయణ (చండూరు) వీరు "మధురస్మృతులు" యనే మధురమైన గ్రంథం వ్రాశారు. 8] శ్రీ సిరిప్రెగడ భార్గవరావు (గుండ్రెపల్లి) వీరు "భార్గవానంద లహరి" యనే గ్రంథం వ్రాశారు. 9] శ్రీ తాడిశెట్టి నరసింహగుప్త (చండూరు) సంస్కృతాంగ్ల కావ్యాలు చదివారు. కవిత్వం వ్రాయగలరు. 10] శ్రీ చింతలపాటి వెంకట్రామశర్మ (ఏదుబాడు) సంస్కృతాంగ్ల కావ్యాలు చదివారు. వీరు రెండు గ్రంథాలను రచించారు. 11] శ్రీ వంగల వెంకట చలపతిరావు (సందెప్రూడి) వీరు "ఉన్మాది" "అహల్య" యను కావ్యాలను రచించారు. 12] శ్రీ బొగ్గవరపు పెద అమ్మయ్య (ఉప్పలపాడు) కవిగారు వీరికి సంస్కృతాంగ్ల కావ్యాలను తులనాత్మకంగా బోధించారు రామాయణ, భారత, భాగవతాలను బోధింపగా విని విజ్ఞానవంతులయ్యారు. కవిగారు వీరి కనేక గ్రంథాలిచ్చారు. 13] శ్రీ బొగ్గరపు చిన అమ్మయ్య (ఉప్పలపాడు) ఆంగ్లాంధ్రాలు చదివారు. వీరి గురుభక్తి గణనీయము. 14) శ్రీ బాలినేని చిన నాగయ్య (ఉప్పలపాడు) ఆంగ్ల గణితాంధ్రాలను చదివారు. 15) శ్రీ వారణాసి సత్యనారాయణ (చిలకలూరిపేట) సంస్కృతాంధ్రాంగ్లాలు చదివారు. 16) శ్రీ వంగల రామకృష్ణశాస్త్రి (గుంటూరు) సంస్కృతాంధ్రాలు చదివారు. వీరు తార్కికులు. 17] శ్రీ మంచు

కొండ శివలింగయ్య (చండూరు) వీరు కవిగారికి ప్రథమ శిష్యులు.
18] శ్రీ కొండూరి వెంకయ్యగారు (హైదరాబాదు) ఆంగ్లం, పంచ కావ్యాలు చదివారు. వీరు కవిత్వం వ్రాయగలరు.

## శ్రీ వెంకటరత్నకవిగారి గూర్చి ప్రముఖుల అభిప్రాయాలు

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి "నవ్యాంధ్ర సాహిత్య వీధులు" అనే గ్రంథం చతుర్థ భాగంలో 821 వ పేజీలో కవిగారిని గూర్చి యీ క్రింది విధంగా వ్రాయబడింది —

"అధునాతనులలో వీరినెఱుగని వారుండరు. వేలూరి శివరామశాస్త్రిగారి ప్రియశిష్యులు. ఎంత పలుకు గలవాడో అంత అమాయకుడుగా కనిపిస్తాడు. సంస్కృతాంధ్రాంగ్లాలలో మనోహర కవిత చెప్పగలవాడు. సాహితీమేఖల యనే సంస్థ స్థాపించి వీరు చేస్తున్న కృషి ఎన్నదగినది. సహజ కవితావేశం గలవారు. "మైనాదేవి, మొరాన్ కన్య, వత్సలుడు, దక్షిణ, చంద్రశాల, వీరాంజలి, ఇంద్రధనస్సు కావ్యాలను, నాటకాలను, కథావళిని రచించారు. తెలంగాణమున కవితా నిర్ఝరిణుల ప్రవహింప జేసి తేనె మాగాణము జేస్తూ యనేక సన్మానములు పొందుచున్న కృషీవలుడు".

శ్రీ గొల్లపూడి ప్రకాశరావుగారు వెలువరించిన "ప్రకాశం జిల్లా సాహిత్యపత్రిక" సచిత్రయుగం ప్రథమ భాగంలో ఈయన గూర్చి గలదు. ఈ గ్రంథం తెలుగు వెలుగులు, గుంటూరు ప్రచురణ. ఈ గ్రంథంలో కవిగారిని గూర్చి ఇలా ఉంది —

"వీరు తాము సాహిత్యాన్ని సృష్టించడమేగాక ఎందరో నవకవులను సృష్టించారు. ఈ విషయంలో వీరు స్వామి శివశంకరులతో పోల్చదగినవారు." ఇదే గ్రంథంలో 8 వ పేజీలో కవిగారిని గూర్చి —

"ఆంధ్ర తెలంగాణా భేదాలను పోగొట్టడానికా అన్నట్లు ఆంధ్రలో జన్మించి తెలంగాణాలో స్థిరపడ్డారు. సాహిత్యకృషి తెలంగాణాలో జరిగింది. తాము సాహిత్యాన్ని సృష్టించడమేగాక ఎందరో నవ్య

కవులను సృష్టించారు. వీరు స్వామి శివశంకరులతో పోల్చదగినవారు. వీరి ప్రోత్సాహ ఫలితమే సాహితీమేఖల. చీరాల తాలూకా ఏదుబాడు వాసులు. భారతీయ సంస్కృతిపై మోజెక్కువ. ఆంధ్రిలో పడమటి గాలి వీచరాదనే సంకుచిత మనస్తత్వం లేదు. "సంధ్యావిద్య" వీరి హిందుత్వాభిమానానికి ప్రతీక. విదేశగాధలను కూడా వ్రాయడం వీరి సమదృష్టిని సూచిస్తుంది.

వీరిని గూర్చి శ్రీ రాయప్రోలు వారిట్లనిరి :—

"తన యంతఃకరణంబు బాహిర విషాద క్షోభలన్ చీలి మే
శనమై యే గతి నిత్యసాధనల నిల్వంజాలె నా యా పులో
చన లేపాయక వచ్చగిల్లినవి నీ సాహిత్యమందెంత చ
క్కనివయ్యా భవదీయ సూత్రములు వేంకట్రత్న వాచావ్రతీ".

వేలూరి శివరామశాస్త్రిగారు —

"సత్కవి వైతివి ప్రకృతి సద్యోయోగం బుపాసించుచున్"

"సత్కవుల్ నిన్నును జూపి నాకిడిరి నేటికి సారతనంబు గాంచితిన్"

పుష్పగిరి యాస్థాన పండితులైన శ్రీ అంబటిపూడి నరసింహశాస్త్రిగారిట్లనిరి —

"నీ వనన్ బహుళ నవ్యకవిత్వ విలాసభాసురంబవు బహుకావ్యకర్తవు"

శ్రీ వేదాల తిరువెంగళాచార్యులుగారి యభిప్రాయము —

"ఈతడింతటి వాడగుట నేనింతకు మున్నెఱుగను"

శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు-"ఉత్తమకోటిలో చేరదగిన కవీశ్వరులు"

శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారు - "మహాకావ్యబంధం చేయగల శక్తి వెంకటరత్నంగారికి గలదు".

శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు - "కవిరత్న బిరుదు నొసంగుట ముచితము".

శ్రీ చలమచర్ల రంగాచార్యులుగారు-"ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములు వీరియందు పరిణతి నొందినవి".

శ్రీకురుగంటివారి యభిప్రాయము–"వీరు వీరాంజలి కథను సమర్థతతో నడిపిరి".

శ్రీ వేదాల తిరుమల వెంకటరామానుజస్వామిగారు "ఆయుర్వేదకళ" యను మాసపత్రికలో ఇట్లు నుడివిరి–"కవిగారి కవిత అగ్రతాంబూలానికి తగినది".

శ్రీ ధవళ శ్రీనివాసరావుగారు తమ సన్మానపత్రంలో "నీ సువిమల సాహితీపటిమ జూడగ నాంధ్రులదృష్టవంతులే" యనిరి.

పులిజాల వారిట్లనిరి – "నీ నగుమోము జూచితి బునీతుడనైతి, కవిత్వ భావనా మానసవీధి పెల్లుబికె."

శ్రీ మద్దోజు సత్యనారాయణగారు "వారి కవిత్వమా అమరవాహిని" యనిరి. మరియు నిట్లనిరి – "కవితార్ణవాన్తర భావ ప్రధితోజ్జ్వల ద్రుచి రత్నమ్ముల్ ప్రదర్శించి బంధుర విద్వజ్జనతా హృదంబుజముల నుయ్యాల లూగించితే"

శ్రీ సిరిపెగడ భార్గవరావుగారు –– "మనోంబుజమ్ము పులకింపన్ జేయ నీ నేర్పులన్" యనిరి.

"రాగవీణ" యను గ్రంథమును రచించిన శ్రీరామడుగు శ్రీమన్నారాయణ శర్మగారు "ఈ రాగవీణ ఉచ్ఛ్రుతిగా ధ్వనింప అనుశ్రుతిగానొక ఉపశ్రుతిని మేళవించిన వారు గురుతుల్యులు శ్రీ అంబటిపూడి వెంకటరత్నంగారు" అనిరి.

శ్రీ యం. రాధాకృష్ణమూర్తిగారు – "సాహితీమేఖలను నిర్మించి వారి శిక్షణలో ఉద్దండులైన కవులను సృష్టించిరి" యనిరి.

శ్రీ కె. వి. భూపాలరావుగారి యభిప్రాయము – "చండూరులో కవిగారు కులపతి. జగమెఱిగిన మనీషి. దార్శనికుడు. ద్రష్ట మఱియు స్రష్ట. విద్యాకేంద్రములను ఉద్దండ పండితులను, కవులను సృష్టించిన కవిబ్రహ్మ యితడు. సహృదయ హృదయ వీణాతంతువులను కమ్మనా మత్తుగా మ్రోయించిన కవితల్లజుడీతడు. చండూరు సాహితీమేఖల

వారు నేర్పుగ ఓర్పుగ దోహదమొనర్చిన కవితాకల్పద్రుమము. అంబటి పూడి వారు పంచభూతసన్నిభులైన కవులను సృష్టించిరి. శ్రీ కళా ప్రపూర్ణ దాశరథిగారు ఇట్లు వక్కాణించిరి. "అంబటిపూడి వేంకట రత్నకవిగారు దరిద్రనారాయణ సంఘం పెట్టి పేదలసేవ చేసేవారు. అనర్గళమైన కవితాధార ఆయనది. ఆయనకు చాలామంది శిష్యులుండే వారు. వారిని కవితా రచనకు ప్రోత్సహించేవారు."

శ్రీ మద్దోజు సత్యనారాయణగారు మధురస్మృతులు యనే గ్రంథంలో భక్త్యంజలి యనే పేరుతో ఆరు పద్యాలతో కవిగారిని వర్ణించారు. అందలి కొన్ని పంక్తులను సహృదయహృదయానందం కొఱకు నిర్దేశిస్తున్నాను. చూడండి —

"గరువపు మబ్బు క్రమ్మని మొగమ్మున చెన్నుమీరు చెం
దురు తెలి నవ్వు వెన్నెలలు దోసి తమిస్రము బాపి చల్వలా
కిరణములన్నియున్ గరము గిల్కొని కావ్యధునీ తరంగ సుం
దర పరిఖేలితోత్పల సుధా సదనమ్ములు జూపితెంతయున్"

భావతరంగముల సద్రసములన్ జనియింపగ జేయు గాదె మీ సదమల ప్రేమవాహిని" "మద్గురునిన్ అంబటిపూడి వేంకటవీంద్రున్ గొల్తు భక్త్యంజలిన్" "రమ్య వాక్సుధానిధి కవిరత్న సుకవి" "విద్వజ్జన హృదబ్జముల నుయ్యాల లూగింతే" "కవిరత్నము మత్కవితా గురుండు".

భాగ్యనగరంలో శ్రీకృష్ణ దేవరాయల భవనంలో రత్నకవిగారి సన్మానసభలో శ్రీ భార్గవరావుగారు "భారతీహార మంగళ రత్నంబగు రత్నదేవుడు కటాక్షాలన్ తమ శ్చేదముల్, సలుపం జాలు పునీతమూర్తి మనకెల్లన్ దేశికాగ్రేసరుల్" అని వాక్రుచ్చిరి. అదే సభలో శ్రీచింతల పల్లి వేంకటకృష్ణశర్మగారు "ఈ మారుమూల గ్రామానికి పేరు రావడానికి కారణం అంబపూడి వారేనని యుద్ఘాటించియుండిరి. శ్రీ రత్నకవిగారు శిష్యులయెడ వాత్సల్యపూర్ణులని, శ్రీ సిరిపెగడ

భార్గవరావుగారిపై కవిగారికనంతమైన వాత్సల్యం ఉందని "ఆంధ్ర ప్రభ" ప్రశంసించింది రత్నకవిగారు అధిక పరిశ్రమజేసి గురువులకు పేరు దెచ్చిరని "భారతి" మాసపత్రిక కీర్తించింది

## కవిగారి మృతిపట్ల ప్రముఖుల అభిప్రాయాలు

సరస కవితావేశం పాండితీప్రతిభలు గల శ్రీ అంబటిపూడి వెంకట రత్నకవిగారు తమ డెబ్బదిరెండవ యేట 1983 వ సంవత్సరం మే 18 వ తారీఖున కేవల యశశ్శరీరులై కాలధర్మమునొందిరి. వీరి మృతి ఆంధ్రావనికేగాక యావద్దేశానికే తీరనిలోటు. "తైరేవాస్య కలేః కలేవర పుషోద్రైనందినం వర్తనమ్" యని జగన్నాధ పండితుడు రసగంగాధరమున ప్రతిపాదించినాడు. రమణీయములు, లోకోపయోగ కరములైన వస్తువులనే పాపాత్మకమైన యీ కలికాలము గ్రసించు నని జగన్నాధుని వాక్యమునకర్థము. కవిగారిని గ్రసించుటచే పై వాక్యము సత్యదూరముగాదని నిర్ధారితము. వీరి మృతి విని సజ్జన వియోగాగ్ని దందహ్యమాన చేతస్కులైన పలువురేమని విలపించిరో గమనింపుడు —

పాలెం గ్రామ వాస్తవ్యులైన శ్రీ రంగాచార్యగారు 20-5-83 నాటి పత్రికలో "వారి సాహిత్యకృషి వారిని చిరంజీవులుగా చేయ గలదు" యనిరి.

విజయవాడ నివాసులైన శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు "వెంకటరత్నంగారు పండితుడు, కవి, సహృదయుడు, అమాయకులు, దాత, బహుకవులను పరిచయం చేసినవారు, సాహితీగోష్ఠి గ్రంథపఠనం గల వారు, సరదా మనిషి, వ్యక్తిత్వం గలవారు" అని యుద్ఘో షించిరి. (28-3-83)

నల్గొండ స్థానికులైన శ్రీరామగిరిగారు 25-5-83 దినమున "నల్గొండ మండలానికి సాహితీభిక్ష పెట్టినవార"ని కీర్తించిరి. శ్రీరామ గిరిగారు గీతావిజ్ఞాన సమితి సభ్యులు. హైదరాబాద్ నగరస్థులైన

శ్రీ అంబటిపూడి గోపాలకృష్ణమూర్తిగారు "చదువుకున్న వారంటే వారికి చాలా అభిమాన"మని వారిలోని సుగుణాన్ని లోకానికి చాటి చెప్పారు. హైదరాబాద్‌లో ప్రసిద్ధ న్యాయవాదులైన శ్రీ మాదిరాజు సీతారామారావుగారు "సాహితీమూర్తి"యని యకలంక దేశభక్తులని వేనోళ్ళ ప్రశంసించారు.

హైదరాబాద్‌లో శ్రీ చాకలి సుబ్బారావుగారు 26-5-83 దినమున "ఒక అనుబంధం తెగినందుకు విచారిస్తున్నా"నని, దుర్వార్తా శరాభిఘాత విశీర్యమాణ హృదయులై విలపించారు.

విజయవాడ నగరంలో శ్రీ దోనేపూడి వెంకయ్యగారు 24-5-83 దినమున "సాహితీపరంగా వారి వారసత్వాన్ని మనం నిలబెట్టుకోవాల"ని భావితరాలవారినుద్దేశించి యుద్బోధించారు. హైదరాబాద్‌లో శ్రీ కాండూరి వెంకయ్యగారు 20-10-83 దినమున "ధైర్యంతో వారి యాశయాలను నెరవేరుద్దామ"ని కర్తవ్యదీక్షను బూనారు.

చాట్రాయిలోని శ్రీ దెందుకూరి దుర్గాప్రసాద్‌గారు 11-7-83 దినమున తమ సోదరుడు, కవిగారి తనూజుడైన శ్రీ అంబటిపూడి వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారిని "సాహితీమేఖల విషయంలో వారి కుమారుడు సమావేశాలు ఏర్పాటు చేయాల"ని కర్తవ్యాన్ని నిర్దేశించారు. కవిగారి మృతిని విని చేళిద్యమానసహృదయ వచనాలను పరిశీలించిన నాకు కాళిదాసుని యీ క్రింది శ్లోకం స్ఫురిస్తూంది —

"మరణం ప్రకృతిః శరీరిణాం వికృతిర్జీవిత ముచ్యతే బుధైః
క్షణమప్యవతిష్ఠతే శ్వసన్ యది జన్తుర్నను లాభవానసౌ"

( శరీరధారులకు మరణమే ప్రకృతి. జీవితమే వికృతి. వ్యక్తి క్షణకాలమైనా జీవించి యుంటే ఎంతటి అదృష్టశాలి. )

## సాహితీమేఖల స్వరూపము

శ్రీ అంబటిపూడి వెంకటరత్నంగారు 1934లో చండూరులో సాహితీమేఖల యనే సాహిత్య సంస్థను స్థాపించారు. చండూరు గ్రామ

వారందరూ ఇందులో సభ్యులు. కవిగారు మైనాదేవి కావ్యమును చదివినపుడు, తత్కావ్యమును విన్న శ్రీ సిరిప్రెగడ వెంకటరాయ లక్ష్మీనరసింహారావుగారికి సాహితీమేఖలను స్థాపించవలెనని సంకల్పము కలిగినది. వీరి సోదరులైన శ్రీ రామారావుగారు గూడ నీ సంస్థకు చేయూతనొసంగిరి. మైనాదేవియే సాహితీమేఖల మొదటి కావ్యము. సాహితీజిజ్ఞాస గల రసజ్ఞులెవ్వరైననూ యిందులో సభ్యులేనని రత్న కవిగారు తమ నిశ్చితాభిప్రాయాన్ని వెల్లడించారు. శ్రీ పులిజాల హను మంతరావుగారు, శ్రీ ధవళా శ్రీనివాసరావుగారు సాహితీ మేఖల వ్యవ హార్తలుగ నుండి సంస్థయొక్క కీర్తి నినుమడింపజేసారు. రచయితను ప్రోత్సహించి, సాహిత్యపు విలువలను ప్రపంచానికి చాటిచెప్పడమే సాహితీమేఖల లక్ష్యం.

తెలుగుదేశము గ్రంథకర్తయైన శ్రీ దేవులపల్లి రామానుజ రావు B. A., L. L. B. గారు తమ గ్రంథంలో సాహితీమేఖల నిట్లు స్తుతించిరి —

"యిల నైజాము యిలాఖలో తెలుగులో యీ పల్లె గ్రామాలలో
పల సస్యాటవులన్ కృషీవలుల రూపంబొంది నెవ్వారికిన్
తెలియన్ రాక వసించు తెల్గు కవులందే దృష్టిసారించి ర
చ్చల కీడ్పించితివమ్మ నీవు గురుదీక్షన్ సాహితీమేఖలా"

"తెలువుల్లల్లియు లేని వారివలె హృత్తేజంబు గోల్పోయి మూ
లల పన్నుండిన మా తెలుంగు కవులన్ లాలించి పాలించు త
ల్లుల రేవన్ మధురాంధ్ర కావ్యరసమున్ గ్రోలింపగా జేసి ము
ద్దుల పల్కుల్ బలికించి కుల్కెదవు గాదో సాహితీమేఖలా"

సాహితీమేఖల యను వార్తపత్రిక మాసపత్రికగా 1982 జనవరి నుండి శ్రీ పున్న అంజయ్యగారి సంపాదకత్వమున వెలువడుచున్నది. ఇందు వ్యాసములు, కవితలు మొదలగు ప్రక్రియల కవకాశముగలదు. సాధారణముగా యీ క్రింది పద్యములు మొదటి పేజీయందుండును.

"చిన్నది నా మదిన్ మధుర నీదు కవిత్వము కూర్చి భావ సం
పన్న సరస్వతీ చరణ పద్మవిలేవ ఖేలనంబునన్
మన్నులు మిన్ను జేసి బ్రత్యమర్త్యముగా స్ఫురియింప జేసియున్
బున్నెము కట్టుకొన్న రసమూర్తులు మీ కొలికే మొసంగెదన్"

"ఓ కవిరత్నమా! వినుము యూరక నీ విరచించు కబ్బ వుం
జోక పదారులన్ విరియు పూరజ మూరజ మారుతావులున్
దాకొను యాకు జొంపముల దాక ఫలంపు రసప్రవాహముల్
దూకొని త్రెంచి నా హృదయమందు మిళిందమునందె గ్రిమ్మరున్"

— శ్రీ మద్దోజ.

## సాహితీమేఖల ద్వారా వెలువడిన గ్రంథములు

1. భార్గవానందలహరి : శ్రీ సిరిప్రెగడ భార్గవరావుగారు రచించారు. All India Telugu Writers Conference సందర్భంగా ఆంధ్ర సారస్వత పరిషత్తువారు హైదరాబాద్ నుండి 1968లో ప్రచురించిన సావనీర్ భార్గవరావుగారికే అంకితమైనది. అందులో శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారు "అజ్ఞాత కవిచక్రవర్తి సిరిప్రెగడ భార్గవరావు" అనే వ్యాసంలో చిన్నవయసులోనే పోయారనీ, గురువులైన రత్నకవిగారికి శుశ్రూష చేశారని నుడివిరి. వీరు భార్యా వియోగంలో విలపించిన పంక్తులు భార్గవానందలహరి నుండి యీ క్రింద నుదహరిస్తున్నాను.

"రావుగదా చెలీ మరలి రావుగదా! యొకసారివన్ గనన్
రావుగదా చెలీ మరపురాని నినున్ మరువంగలేక నా
పోవుచు నిట్టులే కలిగిపోవలెనే చిరుగుండె చిద్రుపల్
గావలెనే కటా జడలు గట్టిన యీ వడగండ్ల ధాటికిన్"
"ఏమని యెంచెనే యసువులేల త్యజించెనే ... ..."

"ఏ సొంపుల్ గనరించి యీ పృథివి దేహీ, యేల సాహిత్య
విన్యాసముల్"

"అందాలకల" యనే శీర్షికలో గూడ కవి విలపించాడు. భార్గవరావుగారిని గూర్చి విశ్వనాథ సత్యనారాయణ గారిట్లనిరి. - "పరమేశ్వరుడే పువ్వునెప్పుడెందుకు త్రుంచుకొని పోతాడో ఎవరికి తెలియును? ఈ చిన్ని కావ్యము ఆ కవి యశః పతాకగా నిలచుగాత!".

2. ప్రబోధమంజరి (గేయసంపుటి) : రత్నకవి శిష్యభూతులు, ఆంధ్ర పండితులు, చందూరు గ్రామవాసి శ్రీ రావిలాల వీరయ్యగారు ఏతద్గ్రంథరచయిత. ఆంధ్రదేశ ప్రాశస్త్యమిందు వర్ణితము.

3. వేంకటేశ్వర, భద్రాద్రిరామ, రామయతంత్రిశతకములు. గ్రంథకర్త శ్రీ పులిజాల గోపాలరావుగారు.

4. తెలుగుదేశము : శ్రీ దేవులపల్లి రామానుజరావు B.A., L.L.B. గారు

5. రాగవీణ : శ్రీ రామడుగు శ్రీమన్నారాయణశర్మగారు. దీనికి రత్నకవిగారి యభిప్రాయమున్నది.

6. గుంటూరు కాలేజీ శతావధానము : శ్రీ వేలూరి శివరామశాస్త్రి గారు రచయిత. శివరామశాస్త్రిగారు గుంటూరులో చేసిన శతావధాన పద్యములన్నియూ ఇందు కూర్చబడినవి.

ఇందు రత్నకవి, పులిజాల హనుమంతరావు, జలసూత్రం రుక్మిణీ నాథశాస్త్రి, యన్. అర్. కె. శర్మ, దివాకర్ల వెంకటావధాని కొండూరు వీరరాఘవాచార్యులు, అంబటిపూడి వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రి A. E. L. M. కాలేజి (గుంటూరు) ప్రిన్సిపాల్ గారు, అదే కళాశాల వైస్ ప్రిన్సిపాల్ గారు, అభిప్రాయముల నొసంగిరి. ఇందు వేపకాయపై పంచచామరము, గండుచీమమీద కవిరాజ విరాజితము. అలుకుగుడ్డపై సీసము, సమస్యలు, వర్ణనలు గలవు.

సభాసదులైన శ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు, శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు, శ్రీ శిష్ట్లా హనుమచ్ఛాస్త్రిగారు, శ్రీ పిశుపాటి చిదంబరశాస్త్రిగారు, శ్రీజూపూడి హనుమచ్ఛాస్త్రిగారు, శ్రీపంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు, మొదలైనవారు శివరామశాస్త్రి గారిపై చెప్పిన పద్యములిందు కూర్చబడినవి.

అంతట బిందుపూర్వక తకారంబుతో వసంతమును ఉత్పల మాలలో వర్ణించిన యీ క్రింది పద్యమును గనుడు-

అంత దిగంత దంతురనిరంతర కాంతవనాంతసతంతా
క్రాంత లతాంత మంతక దురంతక కంతు నిరంతరాంత వా
సంతిక మంతరాంతర నితాంత లతాంతర కాంత కాంత మ
క్రాంతము పంతసంబిడె వసంతము సంతతమంతనంతటన్"

7. శాంతి తీరాలకు - శ్రీ అంబటిపూడి వెంకటరత్నంగారు. దీని గూర్చి కవి గ్రంథాలలో సమీక్షింపబడును. 8. ఇందిరావిజయమ్ (సంస్కృత నాటకమ్) - వెంకటరత్నంగారు. 9. చంద్రకళా (సంస్కృత కావ్యమ్) 10. ఇంద్రధనువు - అంబటిపూడి వెంకటరత్నంగారు. 11. ప్రభుసప్తతి - అంబటిపూడి వెంకటరత్నంగారు. 12. మధురయాత్ర - అంబటిపూడి వెంకటరత్నంగారు. 13. వివేక శిఖరాలు - అంబటిపూడి వెంకటరత్నంగారు. 14. తర్కభాష - అంబటిపూడి వెంకటరత్నం గారు. 15. ప్రణయవాహిని 16. మైనాదేవి 17. మొరాన్ కన్య 18. వత్సలుడు 19. వనవాటి 20. దక్షిణ 21. వీరాంజలి 22. చంద్రశాల (తెలుగు) 23. కథావళి 24. కామోదకి 25. కృష్ణకళ 26. ఓటర్లకొకమాట 27. సంధ్యావిద్య 28. భారతీయ సంస్కృతి (ఇవన్నీ కవిగారివే). 29. అగ్నిధార - శ్రీ దాశరధిగారు 30. సౌప్రహ్లా శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు 31. ఖడ్గతిక్కన - శ్రీ పులిజాల

గోపాలరావుగారు 32. అహల్య - శ్రీ వంగల వెంకట చలపతిరావుగారు ఈ కావ్యమునందు అహల్య, శ్రీరామ విజయము, పాదుకా ప్రదానము సీతాపహరణము, హనుమద్విక్రాంతి, తిరస్కృతి, ముద్రికాప్రదానము శ్రీరామపట్టాభిషేకము అను రామ గాథలు గలవు ఈ రామకథా మంజరి యందలి మొదటి గాథ యహల్యాది యగుటచే కావ్యమునకు నహల్య యని నామమిడిరి. అహల్య యందలి ఈ క్రింది పద్యము కవి గారి ప్రతిభకు గీటురాయి-

"పూతకు వచ్చి తీవియల్లు బూయవు పూయవు కాయవా తరు
వ్రాతము లీడు వచ్చియును వచ్చియు రాని విధాన శారికల్
వాతెర విప్పి మాటలను బల్కవు పల్కవు కోకిలాంగనా
గీతములందు సంగతులు కేవ్వలమీ జడ భావమేలొకో

అచేతనములందు చేతనధర్మ సమారోపమిట గలదు. పూయవు కాయవు అన్నదానిలో పూస్తేకదా కాసేది ఒకవేళ తప్పిదారి పూచినా కాయ వని ధ్వని. ఈడు వచ్చినా పిల్ల పుష్పవతి కాలేదని, అయినా గర్భాన్ని ధరించలేదనే భావం మెలుస్తూంది. పల్కవు పల్కవు అన్నచోట శారికలు మాటాడుట లేదనీ, రెండవ దానికి సంగీతులు పల్కుట లేదనీ అర్థం. సంగీతము పాడునపుడు వినిపించు నొక్కులకు సంగతులని అర్థం కోకిలాంగనల పాటలలో ఆ నొక్కులు లేవనీ అర్థం. ఇలా మనోహ రంగా యీ కావ్యం సాగిపోతుంది.

ఉన్మాది:- భార్యను గోల్పోయి లోకంలోని అన్యాయాలను సహింప లేక విసిగిపోయిన విజ్ఞాని యిందులోని నాయకుడు. విధవా పునర్వి వాహామశాస్త్రీయమని యిందు ప్రతిపాదింపబడినది. కావ్యంలోని యీ క్రింది ఉపదేశం సహృదయులనలరిస్తుంది.

"దేశాభ్యున్నతియున్ వికాసము బురంధ్రీ వర్గ సౌజన్యస
త్పాశీల్యాశ్రితముల్ సఖీ! వనితలిష్టస్ఫూర్తి మోహాంధలై

స్త్రీ శూన్యత్వమునం జరించిన ధరిత్రిన్ సంఘమర్యాదలున్
నాశమ్మందెడి గృహస్థ జీవితము చండాలమ్ము గాకుండునే"

శీలముయొక్క మాహాత్మ్యమును వర్ణించుచూ వెంకట చలపతి రావుగారు, "శీలములేని లేమయని నీ కొఱమాలిన జన్మలారయన్" అనడం వారి సంస్కారానికి ప్రతీక. స్త్రీని వర్ణిస్తూ కావ్యంలోని నాయకుడు "నిర్వికార కాపేష్టికి పట్టుగొమ్మ జగదీశ్వరి భాసురమూర్తి స్త్రీగనన్" అని చెబుతాడు.

నీతినియమములు స్త్రీ పురుషుల కిరువురకు సమానమే. సత్ప్రవర్తన లేని స్త్రీవలె పురుషుడునూ నింద్యుండే. ఈ భావాన్ని తెలిపే యీ వాక్యం చూడండి —

"నీతి విమారులై బ్రతుకు నీమము గోల్పడి త్రాడులేనియా
బోతుల రీవ బూరుషులు మూర్ఖతమై చరియింప, భామినీ
వ్రాతము మత్తవారణ కరస్థసుమప్రకరమ్ము చాడ్పునన్
జాతరపాలుగాక వెలుచన్ మననేర్చునె జాతినిల్చునే."

ఏతాదృశ మహోన్నత భావాలతో కూడిన యీ మహా కావ్యం పరమ రమణీయం. తెలుగుసిరి (ఆంధ్రలక్ష్మి) : రచన శ్రీ అంబటిపూడి నరసింహశర్మ గారు. గ్రంథకర్త న్యాయ విద్యాప్రవీణ, ఉభయభాషా ప్రవీణ పరీక్షలయందుత్తీర్ణులైరి. వీరి గ్రంథమున —

"కవితానవ్యతలో పురాతనతలో కాంక్షింతు రెండింటినే
చవులూరించెడి భావమాధురిమమున్ శ్లాఘింతు ప్రాచీనతా
నవతాభేదము దుర్వివాదమున కౌన్నత్యంబు కల్పించు పు
ట్టువుదానన్ రసపోషణంబులు .... .... అని వచించిరి."

ఈ గ్రంథ మందలి మార్గవర్ణన మేఘసందేశ మందలి మార్గవర్ణనను తలపించుచున్నది. వీరు తాడేపల్లి వెంకటప్పయ్యగారి వంటి మహోదాత్తులవద్ద విద్యనభ్యసించిరి. ఆంధ్రభాషాభిమాన

మును, ఆంధ్రదేశభక్తిని మహోజ్జ్వలముగ చాటిచెప్పినకవి ధన్యుడు. ఆంధ్రావనిలో జన్మించుట భాగ్యమని యెట్లు ప్రతిపాదించిరో గాంచుడు— యీ నేలపై నుదయించుట పూర్వపుణ్యాను మహాయోగమ్ముచే వర్తిలున్" ఆంధ్రమాతకు గోదావరి మహానది, కృష్ణానది వడ్డాణమని చెప్పి యట్టి జనని చిత్తూరున కాలుమోపి భాగ్యనగరిలో వెల్గుచున్నదని వర్ణించుట కడుంగడు రమణీయము.

"అలగోదావరి హారయష్టి కుచశైలాగ్రమ్మునన్ శోభిలన్
మొల కృష్ణామణికాంచియున్ మెఱయ సమోద్రమ్ముతోఁ గాలియం
దెలు చిత్తూరున మోపి, భాగ్యనగరిన్ జెల్వొల్పఁ గొల్వున్న యీ
తెలుగుంఁ దల్లికి వందనమ్ములిడరా దీర్ఘాయువుల్ గాంచరా".

తెలుగుబాస నన్నయాదులచే నెట్లు సమాదరింపబడినదో కవి గారి వివృతిని తిలకించుడు —

"నన్నయ్యభట్టు ప్రసన్నకథాకలి
తార్థ వాగ్వైభవమడర జేసె
తిక్కన్నయజ్వ జాతీయ మానుడికార
మెలయంగ ముద్దుమాటలను నేర్పె
ఎఱ్ఱన్న పరమేశుడిద్ధ ప్రబంధవాక్
ప్రౌఢిమకనువైన బాటజూపె
శ్రీనాధ సుకవి నానానవ్యపద్య
విన్యాసశక్తి కల విన్నాణమొసగె

పోతనార్యుండు భక్తిని పోతబోసె
పెద్దన స్వతంత్ర కావ్యసంవిత్తినిడియె
ఆంధ్రభోజుండు మనసిచ్చి యాదరించె
తెలుగువాణి నిజమ్ము బాసలకు రాణి"

బహు దేశభక్తులను, కవులను, శతావధాన కవితాధౌరేయు లను గన్న యాంధ్రమాతను కీర్తించిన యీ గ్రంథమును పఠించుట యాంధ్రుల యదృష్టమనవచ్చును. ఆంధ్రుల మహత్త్వమత్త్వము నల్దిక్కుల జాటగల్గిన యీ గ్రంధము చిరయశస్సునొందును.

రాగవీణ :- శ్రీ రామడుగు శ్రీమన్నారాయణశర్మగారు రచించిన యీ గ్రంథము "సాహితీ మేఖల" ద్వారా ప్రచురింపబడినది. శ్రీ వేంకటరత్న కవిగారు "ఉపశ్రుతి" యను పేర ఆముఖమును రచించిరి. కర్తవారి పితృదేవుల కంకితమునిచ్చిరి. ఇందు స్మృతి, శ్రుతి, మధురస్మృతి, భిన్నశ్రుతి, అనుశ్రుతి యను విభాగములుగలవు. దివాకర్ల వేంకటావధానిగారు, మాధవరామశర్మగారు నారాయణరెడ్డిగారు అభిప్రాయములనొసగిరి.

వీణావాదనాసక్తయైన సుధేష్ణయను కాంత తన ప్రియుని స్మరించుచు విరహమనుభవించును. ప్రేమానందుడనే బౌద్ధభిక్షుకునిలో తన ప్రియుని లక్షణముల గాంచును. ఆతడీమె బాధకు హేతువడుగ యీమె వివరించి చెప్పును. ఆమెను, ఆమె ప్రియుని యామె తండ్రి విడదీసెనట. ప్రేమానందుని పృష్టమున తిలకమును గాంచి యామె తన ప్రియునిగ గుర్తించును. ఆతనిచే తిరస్కృతయైన యీమెకాలు వీణకు తగులును. వీణ తంత్రులు తెగినవి. అతడామె మృతదేహమును చూచి విరక్తుడగును. ఇది యిందలి కథ.

ఈ క్రింది యుద్యానవర్ణన మత్యంత రమణీయము —

"ఆస్రోతస్విని తీరమందు లలితోద్యానమ్ము నానాలతా
వాసంబై నవపత్రపుష్పఫలశోభావృతః సంకీర్ణమై
కాసారాంతర భృంగహంస నళినీకల్హార శృంగారమై
ఘాసశ్యామల నేత్రపర్వమగుచున్ గ్రాలున్ సదాహృద్యమై"

ఈ క్రింది పద్యంలో అతిరమణీయ సన్నివేశం చిత్రింపబడినది.

"నుదురుపై పాడాడు ముంగురులు బాపి
మోములో మోముదూర్చి కెమ్మోవిపైన
వెచ్చనగుస్పర్శ కలిగించి ప్రియమువీర
చెక్కిళుల్ దువ్వి న్నా బావ చక్కిలిడిన."

ఇట్టి కావ్యం సాహితీమేఖల ద్వారా ప్రచురింపబడడం విశేషం.

---

## శ్రీ అంబటిపూడి వెంకటరత్నంగారి రచనలు

వ్యాసములు : సౌదర్యం, కావ్యాలలో స్త్రీ, కవిత్వంలో పోలికలు, కవిత్వం అనువాదం, గీతగోవిందం, అనువాదకర్త (శ. చ. పిచ్చయ్య శాస్త్రి). భట్టబాణుడు-కాదంబరి, మేఘసందేశం, నవ్యాంగ్ల సాహితి, దార్శనిక పరిచయము, ప్రబంధపరమేశ్వరుడు-అరణ్యపర్వశేషం, వసుచరిత్ర సమీక్ష, మాతృదేవోభవ, సౌందర్యం, వాల్మీకి-బెర్నాడ్ షా సంస్కృత భాషా సౌలభ్యం, కాళిదాసు కవిత్వంలో వైభవాలు, పేరు కోసం, విద్యాబోధనలో తులనాత్మకత, అరూపకృత్యాలు, నవ్యాంధ్రంలో నవ్యకవిత్వం, సత్యం-అహింస, సంస్కృతంలో బేసిక్ విధానము, క్రమక్రమంగా సమాజంలో భార్యాత్వం నశిస్తున్నది, నేనెఱిగిన కవులు (2 భాగాలు), రసపర్యవేక్షణము, వర్తమాన కవిత, సౌందర్య పర్యవేక్షణం రామకృష్ణుని కవితా ప్రాశస్త్యం, సాహిత్యం, శ్రీమాత.

కావ్యాలు : ప్రణయవాహిని, మైనాదేవి, మెరాన్ కన్య, వత్సలుడు, వనవాటి, వీరాంజలి, చంద్రశాల (సంస్కృతము, తెలుగు) ఇంద్రధనువు, ఓటర్లకొక మాట, మధురయాత్ర, ఇందిరా విజయమ్ (సంస్కృతం) శాంతితీరాలకు, గోపికావ్యమ్, హితోపదేశం.

నాటకాలు : ఏకాంకికలు :- దక్షిణ, కౌమోదకి, చూడాల, అకృతజ్ఞోనరః (సంస్కృతము)

ఆధ్యాత్మిక గ్రంథాలు : కృష్ణకథ, వివేక శిఖరాలు, సంధ్యావిద్య, ప్రభుసప్తతి, భారతీయ సంస్కృతి, కృష్ణబోధ, షడ్దర్శనరహస్యం, తత్త్వసమావర్తనమ్, వేదాంతసారము, దశోపనిషత్తులు, బ్రహ్మసూత్రములు వచనం, భగవద్గీత, ప్రస్థానత్రయోపోద్ఘాతం, తాత్విక తరంగాలు, రామాయణోత్తరకాండ, భాగవతమాహాత్మ్యం.

శాస్త్రగ్రంథాలు : తర్కభాష.

ఆంగ్ల గ్రంథాలు : చంద్రశాల, Reflection

ఉపన్యాసములు : శ్రీ వంగల రామకృష్ణశాస్త్రిగారి పదవీవిరమణ సమయంలో కుటూరులో అధ్యక్షోపన్యాసము

ఆంగ్ల వ్యాసాం: Sanskrit alone is the language of India as awhole.

లఘు గ్రంథాలు : ఆశీఃపంచరత్నాలు, ధర్మజనిర్వేదం, భార్గవుని జీవితస్థితి, చతుష్పాత్తులు, సుఖలిప్స, కూజానామా, ఆంధ్రుడెవ్వడ నాంధ్రుడెవ్వడు (గేయం) అపాత్తులు, తెలుగుతల్లి, ధన్యాత్మ, హితోక్తి ఆంధ్రప్రదేశప్రాశస్త్యం, పరిపుష్పాలు, చంద్రగామి, చైతన్యస్పృహ, జగద్దర్శనం, ఆత్మచర్చ (పట్టివేత), అనుభూతి, జగద్విలాసం, గాంధీ స్మృతి, గాంధీ నిర్యాణం.

శతకానువాదాలు(వచనము)అమరుకుని శృంగారశతకము, పండితరాయల భామినీ విలాస సహిత శృంగారపద్యాలు, భర్తృహరి శృంగారశతకం,

అసంపూర్ణ గ్రంథములు:- శ్రుతిగీతలు (వచనానువాదం)

## శ్రీ వెంకట రత్నకవి వ్యాస సమాలోచనము

వెంకటరత్నకవిగారు సంఘదురాచారనిర్మూలనపరములై విజ్ఞానదాయకములైన వ్యాసములను సునిశితహాస్యమునుజోడించి రచించియున్నారు. నవ్యాంధ్రసాహిత్యమున ఆంగ్లభాషాసంప్రదాయముల

ప్రభావమువలన వచ్చిన వినూతనప్రక్రియే వ్యాసము. ప్రతిపాద్యప్రతిపాదక భావముతో బహుగ్రంథములనుండి మనీషులభిప్రాయములతో విషయమును సమర్థించుచూ వ్రాయబడుట యిందలి విశేషమనవచ్చు. వ్యాసమనగా విస్తృతియని అర్థము. నిర్దిష్ట విషయమును విపులీకరించి చెప్పుటయే వ్యాసము. ఇట్టి వ్యాసరచనకు బహుగ్రంథపఠనమవసరము. విషయ సేకరణకృషియేగాక సమన్వయపరచగల ప్రతిభాశక్తియూ అవశ్యసంపాద్యమే. ఆంగ్ల సాహిత్యమున ఎడిసన్ అను మహాశయుడు రచించిన వ్యాసములచే నత్యంతప్రభావితులైన శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు "సాక్షి" యను పేర సునిశితహాస్యముతో వ్యాస పరంపరలను రచించి యనంత యశస్సునొందిరి. అట్లే సహజప్రతిభా సంపన్నులు వ్యంగ్యధోరణి గలవారు బహుగ్రంథపఠనా సంజాత శేముషీకులునైన శ్రీ అంబటిపూడి వెంకటరత్నకవిగారు తమ విజ్ఞానముచే సంఘమందలి దురాచారముల తోత్రిచూపుచు వేదమార్గా విరుద్ధముగ సన్మార్గమును సూచించుచూ యనేక విషయములపై వ్యాసములను వ్రాసియుండిరి. ఈ వ్యాసమంజరిని ముద్రించియనేకుల కుపకృతినొనరింపవలసినదని సాహితీమేఖలవారిని యభ్యర్థించుచున్నాను. యథావకాశము, యథామతినైభనము వ్యాసములసమీక్షించి కవిగారి నిశ్చితాభిప్రాయములను వెల్లడించనుద్యుక్తుడనగుచున్నాను. ఈ యభిప్రాయములను ప్రవర్తనావళియని ముచ్చటగా పిలువవచ్చును. ఈ అభిప్రాయములు సకలమునిశిష్టజన సమ్మతిములేగాని తద్విరుద్ధములు గావు. భారవిమహాకవి "అనుమానేన నచాగమః క్షతః" యనినాడు. అనగా మనముచూపు హేతువులన్నియు వేదసిద్ధాంతములను సమర్థింపవలయునుగాని తత్ప్రతికూల సిద్ధాంతమును సమర్థించునవిగా నుండ రాదని భావము. వేదములను సమర్థించుచు ఎన్నియుక్తులనైన ప్రయోగింపవచ్చును. ఇది భారతీయ సంప్రదాయములోని రహస్యము. ఈ రహస్యమును గుర్తెరిగిన శ్రీ రత్నకవిగారు ఆర్షములు మానవతా సమేతములైనభావములనే ప్రతిపాదించిరి. ఇందలిభాష సర్వజన

సువేద్యము. దుర్గ్రాహ్యములైన విషయములనుగూడ పెక్కు లౌకికో దాహృతులచే స్పష్టపరచుట యీ వ్యాసములయందు సర్వత్రగోచరించును. "శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మో భయావహః" అని గీతాచార్యుడు నుడివినాడు. కొద్ది దోషమున్నను స్వధర్మమునే యాచరింపవలయునుగాని పరధర్మవ్యామోహితులముగారాదని దేవుని యాజ్ఞ. స్వధర్మమే యింపు ప్రతిపాదింపబడినది. అదెట్లో యథాక్రమము పరిశీలింతుము.

## సౌదర్యం

ఈ వ్యాసమున కవిగారు సోదరత్వధర్మములను అన్వయవ్యతిరేక ముఖముగ నిరూపించియున్నారు. సౌదర్యమనగా సోదరుడు చేయవలసినపని, యాతని ధర్మములు. భ్రాతృయనే సంస్కృత శబ్దమునుండి యే బ్రదర్ అను నాంగ్లపదము వచ్చినదని కవిగారు నుడివిరి. భ్రాతృశబ్దము భ్రాజృ అను ధాతువునుండి నిష్పన్నమైనది. సోదరపదమునకు సమానం ఉదరం యస్యయని వ్యుత్పత్తి. లక్ష్మణుడు మూర్ఛనొంది పడియుండగా శ్రీరాముడు "దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః తంతుదేశం న పశ్యామి యత్రభ్రాతాఽసహోదరః అని విలపించినాడు. ప్రతిచోట భార్యలు, బంధువులు లభింతురుగాని లక్ష్మణునివంటి సోదరుడు మాత్రము లభింపడనినాడు. "భ్రాతా హాత్తో దక్షిణబాహుఖండః" అనినారు పెద్దలు. "కథమంబాం సుమిత్రాం చ ...." అని అయోధ్యకువెళ్ళి తల్లియడుగ లక్ష్మణుని గూర్చియేమని చెప్పుదునని విలపించెను. సోదరత్వమనగానిది. రత్నకవి సోదరుడు శ్రీ మార్కండేయశర్మగారు చిన్నవయసువనే మరణించినారు. ఆ సమయమున రత్నకవిగారెంతయో విలపించుటయేగాక "వనవాటి", "వీరాంజలి", "చంద్రశాల" గ్రంథములనువ్రాసి తమ్మునికే యంకితమొనర్చిరి. సోదరునిగూర్చి విలపించుచూ —

"హృదయసమాధిలోన నిదురించెడి తమ్ముడ లేవవోయి నీ
యెదయను లేతతేటి వరియించిన పీరసుమాలు దోసిటన్

పదిలముచేసితెచ్చితి పిపాసయగున్ ఇకలెమ్ము నాయనా".... అనినారు. కొందరు సోదరులు తన్నుకుంటారు. ఇదికూడా వారి ధర్మమా అనిపిస్తుంది. "దాయాదిశత్రుత్వం అనడం భ్రాతృవ్యశబ్దం శత్రువును చెప్పడం" చూస్తే సోదరులలో శత్రుత్వం గూడ కనిపిస్తుంది.

టెంపెస్ట్ అనే ఆంగ్లకావ్యంలో ప్రాస్పెరో అధికవిద్యా వ్యాసంగంలో పడి తమ్మునికే రాజ్యకార్యాలు వదలివేస్తాడు. ప్రాస్పెరో ఎప్పుడూ గదిదాటి వచ్చేవాడుగాడు. తమ్ముడికి రాజ్యం కాజేయాలనే దుర్బుద్ధి కలిగింది. అర్ధనిశీధమున అన్నను తెడచాపలు లేని నౌకపై కెక్కించి సముద్రంలో వదిలివేస్తాడు. ఇక్కడ తమ్మునికి సోదరత్వంలేదు.

ఛార్లెస్ టెన్నిసన్ వ్రాసిన టర్నర్ అను కథానికలో మంచి అన్నదమ్ములకథఉంది. అబ్దుల్లా, అహామద్ అని ఇద్దరు అన్నదమ్ము లుండేవారు. అబ్దుల్లాకు భార్యాబిడ్డలున్నారు. అహామద్ ఒంటరివాడు. ఇద్దరు చెరికొంతభాగంలోనూ వ్యవసాయం చేసేవారు. ఒక సం వత్సరం వరికుప్పలుపోసి అర్ధరాత్రిదాకా పనిచేసి యింటికివచ్చి పడు కున్నారు. అబ్దుల్లా ఇలా అనుకున్నాడు. మా తమ్ముడు ఒంటరివాడు. అతనికీపంటచాలదు. మనకింత అవసరంలేదు. ఆవెంటనే లేచివెళ్ళి తనదాంట్లో కొంతభాగాన్ని తమ్మునిచేనులోవేసి వచ్చి పడుకున్నాడు. తమ్ముడు అహామద్ "నా అన్నకు సంసారం ఉంది. సుఖం తక్కువ నా పంట ఇస్తాను అనుకుని పొలానికివెళ్ళి తన పంటలో కొంతభాగాన్ని అన్న పొలంలో వేసి వచ్చాడు. ఇలా కొంతకాలం గడిచింది. ఈ విషయం తెలిసిన రాజు ఎంతో సంతోషించాడు. అన్నదమ్ముల అను బంధం ఇలా ఉండాలి. ఆ ఆంగ్ల కావ్యంలో పంక్తులు చూడండి.—

"హృదయసమాధిలోన నిదురించెడి తమ్ముడ లేవవోయి నీ
యెదయను లేతతేటి వరియించిన పీరసుమాలు దోసిటన్

పదిలముచేసితెచ్చితి పిపాసయగున్ ఇకలెమ్ము నాయనా".... అనినారు. కొందరు సోదరులు తన్నుకుంటారు. ఇదికూడా వారి ధర్మమూ అనిపిస్తుంది. "దాయాద్రిశత్రుత్వం అనడం భ్రాతృవ్యశబ్దం శత్రువును చెప్పడం" చూస్తే సోదరులలో శత్రుత్వం గూడ కనిపిస్తుంది.

టెంపెస్ట్ అనే ఆంగ్లకావ్యంలో ప్రాస్పెరో అధికవిద్యావ్యాసంగంలో పడి తమ్మునికే రాజ్యకార్యాలు వదలివేస్తాడు. ప్రాస్పెరో ఎప్పుడూ గదిదాటి వచ్చేవాడుగాదు. తమ్ముడికి రాజ్యం కాజేయాలనే దుర్బుద్ధి కలిగింది. అర్ధనిశీధమున అన్నను తెలచాపలు లేని నౌకపై కెక్కించి సముద్రంలో వదిలివేస్తాడు. ఇక్కడ తమ్మునికి సోదరత్వంలేదు.

ఛార్లెస్ టెన్నిసన్ వ్రాసిన టర్నర్ అను కథానికలో మంచి అన్నదమ్ములకథఉంది. అబ్దుల్లా, అహామద్ అని ఇద్దరు అన్నదమ్ములుండేవారు. అబ్దుల్లాకు భార్యాబిడ్డలున్నారు. అహామద్ ఒంటరివాడు. ఇద్దరు చెరికొంతభాగంలోనూ వ్యవసాయం చేసేవారు. ఒక సంవత్సరం వరికుప్పలుపోసి అర్ధరాత్రిదాకా పనిచేసి యింటికివచ్చి పడుకున్నారు. అబ్దుల్లా ఇలా అనుకున్నాడు. మా తమ్ముడు ఒంటరివాడు. అతనికీపంటచాలదు. మనకింత అవసరంలేదు. ఆవెంటనే లేచివెళ్ళి తనదాంట్లో కొంతభాగాన్ని తమ్ముని చేనులోవేసి వచ్చి పడుకున్నాడు. తమ్ముడు అహామద్ "నా అన్నకు సంసారం ఉంది. సుఖం తక్కువ నా పంట ఇస్తాను అనుకుని పొలానికివెళ్ళి తన పంటలో కొంతభాగాన్ని అన్న పొలంలో వేసి వచ్చాడు. ఇలా కొంతకాలం గడిచింది. ఈ విషయం తెలిసిన రాజు ఎంతో సంతోషించాడు. అన్నదమ్ముల అనుబంధం ఇలా ఉండాలి. ఆ ఆంగ్ల కావ్యంలో పంక్తులు చూడండి.—

## వాల్మీకి - బెర్నార్డ్‌షా

బెర్నార్డ్‌షా ఆంగ్ల సాహిత్యంలో హాస్యధోరణి గలవాడు. అట్టి బెర్నార్డ్‌షా గురించి వ్యాసాన్ని ప్రారంభిస్తున్న రత్నకవిగారు వాల్మీకి-బెర్నార్డ్‌షాలకు సంబంధం ఉన్నదని, ఇద్దరికీ గడ్డం ఉండడం పోలికనీ, గడ్డం ఉండడం గొప్పదనానికి సంకేతమని, అందుకే అరవిందుల వారు, టెన్నిసన్‌లు గడ్డం పెంచేరనీ చెప్పడం అత్యంత చమత్కారం. ఏకవి గురించి మాట్లాడినపుడు ఆ కవికి ఇష్టమైన రసభావాలను ప్రతిపాదించడం సద్విమర్శకుని లక్షణం. ఇది రత్నకవిగారిలో ఉందన డానికి పై వాక్యాలే చిహ్నం.

బెర్నార్డ్‌షా నాటకకర్త. సాక్షాత్తుగా నాటకకర్త కాక పోయినా నాటక లక్షణ ప్రదర్శనం వాల్మీకికి ఉంది. వాల్మీకి వ్రాసిన జ్ఞానవాశిష్ఠంలో చూడాల యనే గాధ నాటకంలా సాగుతుంది. ఈ చూడాలగాధ శిఖిధ్వజోపాఖ్యానంలో ఉంది. చూడాల భారత ఆదర్శ మహిళామణి. చూడాల నాటకమును కవిగారు వ్రాసిరి. ఆ గ్రంథ సమీక్షలో గాధ వివరిస్తాను. బెర్నార్డ్‌షా The Man of destiny ని రచించాడు. ఇందలి నాయకుడైన నెపోలియన్ ప్రారంభమున వీరుడుగ గన్పట్టి కథాంతమున ఒక స్త్రీ చే కీలుబొమ్మవలె నాడింపబడి తృణప్రాయుడైనాడు. 1796 మార్చి 21 తారీఖునాటిగాథ. ఇటలీ దేశస్థులు ఆస్ట్రేలియా దేశస్థులచే నవమానింపబడి బాధలనొందుచుండిరి. అట్టి సందర్భమున నొక స్త్రీ వచ్చి సీజరు భార్య ననుమానింపరాదని పల్కెను. ఉత్తరములను నెపోలియను కందీయక యాతని నెన్ని విధములుగనో బాధించును.

పాశ్చాత్యుల యీ నాటకములలో పురుషుడు స్త్రీ చే నవమానింపబడినట్లు గాన్పించుచున్నది. ఈ స్త్రీకి పట్టుదల, యహంకారము గలవు. మమత ఏవిధముగనూ లేదు. భారతీయరచనలలోచూడాలభర్తకు

మహోన్నతత్వమును దెచ్చిపెట్టినది. బెర్నార్డ్‌షా హాస్య పద్యములను వ్రాయగా నొక సంస్థవారు 5 పౌనులనిచ్చిరి. ఈతడు చక్కని పద్యములను రచించి యెట్టి యాదరమును బడయలేదు. అది మొదలు హాస్యరచనలు జేసి జీవికను నడపుకొనెను. భారతీయులకు వలె పాశ్చాత్యులకు లక్ష్యముగాని, జీవనవిధానముగాని లేవనుట స్పష్టము. హాస్యము ఫలించిన కావ్యమున యాదర్శము లోపించుటచే నది మహా కావ్యము కానేరదని గమనింపవలెను. ఆ కారణముననే బెర్నార్డ్‌షా గూర్చి యిట్లనిరి. —

',Shaw's greatness lay not in his belief, but in his humour, Humour is the poetry of his life''

''Shaw's Chief failing as a dramatist was his inability to portray types with whom he had no sympathy, all his their men and women betraying blood relationship. Just as his chief failing as a man was his inability to understand People with whom he did't agree.''

''Shaw had seen Irwing in Dublin and had felt then he would be the leading exponent of modern drama''

బెర్నార్డ్‌షా ఇర్వింగ్, ఇల్లిన్ అనే స్త్రీ పురుషులను జూచి వారిచే నాటకం ఆడించడానికిగాను నాటకం వ్రాశాడు. వారా నాటకంలో పాత్రధారులుగాలేక కవికి 50 పౌనులిచ్చి ఊరుకున్నారు. మహాకవి బెర్నార్డ్‌షాలో గల శిల్పం గొప్పది. కాని పాత్రలను చూచి కావ్యము వ్రాయవలసిన స్థితి వాల్మీకికి లేదు. అయితే బెర్నార్డ్‌షాను చూచియే ఏకాంకికలు వ్రాయడం మనం నేర్చుకున్నామనిగుర్తించాలి వర్షాకాలంలో పెరిగే సొరతీగెలను సైతము సూక్ష్మేక్షణికతో చూచి వర్ణింపగల వాల్మీకి వంటి కవి ప్రపంచములో దుర్లభుడు. పాశ్చాత్యులలో గల గుణాలను మనం గుర్తించాలి. అందుకే వివేకానందుడు, ''Have an eastern heart and western mind''అన్నాడు. హృదయం

భారతీయ పద్ధతులలో ఉండాలని, మనసు పాశ్చాత్య పద్ధతులలో నుండాలని భావం.

మానవుడు తనలోని మానవత్వమును మఱచి పశుత్వమును పెంచుకొని యెలా అధోగతి నొందునో బెర్నార్డ్‌షా నిరూపించాడు. నరుడు మానవతను పెంచుకొని దైవత్వమునొంది యెట్లు భగవంతుని లో చేరునో వాల్మీకి నిరూపించి యున్నాడు. రెండువిధములైనయుపదేశములను మానవులు గుర్తింపవలెను. ఆదర్శములేని మానవజీవనము అవ్యవస్థమై యెట్లు నరకమువలె గోచరించునో యాంగ్ల కవి నిరూపింప వాల్మీకి సంస్కరణము నొంది నరులు సత్యపరాయణులై యిచటనే యెట్లు సురలోకమును నిర్మింపగలరో నిరూపించినాడు. "We can see good without Mammon" "అవిద్యయామృత్యుంతీర్త్వావిద్యయాఽమృతమశ్నుతే" అవిద్యవలన మృత్యువును దాటి విద్యవలన అమృతము నొందును. గాన రెండునూ గ్రాహ్యములే.

## సంస్కృత భాషా సౌలభ్యం

1948 జనవరి 21 వ తారీఖునాటి ఆంధ్రపత్రిక యందు యీ వ్యాసం "సంస్కృతమే రాజభాష" యను పేర ప్రచురింపబడినది. నేను చూచితిననుటకు మై దేఖా థాయని హిందీలోను I have Seen అని ఆంగ్ల మునందును ప్రయోగింపబడును. విద్యార్థులు I Saw యని ప్రయోగింతురు. సంస్కృతభాషయందైనచో అహమపశ్యమ్ అనకుండా. మయాదృష్టా యనియు చెప్పవచ్చును. ఇది ఈ భాష యందలి సులభమైన పద్ధతి. ఇతర భాషలలో యీ సౌలభ్యము లేదు. "వాడు వచ్చాడా?" యని Did he come వహ్ ఆయా క్యా అనే వాక్యాలలో సర్వత్ర క్రియ వాడితీరవలయును. సంస్కృతంలో అయితే క్రియ వాడకుండా సః ఆగతః కిమ్? అని అనవచ్చు. లేదా విశేషణాలతోనే క్రియ లేకుండా వాక్యనిర్మాణం కుదురుతుంది. "తే సర్వే యోగ్యాః"

అనేది సంస్కృతాంధ్రాలలో సమానంగా కుదురుతుంది కావ్యభాషలో పోల్చి గ్రాంథికానికి కష్టం అనడం సబబుకాదు. బాణహర్షులరచనలవంటి ప్రౌఢరచనలు ప్రతిభాషలో గలవు. నోట్సులేని షేక్స్పియర్ రచనలు, మిల్టన్ రచనలిందుకు ఉదాహరణలు. పూర్వకాలే ఏకః రాజా ఆసీత్ తస్య తిస్రః భార్యాః'' ఈవాక్యాలెంత సులభమో కావ్యపఠిత లకు తెలిసిన విషయమే.

ఉపనిషత్తులలో బహుసులభ వాక్యాలు ప్రయుక్తాలయ్యాయి. ఈ సులభ పద్ధతిని Plato వంటి మేధావిగూడ అనుకరించాడు. ఉపనిషత్తులలో ఒకే విషయం చిన్న చిన్న వాక్యాలలో మరల మరల చెప్పబడుతుంది. ఇందువలన వాక్యాలు సులభంగా కంఠస్థమవుతాయి. 'నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియంభవతి ఆత్మనః కామాయ తు సర్వం ప్రియం భవతి'' 'ఆత్మని వా అరే దృష్టే శ్రుతే మతే అవి జ్ఞాతం విజ్ఞాతం భవతి'' పై వాక్యాలెంత సుగమావబోధాన్నిస్తున్నాయో సహృదయులకు తెలుసు. కావ్యభాషను జూచి భయపడరాదు. పురాణాలలో చాలా తేలికయైనభాష గోచరమౌతూంది. చెళ్ళ పిళ్ళవారి రామాయణంలోని ఒక పద్యంలో మూడు పాదాలు చదివినా భావంబోదపడలేదు. ఈ మూడుపాదాలు ఒకే సమాసము. నాల్గవపాదంలో సాయంతనములు అని వచ్చింది. అప్పుడుమనం ఇది సాయంవర్ణనమనిగుర్తిస్తాం. ఈభాషసామాన్యులకుగాదనిగుర్తించాలి. ఉపనిషత్తులలో యొకచోట వాక్యములను చూడండి-'న్యగ్రోధసమిధ మా హరేతి. ఇదం భగవఇతి'' ఇది పితాపుత్రుల సంభాషణ. ఈ భాష సర్వజనవేద్యమనుటలో విచికిత్సకు తావుండదు. సంస్కృతంలో క్రియావిధానము దశలకారాలతో కూడియున్నది. దశలకారాలను తొలగించి కేవలం త్రికాలాలను దెలిపే మూడు లకారాలను మాత్రమే వాడవచ్చు.

6)

ఆంధ్రభాషలో "కలజ్యాను బంధకంబుభవిష్యదర్థమునందగు" అనుబాలవ్యాకరణ సూత్రమునసురించి "కల"యనునది భవిష్యదర్థము నందు మాత్రమే వాడనగును I can go అను ఆంగ్ల వాక్యమునకు ఆంధ్రానువాదము కుదరదు. హిందీభాషలో సంస్కృతపదాలు మిక్కుటముగ ప్రవేశించినవి. "ద" అనునది ఇచ్చుట యనునర్థము నందు వచ్చుననియూ నీరునొసంగునది గావున "పయోద"మైనదనియు తెలిసినవాడు అంబుద,జలద,నీరద మొదలగుపదములను అనాయాసముగ ప్రయోగింపగలడు. ఇది గైర్వాణియందలి సులభపద్ధతి. cloud అనే ఆంగ్ల పదంవల్లగానీ, మొగలు అనే ఆంధ్రపదం వలనగాని అట్టి అర్థం రాదుగదా.

"అన్నం" అనే పదానికి "అద్యతే ఇతి అన్నమ్" అనే వ్యుత్పత్తిచెప్పగకుదురును. సంస్కృతభాషలో అనేక పదములకు అర్థములుగలవు. "అర్థ లేని చదువువ్యర్థం" అనే సామెతగూడ సంస్కృతభాషకు వర్తించినట్టుల మఱి యే యితర భాషకును వర్తించదనుట సత్యదూరముగాదు.

పై విషయాలను మృదుమధురభాషలో ప్రతిపాదించిన శ్రీరత్న కవిగారు సంస్కృతభాషాభివృద్ధికి తగిన వనరులను సమకూర్చాలని ప్రభుత్వానికి వ్యాసముఖంగా సూచనలివ్వడం వారి గైర్వాణీ భాషాభిమానానికి నిదర్శనం. మధుధారవంటిది, విజ్ఞానమునిచ్చునది, దేవసంభాషణార్హ, అమృతస్వరూపిణియగు సంస్కృతవాణి సర్వోత్కృష్టమై వర్ధిలుగాతయని యిట్లు శ్లాఘించుచు వ్యాసమును ముగించిరి——

"జయతు మధుధునీ జ్ఞానసందాయినీ
త్రిదివనిగదితా దేవభాషాఽమృతా"

## కాళిదాసు

ఈతడు సర్వకళాధురంధరుడని, సర్వవిజ్ఞాననిధియని, యీ వ్యాసమున ౦బటిపూడివారు వివిధోదాహరణములతో సిద్ధాంతీకరించి యున్నారు. మేఘసందేశమునందలి "వల్మీకాగ్రాత్ప్రభవతి ధనుఃఖండమాఖండలస్య" అను వాక్యమతని జ్యోతిశ్శాస్త్రవిజ్ఞానమును వెల్లడి చేయుచున్నది. పుట్టనుండి ఇంద్రచాపము వెడలుట శాస్త్రీయ విషయము. ఇందులకు జ్యోతిశ్శాస్త్రమునందనేక ప్రమాణములుగలవు. సాధారణకవి యీ భావమును కవిత్వమున కూర్చలేడు. రఘువంశంలో గూడా "చిత్రాచంద్రమసోరి." అనే ఉదాహృతి వాక్యంద్వారా సుదక్షిణాదిలీపులు చిత్రానక్షత్రం, జాబిల్లి లాయుండిరని చేసిన వర్ణన ద్వారా యీతని జ్యోతిశ్శాస్త్ర వైదుషి యవగతమగుచున్నది.

అలాగే "షడ్జసంవాదినీః కేకాః" అను వర్ణనము వలన యీతని సంగీతశాస్త్రనైపుణి పఠితలకు తెలియును. షడ్జధ్వని మయూరగళము నుండి నిస్సృతమగును. రఘువంశరాజుల ప్రవర్తనను దెలుపుచు "శైశవేఽభ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణామ్" అనుట యౌవనమున వివాహమాడి గార్హస్థ్య ధర్మమును పాలన సేయవలెననెడి ధర్మశాస్త్ర నియమమును స్ఫుటమొనర్చుచున్నది. "ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః" యని ఉపనిషద్వాణి ధర్మమును నిర్దేశించుచున్నది.

గ్రంథారంభమున "మందఃకవియశఃప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతాం" అని తన వినయమును ప్రదర్శించినాడు. ఇచట కవి శబ్దమునకు బ్రహ్మమని అర్థము. యశస్సు అనగా వైభవము. జీవుడనైన నేను పరబ్రహ్మమునన్నైక్యముకాగోరుచున్నాననెడి గంభీరార్థమిమిడియున్నది.

రఘువంశమున వందేయని ప్రయోగముగలదు. ఆతడప్పటికి జీవుడేగాని పరబ్రహ్మైక్యమునందలేదు. శాకుంతలమున "అవతు

ఈశః” అనినాడు. సమష్టియందు వ్యష్టిభావనకు స్థానముంటుంది. కావుననే స్వత్వమును వదలి బ్రహ్మైక్యము నొందిన కాళిదాసు ఈశుడు రక్షించుగాతయని ద్రష్టలనాశీర్వదించినాడు. శాకుంతలమున భరతుని రూపముగా దుష్యంతుడే తిరిగి యవతరించినాడు. “సదేవసోమ్య ఇద మగ్ర ఆసీత్” అను శ్రుత్యర్థము వ్యంగ్యరూపమున ప్రతిపాదించినాడు. సప్తమాంకమున శకుంతలను “వసనే పరిధూసరే వసానా” యని చేసిన వర్ణనము “వాసాంసి జీర్ణాని యథా విహాయ అన్యాని సంయాతి నరోఽపరాణి” యను గీతావాక్యమును స్మరింపజేయును. శకుంతల మలినవస్త్రములను ధరించినట్లు కవినుడివినాడు శరీరమువలె వస్త్ర మున్నది. శకుంతల చైతన్యమువలె భాసించినదని స్ఫురించుచున్నది. ఇట్లు జీవి శరీరమును విడచి పరలోక గమనాగమనాదుల నొనరించు ననెడి కర్మసిద్ధాంతమును లెస్సగ హృదయంగమముగా వ్యంగ్య ముఖముగా కావ్యమున జెప్పినాడు. ఇదియే కావ్యపరమార్థము. ఇట్లు కావ్యములయందు తన సంగీత జ్యోతిష వేద వేదాన్తాదిసిద్ధాంతము లను నిరూపించి తన కవితానిర్మాణమార్మికతను సహృదయుల ముందుంచినాడు. అందుకే అతడు కవికులగురుడయినాడు.

కురుక్షేత్ర రణ విజేతలయిన పాండవులలోగూడా అనేక దోషములుగలవు. ప్రతిపక్షులైన సుయోధనాదులయందుసైతము, గుణములున్నవి. భారవి సుయోధనుని వర్ణించు సమయమున:

“సఖీనివ ప్రీతియుజో ఽనుజీవినః సమానమానాన్ సుహృదశ్చ బంధుభిః
స సంతతం దర్శయతే గతస్మయః కృతాధిపత్యామివ సాధుబంధుతామ్”

## కవిత్వంలో వైభవాలు

సేవకులను మిత్రులవలె, మిత్రులను బంధువులవలె, బంధువులను తనతో సమానమైన యాధిపత్యము గలవారలగను గౌరవించుచున్నా డని వర్ణితము. ఇంతమాత్రముచేతనే సుయోధనుడుత్తముడనుటతగదు.

ఏలయన పై శ్లోకములలో "తథాపి జిహ్మాస్సుఖవజ్జిగీషయా" యని యాతడు కాపట్యముతోనే యట్టి కార్యక్రమమును చేపట్టెనని కవియే ప్రతిపాదించినాడు. కావున పైకి కనిపించు మంచి మంచిగాదని, ఆత్మ శుద్ధి యవసరమని తెలియుచున్నది. జ్ఞానముతోకూడిన మంచియే మంచి, అందుకే సంధ్యావందనమున "అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోపి వా" యస్స్మరేత్పుండరీకాక్షం సబాహ్యాభ్యన్తరశ్శుచిః" యని బాహ్యశుద్ధికంటె యంతశ్శుద్ధియే గొప్పదని చెప్పబడినది.

ఆదిశంకరాచార్యులవారు అంతశ్శుద్ధిని తెలుపుచూ,

"గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే
విశాలే శైలేచ భ్రమతి సుకుమారం జడమతిః
సమర్పైకం చేతస్సరసిజ ముమానాథ భవతే

సుఖేనావస్థాతుం జన ఇహాన జానాతి కిమహో" యని శివానందలహరిలో మనస్సును పువ్వని వర్ణింపగా కాళిదాసు, "అనాఘ్రాతం పుష్పం కిసలయమలూనం కరరుహైః"యని శకుంతలను అనాఘ్రాత కుసుమముగా చెప్పి బాహ్యసౌందర్యమును వర్ణించినాడు.

"పద్మకోశ ప్రతీకాశం హృదయం చాప్యధోముఖమ్" అను శ్రుతి యందు హృదయము తామరపువ్వుతో బోల్చబడుట యెంత సహజ రామణీయకత సంతరించుకొనినదో గాంచుడు. ఛాందోగ్యోపనిషత్తు యందు సర్వజీవులకు పరస్పరము భేదము కమనీయముగ నిరూపితమైనది, అంతశ్శుద్ధి గల వానివలన యెవనికీ యెట్టి కష్టము కలుగదు. ఇట్టి మానసిక శుద్ధికొఱకే కావ్యాలు, పురాణాలు ఉన్నాయి. తీరని కోరికలే స్వప్నాలుగా వస్తాయని ఫ్రాయిడ్ అనే మనస్తత్వ శాస్త్రవేత్త చెబుతాడు. కోరికలు పెంచమని అర్థశాస్త్రం చెబుతూంది. కోరికలకు అంతులేదు గనుక వాటిని నిగ్రహించడం శ్రేయోదాయకం. కవు లందుకే సంయమనం చెప్పారు.

# పేరుకోసం

ప్రతివాడికీ కీర్తి కాంక్షమెండు. కవులు కావ్యాలు వ్రాయడం గూడా కీర్తికోసమే. "కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతర క్షతయే-

సద్యః పరనిర్వృతయే కాంతా సమ్మితతయోపదేశయుజే" అనే మమ్మటుని శ్లోకంలో కావ్యం వలన కీర్తి వస్తుందని చెప్పబడడం అసత్యంకాదు. శిల్పి రకరకాల శిల్పాలను చెక్కడం మానవుల యభిరుచులను బట్టి రుచించడానికే ఇదువలన శిల్పికి పేరువస్తుంది. ప్రపంచములో మంచి చెడ్డలు రెండూ ప్రతిచోటా ఉంటాయి దేవాలయాలలోని రథాలపై ఊర్ధ్వభాగంలో మంచి బొమ్మలు, అధో భాగంలో అయోగ్యమైన బొమ్మలూ ఉంటాయి. నాటకాలలోగూడా నాయకుని దైన్యావస్థతో బాటు ఇంకొంత హాస్యం గూడా ప్రదర్శింప బడుతుంది.

సీతయ్యఅనేవాడుండేవాడు వాడు పాఠశాలనుండి యింటికివచ్చే సమయంలో నాలుగురోడ్ల కూడలిలో ఒక చక్కని బొమ్మను చూసాడు. పేరుతెచ్చుకోవాలనుకున్నాడు. ఇంటికివచ్చి రాత్రి మత్తు గొలిపే పదార్థం సేవించి పడుకున్నాడు. అర్ధరాత్రి లేచి సరాసరి బొమ్మవద్దకు వెళ్ళి దాన్ని చించేయసాగాడు నలుగురూ లేచి వానిని పట్టుకుని పోలీసులవద్దకు తీసుకొనివెళ్ళారు. ఎందుకీపని చేసావనడుగగా యిలా చెయబట్టే నలుగురి దృష్టిలో ఒకసారిపడి పేరుతెచ్చుకోగలిగా నన్నాడట. తరువాత నున్నగా గుండు చేయించుకొని నికనుబొమ్మలు తీయించుకొని తరగతిలో కూర్చున్నాడు. పాఠశాలకొకయధికారి వచ్చి యాతనినిచూసి నవ్వుకొని తరగతినుండి నిష్క్రమిస్తూ I can not forget him.' అన్నాడట. తరువాత సీతయ్య అధికారిచేయొన్నటికి మరువలేనివాడిగా గుర్తింపబడ్డాను, యిదంతా పేరుకోసం అన్నాడట.

గాంధీమహాత్ముడు చాలాకాలం శ్రమించి పేరునొందాడు. కాని గాడ్సే చెడుపనిచేసి శీఘ్రంగానే నలుగురినీ ఆకర్షించాడు. ఎలా పేరొందినా చాలుననుకునే వాళ్ళు ఎక్కువ. కవులుగూడా

"My sisters
is able created hundreds,
and
hundreds." అని ఆంగ్లంలోను,

"రా
కాసులు
భూ
కాంతులు" అని తెలుగులోను కవిత్వం చెప్పడం పరిపాటి అయింది. క్రొత్తగా వైలక్షణ్యంతో వ్రాస్తే ఏదో పేరు వస్తుందని వీరి తపన.

ఒక గ్రామస్థులు గ్రామంలో ప్రజోపయోగార్థం ఒక నిర్మాణాన్ని చేయ సంకల్పించినారు. అయితే కిష్టయ్య అనేవాడిని కలవకుండానే కూలీలను పిలిచి పని అప్పగించారు. గ్రామస్థులు వెదికినా గ్రామాంతరములో ఉండడమువలన కిష్టయ్య కనపించలేదు. పని చురుకుగా సాగుతున్నసమయములో కిష్టయ్య వచ్చి విషయంగ్రహించి 'రోజునకు 6రూపాయిలు యీ కాలంలో ఏంగిట్టుబాటవుతుంది? కనీసం 8 అయినా ఉండాలి" అని వెళ్ళిపోయాడు. సాయంసమయంలో గ్రామ పెద్దలు వచ్చి 6 రూపాయలివ్వబోగా కూలీలు 8 లేనిదే గిట్టుబాటు కాదన్నారు. గ్రామస్థులు ఆశ్చర్యపడి కిష్టయ్యను న్యాయం అడగ డానికి వచ్చేసరికి, బయట మంచంమీద పడుకొనియున్నాడు. వారు చెప్పిన మాటవిని "పెట్టుకొనేటప్పుడు నన్నడిగారా? ఇలాంటి పనులుచేస్తే నేనేం జేస్తాను? అని లేచి నడువసాగాడు. కూలీలు, పెద్దలు గూడా అతనివెంట నడువసాగారు. "కూలీలకష్టం మనకెందుకు,

8 రూపాయలిచ్చి పంపించమని" నిర్ణయం చేసిపోయాడు కిష్టయ్య పేరుకోసం ఇలాచేసేవారు కొందరు. భార్యకు వడ్డాణం చేయించి పేరు పొందుతాడు ఒకడు.

గాంధీగారు మంచికోసం శ్రమించారు. గాంధీగారు అహింసా సిద్ధాంతాలను ప్రచారం చేస్తున్న కాలంలోనే "నవకాళి, తిప్పేర" ప్రాంతంలో దారుణరక్తపాతం జరిగింది. రెండురకాలుగా పాల్గొన్న వారికీ పేరొచ్చింది. ప్రపంచదేశాలుకూడ పేరుకోసం పరితపిస్తున్నట్లు న్నాయి. ప్రపంచదేశాలు పేరుకోసం అహింసా సిద్ధాంతాలను ప్రచారం చేస్తున్నాయ్. మరియొకవైపు విధ్వంసకచర్యలను కొన్ని దేశాలు ప్రేరేపిస్తున్నాయి. అందరూ పేరుకోసం ప్రయత్నించేవారలే గానీ సామాన్యుడిని, కళాకారుని, ఉత్తమ పౌరుని గుర్తించేవాడెవడూ లేడు.

ఇలా యీ వ్యాసంలో రత్నకవిగారు సరసంగా సహాస్యంగా విషయప్రతిపాదనం జేసారు.

## విద్యాబోధలో తులనాత్మకరీతి

పాఠశాలలో ఆంగ్లం, ఆంధ్రం, హిందీభాషలు బోధింపబడు తున్నాయి. ఆంగ్లాంధ్రాలు స్పెషల్ అనీ జనరల్ అనీ రెండుగా విభ జింపబడ్డాయి. మూడుభాషలొకేసారి బోధింపబడటమూ, వ్యాకరణ నియమాలు భిన్నభిన్న పద్ధతులలో చెప్పబడటము, విద్యార్థి మనస్సును అవ్యవస్థం చేస్తున్నాయి. అచ్చులంటే ఏమిటో హల్లులనగానేమో వివరించి విద్యార్థి కవ్యవస్థను చేకూర్చడంకంటె ప్రత్యాహారాలు చెప్తే సులభంగా బోధపడడమేగాక జిజ్ఞాసగూడ నివృద్ధమవుతుంది.

ఆంగ్లోపాధ్యాయుడు వాక్యమును వివరించుచూ, "A group of words which makes complete sense is called a sentence" అనగా ఆంధ్రోపాధ్యాయుడు వాక్యమనగా యోగ్యతాకాంక్షాపత్తి యుక్త పదసముదాయము"నును. ఇట్టి భిన్న భిన్న లక్షణములగాంచి

విద్యార్థి నిరాశోపహతుడగుట సహజము. త్రివిధలక్షణములను సమన్వయపరచుచు బోధించిన విషయము సుగమమై వికాసము చేకూరును.

విషయప్రతిపాదన వేళయందు మూలశ్లోకమునో, పద్యమునో యుదహరింపక తదర్థమును పదములతో బోధింపరాదని రత్నకవిగారు ప్రతిపాదించిన నూత్నాంశము. ఒక సమయమున కాదంబరిలోగల సహగమన విషయమును వ్రాయుడని ప్రశ్నపత్రమునందు ప్రశ్నింపబడినది. కాదంబరియందలి సహగమన విషయమనవగమ్యమానమై విద్యార్థులకేగాక నుపాధ్యాయులకును వైమనస్యమాపాదించినది. ఉపాధ్యాయునకు తలస్పర్శిత్వము లేకుండుటయే హేతువు. M. A.లో మూలములేదు చివరకు అనువాదపద్ధతినడిగిరని భ్రాంతినొందిరి.

విషాదాంత నాటకములు లేకున్నను పాశ్చాత్యనాటకములను బోధించునపుడు కాంచనమాలవంటి రచనలను మనముననిడుకొని బోధించుటయుక్తము. కాంచనమాల యూరిపిడిస్ గ్రంథపద్ధతిలో వ్రాయబడినది. అర్థశాస్త్రబోధనావసరమున డినెట్ సేన్ వారి గ్రంథాలతో బాటు కట్టమంచి రామలింగారెడ్డిగారి "అర్థశాస్త్ర" గ్రంథంలోని విషయాలను బోధకుడు గ్రహించి విషయబోధనము సేయుట యుక్తతమమని రత్నకవి మనీష. ఇట్టి బోధనలవలన విద్యార్థి శాస్త్రనిష్ణాతుడై ప్రజా సమక్షమున గూడ విషయమును ప్రకటింపంజాలును. Pecurary పదంలో e అకారం, e శకారం పలుకుతాయని భాషాశాస్త్రం చెబుతూంది. ఈ పదం పశుస్ శబ్దభవం. పశుశబ్దం ధనవాచకమనడానికి "ఆర్యులకు పశుధనమే ధనం" అనే ప్రయోగం ఉంది ఇలా వివృతివల్ల విద్యార్థిజ్ఞానం వివృద్ధ మౌతుంది. పూర్వకాలంలో 6 వ తరగతిలో ప్రవేశించేనాటికి గ్రామరులో నిపుణుడవడంచేత అన్ని విషయాలు ఆంగ్లంలో బోధించినా విదితుడై రాణించేవాడు.

1920 వ సంవత్సరం నుండి రాజకీయ ప్రభావ విసృత్తోద్యమంలున్నతై విద్యార్థులు విద్యయందు శిథిలితలక్ష్యులైరి. భాగ్యనగరమందలి బహు స్థలాలలో వివిధభాషలు భాషించే జనులు దృగ్గోచరులౌతున్నారు. అన్ని భాషలలోను సంస్కృతపదాలధికము. సంస్కృతపదజాలం తెలియడంవలన ఈ భాషలన్నియు సులభవిదితములగును.

పాశ్చాత్యులీదేశమున ప్రవేశించిన కాలమున వారు జిజ్ఞాసువులై గురువులచెంత జేరి సంస్కృతభాషనభ్యసించి యందలి విషయములను పాళీభాషలో వ్రాయుట జరిగినది. కావున తులనాత్మక విద్యాబోధన పాఠశాలలయందు అవశ్యసమాచరణీయమని కవిగారు నిరూపించిరి.

## అరూప కృత్యాలు

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి "స్వర్గానికి నిచ్చెనలు" నవలలో శరీరంలేని వ్యక్తి నిచ్చెనయెక్కి పడినట్లు చెప్పబడినది. రూపంలేని వ్యక్తులు" వారుచేసే చేష్టలను చాలామంది వర్ణించారు ఇవన్నీ చాదస్తులు విశ్వసిస్తారంటే విశ్వనాథవారు యం.ఏ. చదివిన అధునాతనులే రత్నకవిగారు తమ మేనల్లుడిట్టి సంఘటనలను నమ్మే వాడుకాదని చెబుతారు. అయితే ఆవ్యక్తి విద్యాసముపార్జనకై విదేశం వెళ్ళాడట. మ్యాచ్ ఖండ్ ప్రాంతంలో విద్యార్థులందరూ వారివారి గదులలో నివసించేవారు. ఒకరోజు అర్ధరాత్రి తలుపులు బ్రద్ధలుకొట్టే శబ్దాలురావడం. అందరూ మేల్కొంచి యెవరినీ గాంచకపోవడం జరిగింది. మరియొకరోజు ఇండ్లపై రాళ్ళుపడడం జరిగింది. దీనికి సరియైన కారణం యెవ్వరూ చెప్పలేకపోయారు. ఈ విషయాన్ని స్వయంగా చూచి విశ్వసించిన వారి మేనల్లుడే కవిగారికి జాబు వ్రాసాడట.

షేక్స్పియర్ మహాకవి వ్రాసిన Hamlet నాటకంలో ప్రేతం రావడం వర్ణించబడింది. విశ్వనాథవారి వసుంధరలో మరణించిన

వ్యక్తి వసుంధరవద్దకు వస్తాడు. సింగరవేలు చేసిన ప్రయత్నం విఫల మౌతుంది అయితే వసుంధరవద్దకు ఆ వ్యక్తి వచ్చాడంటే వారిద్దరికీ సంబంధముంది. కాని మ్యాచ్ ఖండ్‌లో జరిగిన విషయంలో ఆ వచ్చిన వ్యక్తులకు విద్యార్థులకు ఎట్టి సంబంధంలేదు. ఇది విచిత్రమైన సంఘటనయని చెప్పకతప్పదు. నవీనులు వివరణ చేయలేని విషయాలు చాలా ఉన్నాయి.

## కవిత్వం - అనువాదం

ఈవ్యాసంలో రత్న కవిగారు మూలగ్రంథాలు వాటిని ఆంధ్ర కవులెలా అనువదించినదీ సమగ్రంగా తెలిపారు. శ్రీమహాభారతములో వ్యాసముని యోజన గంధిని గాంచిన విధము యిట్లు వివర్ణింపపడినది—

"సకదాచిద్వనం యాతో యమునామభితో నదీం
మహీపతిరనిర్దేశ్యం అజిఘ్రద్గంధ ముత్తమమ్
తస్య ప్రభావమన్విచ్ఛన్ విచచారవనం నృపః
సదదర్శ తదాకన్యాం దాశానాం దేవవర్ణినీం"

దీనిని యభినవ వాగనుశాసనుడైన నన్నయార్యుడు ఇట్లు అనువదించెను-

కనకావదాతకోమల,తనులత దనుమధ్య గనుబదళనేత్రను యో జన గంధన వని నాధుడు, గనియెను సురకన్య వోని కన్నియ నెంతన్"
అవదాత శబ్దానికి పసుపురంగనెడి యర్థము గలదు. బంగారము వలె వచ్చని మేని ఛాయతో ప్రకాశించునది మాత్రమే గాక సుకుమారవతి యని దెల్పెను.

నైషధము విద్వాంసులకౌషధమువంటిదని ప్రసిద్ధి. నైషధము నందు "ణిసిధాత్వర్థమను గ్రహింపదగవే" యని గలదు. "ణిసిచుంబనే" యని ధాతువు గాన ముద్దిడుకొనుట క్రియార్థమగుచున్నది. చుంబనము

నొసగుమ నెడియర్థము భంగ్యంతరముగా జెప్పబడినది. ఏతాదృశ ప్రయోగ బాహుళ్యము గల నైషధము నాంధ్రీకరించుట స్వతంత్ర గ్రంథము వ్రాయుట కన్న కష్టతరము. అనువాదమునకు శ్రీనాథుడే యన్ని విధములా తగినవాడు. నైషధమునాంధ్రీకరింపగల కవిశేఖరుడు నేటిదనుక మరియొక్కడు గానరాడు.

శ్రీ నాథుని —

"ప్రాతఃకాలము వాయసమ్ము ఫణినాంప త్యక్తశాస్త్రంబులో
తాతజ్ స్థానులు చెప్పు డెవ్వ యను చందంబొప్ప కాకాయనన్
జాతుర్యంబలరార నుత్తరము విస్పష్టంబుగాఁ గోకిల
వ్రాతంబిచ్చెఁదుహీతుహీయని గృహారామప్రదేశంబులన్." అను

పద్యమునకు మూల మిట్లున్నది —

"ఇహాకిముషసి పృచ్ఛ్యాశంసికంశబ్దరూప
ప్రతినియమిత వాచా వాయసేనైషపృష్ఠః
భణఫణిభవశాస్త్రే తాతజః స్థానివః కా
ఇతివదతి తుహీవాగుత్తరః కోకిలోఽభూత్"

మూలమునందు "గమికకీర్మకృతనైకనీవృతా" యను దానికి శ్రీనాథుడు "గమికకర్మీకృతనైకనీవృతుడనై కంటిన్ విదర్భంబువన్" అని చెప్పగా ననువదించినాడు "అధిగత్య జగత్యధీశ్వరాత్ అను మూల శ్లోకము ననువదించుచూ" అట్లు పురుషోత్తముండైన". అని చేయబడిన యనువాదమున డెందమను పదము సహృదయహృదయా హ్లాదకారియై మూలాధిక సౌందర్యమును దెచ్చినది. "అయమేత్యతడా కనీడకైః— అను శ్లోకము నాంధ్రీకరించుచూ శ్రీనాథకవి ప్రయోగించిన సామెత అమందానందజనకమనుట సుజనప్రమాణీకృతమే. "సదసత్సంశయగోచరోదరీ" యనుదానిని "అస్తినాస్తివిచికిత్సాహేతు శాతోదరిన్"యనుట మూలకర్తకేమరియొక సమానమునందిచ్చుట.

జయదేవ మహాకవి ప్రణీతమగు గీతగోవిందము నందలి యీ క్రింది శ్లోకమును గాంచుడు—

"వసన్తే వాసన్తీ కుసుమసుకుమారై రవయవైః"
భ్రమన్తీం కాంతారే బహువిహిత కృష్ణానుసరణామ్
అమందం కందర్ప జ్వరజనిత చింతాకులతయా
వలద్బాధాం రాధాం సరసమిదమూచే సహచరీ

దీనిని శ్రీ చల్లా పిచ్చయ్య శాస్త్రిగారు అనువదించినారు. వీరికి అభినవ జయదేవ యనెడి బిరుదు గలదు. వారి యనువాదమును చూడుడు—

"నిండు వసంతమందు తన నెచ్చెలి రాధిక కూర్మి పెంపుమై
నుండిన నెమ్మనంబు వెతకోర్వక డస్సిన మేని సొంపుతో
పండిన తీవవోలె నవపంక్తుల గుమ్మరి కృష్ణుగాన రా
కుండిన జింతనుందు తఱినూఱట కై చెలిలీలనిట్లనున్"

ఈ అనువాదము బాగున్ననూ మూలమందలి మాధుర్యమిందు లేదని చెప్పవచ్చును. వర్ణనమునకు మాధుర్యమును దెచ్చిన, వాసన్త, కుసుమ, సుకుమార పదాలు ఇట ప్రయోగింపబడకుండుటయే యందులకు కారణము. ఇదే శ్లోకమును Edwin Arnold అను ఆంగ్ల కవి యిట్లనువదించెను.

"Beautiful Radha,
Jasmina bosomed Radha,
All in the spring time
Waited by the wood
For Krishna fair
Krishna the all forget put
Krishna with earthy love's
falls fair consuming
And some one of her
maidens sang this song"

ఈ అనువాదమెంత బాగున్నను మూలసౌందర్యము లేదని యే చెప్పనగును. ఈకావ్య భాగంలోని ఆఅవవాక్యానికి మూలంలేదు. రైమ్‌లేదు. మూలంలోని కందర్ప జ్వరమనే పదానికి Earthy Fair అనే అనువాదం ఔచిత్యవంతంగాలేదు. న్యాయంగా ఆలోచిస్తే జయదేవ మహాకవి గీతగోవిందకావ్యంలోని మహత్తుసౌందర్యాన్ని ఎవ్వరూ అనువదించలేరని చెప్పవచ్చు.

మూలసౌందర్యమును కనీసం అనువాదములలోనికి తెచ్చుటకై అనువాదకర్త ప్రయత్నించవలయును. కొందఱు మహాకవులు మూలానికి మెఱుగులుదిద్ది మూలాధికసౌందర్యసంపాదనాచణులగుదురు. అది మూలగ్రంథకర్త భాగ్యము. ఇవి వెంకటరత్నకవిగారు తెల్పిన ముఖ్యాభిప్రాయములు.

## నవ్యాంధ్రంలో నవ్యకవిత్వం

నవ్యకవిత్వం, నవ్యకవిత్వం అని అంటారేగాని నవ్యకవిత్వాని కొక లక్షణం ఉన్నట్లు కన్పించదు. ప్రాచీన కవితలల్లుటకు ఛందోదర్పణాది గ్రంథాలున్నట్లు నవ్యకవిత్వానికి నిర్దిష్టనియమాలు లేకపోవడంవలన వ్రాయదలచినవాడు మార్గంతోచక విభ్రాంతుడగుచున్నాడు. విశ్వనాథగారు వ్రాసిన కిన్నెరసానిపాటలు నవ్యకవిత్వమే. అందులో కవిగారు కొన్ని నియమాలేర్పఱచుకొని రచించినట్లు స్పష్టము. ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు వ్రాసిన గేయాలలో గూడ కొన్ని నియమాలు గోచరిస్తాయి. భావకవితలు వ్రాసేవారు లక్షణాలకై ఇబ్బందిపడడం చూస్తున్నాం. కొంతమంది నవభావకవుల రచన యిలాఉంటుంది —

"నా యీ వచన పద్యాలనే దుడ్డుకర్రలతో
పద్యాలనడుములు విరగదంతాను.
చిన్నయసూరి బాలవ్యాకరణాన్ని చాల దండిస్తాను.

మాటలు దోస్తాను.
నా యిష్టం వచ్చినట్లు చేస్తాను."

ఇందులో అభ్యుదయభావం లేశమైనా లేదనేది సత్యమేగదా.

ఇంకా కొందరిలా అంటున్నారు—

"సెద్ధమే అర్థమైతే
అభాషే భాషైతే
నీరసమే రసమైతే
పొయిట్రీకాదదితో యిట్రీ" కొందరికవితయిలాఉంది,

"తెల్లని పంచా, సన్నని లాల్చీ.
కంటికిస్పెక్ట్సు, కాళ్ళకు షెక్కు
చేతిలో ఫైలూ, అమరకపోతే
నవకవి కాదు................"

నవ్యకవిత్వాన్ని నిందించడం ప్రధానలక్ష్యం కాదు. నవ్యకవిత్వానికిలక్షణాలు చెయ్యాలని రత్నకవిగారు వ్యాసముఖంగా సూచిస్తున్నారు. "Poetry is the criticism of life" అని కవిత్వాన్ని గూర్చి ఆర్నాల్డ్ మ్యాత్యూ వ్యక్తంచేసిన అభిప్రాయం. నవ్యకవిత్వం శ్రోతలకేగాక పాఠాలు చెప్పేవారికి గూడ అర్థంకావడంలేదు. "రమ్యాలోకం" అనే గ్రంథం నవ్యకవితాలక్షణాలను వివరిస్తుందని కొందరంటారు. కాని యిదిగూడ ప్రాచీన పద్ధతిలోనే ఉన్నది.

## సత్యం - అహింస

సత్యం గొప్పదా ? అహింస గొప్పదా ? సత్యాన్ని పాటించాలా ? లేక అహింసను పాటించి సత్యాన్ని వదలివేయవచ్చా ? అనే అంశాలను శ్రీ అంబటిపూడి వెంకటరత్నంగారు ఈ వ్యాసంలో చర్చించారు. కవిగారి పరిధిలో యొకసారి కోళ్ళకన్నింటికి ఒకేసారి అనారోగ్యం కలిగింది ప్రజలంతా దేవికి మొక్కుకొని మేకను కొలువు

లలో బలియిస్తామని సంకల్పించుకున్నారు. వైద్యులు కుక్కుటములను పరీక్షించి మూడురోజులలో తగ్గునని చెప్పిరి. మూడురోజులలో వ్యాధులు తిరోగతినందినవి. కొలుపులువస్తే సత్యంకోసం మేకను బలి యివ్వాలా? లేక అహింస గొప్పదని సత్యాన్ని వదలివేయాలా? అని కవిగారి హృదయం ఆవేగపరాభూతమైంది. ధర్మవిషయంలో సంశయం కలిగితే పెద్దలను సంప్రదించాలని శాస్త్రం చెబుతూంది.

"అథయది తే ధర్మవిచికిత్సా వా స్యాత్, యే తత్ర బ్రాహ్మణాస్సమ దర్శినః .... యథా తే తేషు వర్తేరన్ తథా తేషు వర్తేథాః" కాబట్టి జ్ఞానవృద్ధులను సంప్రదింపదలచిన కవిగారు గాంధీగారికి జాబు వ్రాసినారు. గాంధీగారు 'Act according to your conscience' అనినారు. మీ సదసద్వివేకజ్ఞానము నాశ్రయించి ప్రవర్తింపుడని భావము. విశ్వనాథ సత్యనారాయణగారికి కవిగారు తమ ధర్మవిచికిత్సను తెలియజేయగా వారు "పెద్దదానికోసం చిన్నదానిని చంపవచ్చ"నిరి. శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారిని సందర్శింప, వారు "మీ యభిప్రాయానుసారము చేయుడ"ని వాకొనిరి. రత్నకవిగారు సర్వధర్మనిధియవందగు శ్రీమన్మహాభారతమును పఠింప నందీ పద్యము గోచరించినది—

సత్యంబు నహింసయునను, నత్యుత్తమ ధర్మయుగళమందు నహింసన్ సత్యముగాచుట ధర్మమసత్యమున నహింసగావ జనునండ్రు బుధుల్"

అదే భారతమున కౌశికుని గాథ యిట్లున్నది. కౌశికుడను నాతడు ధర్మసూక్ష్మముల నరయంగాలేక ధర్మవ్యాధుడను నొక్క మాంసవిక్రేతను సమీపింప, యాతడు ధర్మము, యందలి గణనీయ విషయములను బోధింపదొడగెను. కౌశికుండాతని మేధా సంపత్తికి నత్యంత ముగ్ధుండాయెను.

సత్యాహింసలు రెండునూ మూలధర్మమును గాపాడుటయే ధర్మసూక్ష్మమని గుర్తించిరి. పిమ్మట కొలుపులు వచ్చినవి, జను

లందరు జేర మేకను వదలివేయుడనిరి. వారట్లే చేసి యథేచ్ఛ్ఛంజనిరి. ఈ వ్యాసమున కవికి స్వానుభవమునగల ధర్మదీక్ష సత్యాహింసల స్వరూపప్రతిపాదనము స్ఫుటీకరింపబడినవి.

## సంస్కృతంలో బేసిక్ విధానము

స్వల్పమైన పదములతో సర్వాలు భాషను వ్యవహరింపగల పద్ధతిని బేసిక్ విధానమందురు. ఒకే అర్థమున స్వల్పభేదముచేననేక పదములున్నపుడు ఆయాపదముల స్థానమున సుగమ పదమునొక్క దానినే ప్రయోగించుటచే వ్యవహృతి సులభతమమగును. ఆంగ్లభాషయందు గల Observe Gaze, Examine, Descern, Detect, Perceive, View, Look అను పదములనుతొలగించి ఆపదములిచ్చు సర్వార్థములయందు See అను దానిని వాడవచ్చు. ఈవిధముగా కొందరు విపశ్చిద్వరేణ్యులు ఆంగ్లభాషను పరిశీలించి వ్యవహారోపయోగులైన 850 శబ్దములనేరిరి. వీటినుపయోగించుకొనుచు వ్యవహారముల నిర్వర్తించుకొనవచ్చును

తెనుగునందు ఉపరి వినిర్దిష్టార్థము లయందు చూచు ధాతుప్రయోగముచే వ్యవహారము సిద్ధించును సంస్కృభాషయందింకను సౌలభ్యమున్నది. నిరీక్షించు, ప్రతీక్షించుయను ధాతువులవలె మూల ధాతువులకుపసర్గలను జేర్చి వాడనగును. సులభతరమగుని బేసిక్ విధానమును ప్రాచీనులు భాషయందేనాడో ప్రవేశబెట్టిరి. ఆంగ్లభాషయందున go up, goin, get up, get out మున్నగు సందర్భముల యందుసులభవిధానమే గోచరింపనగును. భవనం, హర్మ్యం, సౌధం అనుపదములకుబదులు గృహం అనుపదమునే వాడవచ్చును.

బేసిక్ విధానము ప్రాముఖ్యమువహించును. ఆంగ్లమునందు er, ing, ed వ్వాడి క్రియలను తగ్గింపవచ్చును. సంస్కృతమునందు కార, అన్, క్త ప్రత్యయములతో వ్యవహారము గడచిపోవుచున్నది. బేసిక్

విధానమున నత్యంత ప్రాముఖ్యమును వహించు ఉపసర్గ విధానము క్రియారహిత విధానము సంస్కృతము నందనాదిసమాగతమగుటచే సంస్కృతమును సులభముగ వ్యవహరింపగలమని నిరూపితమగు చున్నది.

మఱియు గైర్వాణియందు జ, ద, ధి వాహ ప్రత్యయములు బహూపయోగదాయులని చెప్పనగును. సర్వపదముల యంతమున నీ ప్రత్యయముల జేర్చి ప్రయోగించుటచే యనేక పదములు నిష్పన్నము లగుచున్నవి. పయోద, జలద, నీరద, సరోజ, జలజ, వారిజ, నీరజ, అంబువాహ, జలవాహ, మొదలగు శబ్దములందుకు లక్ష్యములు. ఈ భాషయందు ధాతు ప్రత్యయోపసర్గల ప్రయోజనాలు వర్ణనాతీతములు.

కొందరు భాషను సులభం చేయడానికి ద్వివచనాలు విసర్జించా లనడం కలదు. ఇది యెంతమాత్రం సమంజసంగాదు. ద్వివచన ప్రయోగాలను వదలితే ఆ యా ప్రయోగాలతో కూడిన గ్రంథాలు సులభగ్రాహ్యలు కాకుండాపోతాయి. సమానార్థకపదాల నుండి వ్యావహారిక భాషలో ఒక పదాన్ని వాడేసమయంలో ఆ పదాలలో ఆంగ్ల హిందీభాషలలో నేవి ప్రాచుర్యమును వహించినదో గుర్తించి ఆ పదాన్నే వాడాలి. ఒకే అర్థంలో వాడబడే భాషాపదాలకు సారూప్యం కొన్నిచోట్ల గోచరిస్తుంది. హాథీ, హా స్తీపదాలకు, భ్రాతృ బ్రదర్ పదాలకు సారూప్యం ఉన్నది. ఇలా నిదర్శనాలను ప్రదర్శించ డం వలన సంస్కృతభాషపై ప్రజలకభిమానము వివృద్ధమగును.

సంస్కృతాన్ని సులభతరం చేయడానికి రచింపబడిన గ్రంథాలలో కాశీ హిందూవిశ్వవిద్యాలయంవారి గ్రంథాలు, మాక్మిలన్ కంపెనీ వారు ప్రచురించినవి, భండార్కర్ వ్రాసినది, కాశీకృష్ణాచార్యులవారి గ్రంథాలు ముఖ్యమైనవని చెప్పవచ్చు. ఈ పద్ధతిలో సమర్థులచే క్రొత్తవి వ్రాయించాలి

ఈవ్యాసంద్వారా, బేసిక్ రీడర్‌లో సుమారు 1000 పదాలుండి వ్యవహారం గడవాలని రచయితలను ప్రోత్సహిస్తున్నారు. కొన్నిపరీక్షలలో ప్రశ్నపత్రం సంస్కృతంలో ఉండడం సమాధానాలు ఇంగ్లీషులో వ్రాయడం జరుగుతూంది. ఇదిఅనుచితం. విద్యార్థులు గైడ్ చదువుతున్నారు. ఇందువలన సంస్కృతంలో తగినంత పరిజ్ఞానం రావడంలేదు. రచయితలు తయారు జేసిన 1000 పదాలురికార్డులలో రప్పించాలని కవిగారుప్రభుత్వానికి తెలియ జేస్తున్నారు. విద్యార్థులు సంస్కృత చర్చలలో పాల్గొనేటట్లు చేయాలి.

ఆంగ్లభాషను సులభ జ్ఞేయం చేయడానికి I.A.Richard అనే వ్యక్తి "English in pictures" అనేపుస్తకాన్ని తయారుచేసాడు. ఆపద్ధతిలో సంస్కృతంలో గూడ గ్రంథం రావాలి. పై ఆంగ్ల గ్రంథంలో పదాల వారాకులకల ఉచ్చారణాభేదం గూడ నిర్దేశింపబడినది. స్ఫుటోచ్చారణ యేగాని, వివిధోచ్చారణారీతులు లేకపోవడంవలన సంస్కృతంలో ఉచ్చారణనిర్దేశింపవలసిన అవసరంలేదు.

గైర్వాణి ప్రాచీనకాలంలో వ్యావహారికభాష యనుటకు చారిత్రకాధారములు గలవు. చంపానగరంలో సంస్కృతం రాజభాషగ నుండినది. కాంభోజనగరమున సంస్కృతం బహుళప్రచారంలోనుండినట్లు పరిశోధకులు నిర్ణయించిరి.

కళాశాలలో ఇంటర్‌మీడియట్‌నందు గాని, బి.ఎ లోగాని M .A లోగాని ఎక్కడైనా సంస్కృతం తీసికోవడానికి ప్రభుత్వం అనుమతించాలి.

## మేఘసందేశం

మేఘ సందేశంలో ప్రారంభశ్లోకమిట్లున్నది—

"కశ్చిత్కాంతావిరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః
శాపేనాస్తంగమితమహిమా వర్షభోగ్యేణ భర్తుః
యక్షశ్చక్రే జనకతనయాస్నాన పుణ్యోదకేషు

స్నిగ్ధచ్ఛాయా తరుషు వసతిం రామగిర్యాశ్రమేషు"

ఈ శ్లోకమున నిగూఢ వేదాంతాభిప్రాయముండుటచే ఛాందోగ్యమందలి, "ఇమాః సర్వాః ప్రజాః సతిసంపద్యనవిదుః సతి సంపద్యామహఇతి" అను వాక్యము స్ఫురించును. మేఘసందేశంలో, సత్పదార్థం నుండి ప్రభవించిన జీవి మరల సత్పదార్థాన్ని చేరడమనే వేదాంతార్థం నిగూహితమైంది.

శ్రీ అంబటిపూడి వెంకటరత్నకవిగారు Mukharji Anand వ్రాసిన Lost chid ను చదివి దానిననువదించి దానికి "నేతినేతి" యను పేరు పెట్టారు. Apology అనే గ్రంథం చదివాక గ్రంథనామకరణంలో ఔచిత్యముందని గుర్తించారు.

ఒకానొక బాలుడు తనమాతృమూర్తితో కలసి నడచుచుండును. అటకి తత్తియాడింభకుడు వస్తువులు కొవమని మారాము సేయును. ఇట్లు వివిధవస్తువులను మార్చి మార్చి ప్రతిదానినీ కొనమని జననినియభ్యర్థించును. కొంతదూరము పయనించిన పిమ్మట యాబాలుడు జనసమ్మర్థమున మాతృమూర్తి నుండి వేరయి ప్రదేశాంతరమునకు చేరును. అచటి పెద్దలాబాలుని లాలించి యాతని రోదనమును తొలగింప సమకట్టి వస్తువిత్తురు. ఆబాలుడు దానిని గ్రహింపనభిలషింపక తల్లియే కావలయునని రోదించును. వారనేకవస్తువులనాతని ముందుంచి లాలించిరి. ఆ వస్తువులన్నియు నాపోతడభిలషించినవే. ఐనను పూర్వమాకాంక్షించిన వస్తువులాతని సమీప ముననుండి దృగ్గోచలము లగుచున్నను నాబాలుడు జననియే గావలయునని రోదించుచుండెను. కించిత్సమయమతీతముకాగా శిశ్వపేణాయత్త చేతస్కయైన వాని జనని వానిని గొంపోవ నాతడానందమందును, Lost child అను గ్రంథమందలి కథ యిట్లుసాగినది. జీవిపరమాత్మను చేరుటయిందలి నిగూఢార్థము. మేఘసందేశమునను యిట్టి గూఢార్థము గలదు.

మేఘసందేశమనగా మేఘదత్తః సందేశః అని సమస్తపదమును విగ్రహింపనగును. మేఘముచే నివ్వబడిన సందేశమని కవిగారు సూచించినయర్థము.

మేఘముఖమున బోధసేయుట క్రొత్తగాదు. ప్రజాపతిని దేవ మానవదానవులు సమీపించి మాకేమిబోధింతువని ప్రశ్నింపనట్టితఱినింగి యందున్న పయోధరము దదదయని గర్జించినది. రాక్షసుల జూచి ప్రజాపతి మేఘగర్జనరూపమగు దయను దానికి దయధ్వమ్ అని అర్థమనెను, సర్వజీవుల యందు దయధ్వం దయాగుణమును ప్రదర్శించుడని భావము. పిమ్మట మానవులను సంబోధించుచు దత్తయనెను. దత్తయనగా దానముసేయుడని అర్థము. దేవతలయందు బద్ధచతుష్కుడై దమ్యతయనెను. దేవతలారా మీరింద్రియనిగ్రహమ్మునుగలిగి సంచరింపుడని యర్థము. ఇట్లు మేఘగర్జన యందు గోచరించు దదదయను స్వరమునిట్లన్వయించి ప్రజాపతి బోధించెను. ఉపనిషత్తులయందున్న యీగాథనే కావ్యవస్తువుగ గ్రహించి, ఇలియట్ అను ఆంగ్లమహాకవి "What the thunder said" అను కావ్యము నురచించెను. రత్నకవిగారు మూడుగుణముల దేవదానవ మానవులు ముప్పురు. అనుసరింపవలయునని అంతరర్థమును వివరించిరి. కాళిదాసుడును, మేఘముఖమున బోధ సేయుటయుక్తమేననుటకుపై గాథ ప్రమాణముగ ప్రదర్శింపబడినది

వేదోక్తమగు కర్మకాండనాచరించిన నైష్ఠికులు శరీర త్యాగానంతరము ధూమమార్గమునుచేరి యటనుండి క్రమముగారాత్రిని కృష్ణపథమును దక్షిణాయనమును పితృలోకమును. ఆకాశమును చేరి చంద్రత్వము నొందుదురు. వారు తిరిగి జన్మమును బొందు నపుడు చంద్రునినుండి యాకాశమును, వాయులోకమును ధూమమార్గమును, మేఘమును చేరి యటనుండి వర్షరూపమున వచ్చి ఓషధులు, అన్నము, రేతస్సు, యోషిద్రూపాగ్నిని, గర్భమును బొంది నవమాసములు గడపి జన్మను బొందుదురు. జ్ఞానమార్గమున నుండిన సత్పురుషులు అర్చి

స్సును జేరి క్రమముగా అహస్సు, శుక్లపక్షము, ఉత్తరాయణము, సంవత్సర, ఆదిత్య, చంద్ర విద్యుత్తుల జేరి యటనుండి పరబ్రహ్మమును బొంది ముక్తులగుదురు. ఈవ్యాసమున రత్నకవిగారిచే నిశ్రుతిస్మృత్యర్థములు సహృదయహృదయానందకరముగ నిరూపితములు.

## సౌందర్యం

సౌందర్యమును బాహ్యసౌందర్యమని, యాంతరంగిక సౌందర్యమని రెండువిధములుగ విభజింపవచ్చును. కాళిదాసమహాకవి అభిజ్ఞాన శాకుంతలనాటకమున బాహ్యసౌందర్యమునిట్లు వర్ణించినాడు-

"సరసిజమనువిద్ధం శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశోర్లక్ష్మ లక్ష్మీం తనోతి
ఇయమధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివ హి మధురాణాం మండనం నాకృతీనామ్"

పద్మము నాచుతో కూడినను రమ్యమైనదే. చంద్రునియందలిమచ్చ యాతని సౌందర్యమునినుమడింప జేయుచున్నది. ఈ శకుంతల నార బట్టలను ధరించియూ డెందమునానందమును గూర్చుచున్నది. మధురమైన యాకృతులకేది సౌందర్యము నాపాదింపదు?

"అనాఘ్రాతం పుష్పం కిసలయమలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధునవమనాస్వాదితరసమ్
అఖండం పుణ్యానాం ఫలమివ చ తద్రూపమనఘమ్
నజానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః"

శకుంతల అనాఘ్రాత కుసుమమువలె, నఖాలూనపల్లవమువలె, అనావిద్ధమైన రత్నమువలె అనాస్వాదితమగు మకరందమువలెనున్నది. ఆమె రూపము లభించిన సుకృతపరిపాకమువలె నున్నది. బ్రహ్మ ఎవ్వనినీమెకు పతిగ కూర్చునో గదా.

శ్రీ వెంకటరత్నకవిగారు ఒకానొక సందర్భమున బాహ్యసౌం

దర్య సంపన్నయైనను వికృతకంఠస్వరముగల రమణిని జూచి యేవగించిరి. రూపసౌందర్యముకన్నను శబ్దసౌందర్యమేమిన్న. పంచగుణసమేతయగు పృథ్వికంటె శబ్దగుణకమగు గగనము మిన్నయగుటయే ఇందులకు హేతువు. రూపశబ్దసౌందర్యముల కేకత్ర సమావేశమత్యంత హృదయామోదకరము సమభిలషణీయము. కావుననే కాళిదాసు రెంటికీ సమావేశమును,

> "రమ్యాణి వీక్ష్య మధురాంశ్చనిశమ్య శబ్దాన్
> పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జన్తుః
> తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం
> భావస్థిరాణి జననాంతర సౌహృదాని"

రమ్యవస్త్వాలోకనము. మధురశబ్దనిశమనము చేసినవ్యక్తి అవ్యక్తభావస్మృతి వశంవదుడై అబోధపూర్వమును స్మరించును. జన్మాంతర భావములు స్థిరముగనుండును.

ఊర్వశీనరకుల సంభాషణమునొకకవి మధురముగ చిత్రించెను. నరకుని జూచి యూర్వశి "చతురవచో విలాసగుణసాగర..............." యనినది. అందులకు నరకుడు "పగవాడటదేవేంద్రుడు మగువానీవతని కొలువు మానినివటవిన్..............." అని యామెతో సంభాషించినాడు. ఇక్కడ హాస్యము మాత్రమే కలుగుచున్నదిగాని రూపాకర్షణ యెంతమాత్రమును లేదు.

కాళిదాసు శకుంతలను వర్ణించుచు,

> "వసనే పరిధూసరే వసానా నియమక్షామముఖీ ధృతైకవేణీ
> అపి నిష్కరుణస్య శుద్ధశీలామమదీర్ఘం విరహవ్రతంబిభర్తి"

అనినశ్లోకమునకు శుద్ధశీలాయను పదమువలననంత సౌందర్యమాపాదింపబడుచున్నది. రూపముకంటెను, శబ్దముకంటెను శీలము గొప్పది.

అట్టి శీలము శకుంతలయందున్నదనినాడు.

శీలసంపద పరిపూర్ణముగ సీతయందున్నట్లు రాముడుయిట్లనెను.

"ఇయంగేహే లక్ష్మీరియమమృతవర్తిర్నయనయోః
అసావస్యాఃస్పర్శో వపుషి బహుళశ్చందనరసః
అయంబాహుః కంఠే శిశిరమసృణోమౌక్తికసరః
కిమస్యాః నప్రేయో యది పరమసహ్యాస్తు విరహః"

గృహమందీమెలక్ష్మి. కన్నులకమృతవర్తి. ఈమె స్పర్శ చందన సదృశము. ఈమె బాహువు ముత్యాలదండ. ఈమె విరహము మాత్రము భరింపరానిది.

వాల్మీకిరామాయణమున సీతను రాముడు పరిగ్రహింపజాలకుండిన సమయమున సీత యిట్లనును.

"కింమామసదృశం వాక్యమీదృశం శ్రోత్రదారుణమ్
రూక్షం శ్రావయసే వీర ప్రాకృతః ప్రాకృతామివ
కామకారో నమే తత్ర దైవం తత్రాపరాధ్యతి
పరాధీనేషు గాత్రేషు కిం కరిష్యామ్యనీశ్వరా"

పామరునివోలె అనుచితము శ్రవణానర్హ వాక్యమునేల పలికెదవు? దైవమే యిందులకు హేతువు. పరాధీనురాలైన నేను అశక్తురాలనై యేమి చేతును?

దుష్యంతుడు శకుంతలనుపేక్షించును | డెస్‌డెమోనాన్ బధెల్లోను తిరస్కరించును. అత్యధికశోకానుభవం వలన కలిగిన యీర్ష్యాదులే యిందుకు హేతువులు. "వినిశ్చేతుం శక్యోన సుఖమితివా దుఃఖమితివా"యన్నది నాయకుని పారవశ్యమును దెలుపుచున్నది.

పాశ్చాత్యనాటకములయందొకసారి యిట్లు నాయికను ప్రశంసించును

"Oh woman.
Lovely women,
Nature made thee

To temper man. „

ఇంకొక తూత్రియిట్లధిక్షేపించును.

"woman.
I hate thee
Shy thee go
I feel they hands my hands in fold"

ఈ వ్యాసముఖంగా రత్నకవిగారు సౌందర్యం చూచేవాడి భావనలో ఉంటుంది అనిరి.

## గీతగోవిందం - శ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రి

వంగదేశాన్ని క్రీ.శ 1169నుండి1200వరకు పాలించిన లక్ష్మణసేనుని యాస్థాన కవులలో జయదేవమహాకవి యొకడు. అందుకే వంగదేశంలో ప్రతి మాఘమాసంలోను జయదేవమహాకవి యుత్సవం జరుగుతుంది. అజయా నదీతీరమందలి కీరభూకుజిల్లాయందు యీమహాకవి జన్మించెను. పద్మావతి శ్రీజయదేవమహాకవిభార్యయని శుభోదయా అనే గ్రంథం చెబుతూంది. లూఢమిశ్రుడను నతడు పరిషన్మధ్యమున మధుర కంఠస్వరముతో గీతమునాలపించి వృక్షమునుండి యాకులను రాల్చాడు, పద్మావతి గాంధర్వరాగ మాలపించి నదులను పరవళ్లు త్రొక్కించినది. జయదేవుడు వసంతరాగాలాపన చేసి చెట్లను చిగిరింపజేసెను. అట్టి మహాకవి జయదేవునిచే రచింపబడిన గీతగోవిందమందలి యీక్రింది శ్లోకమును గాంచుడు—

"మేఘైర్మేదురమంబరం వనభువశ్శ్యామా స్తమాలద్రుమైః
నక్తం భీరురయం త్వమేవ తదిమే రాధే గృహం ప్రాపయ
ఇత్యాకర్ణ్య నిదేశతశ్చలితయోః ప్రత్యధ్వకుంజ ద్రుమమ్
రాధామాధవయోర్జయన్తి యమునాకూలే రహః కేలయః"

పై గీతగోవిందశ్లోకానికి ఎడ్విన్ ఆర్నాల్డ్ చేసిన యాంగ్లానువాదముంగాంచుడు—

"The sky is clouded and the wood,
Resembles the sky thicken cheld
With black tancla boughs
Oh; radha radha take this soul
To they golden house"

ఈఆంగ్లానువాదంలో The wood, sky, golden అనేవి మూలంలోలేని భావాలని చెప్పవచ్చు. మూల సౌందర్య మాంగ్లానువాదంలో గోచరించుటలేదు. పైశ్లోకానికే శ్రీచల్లాపిచ్చయ్యశాస్త్రిగారి యాంధ్రానువాదాన్నియాకర్ణింపుడు-

"క్రమ్మెన్ మబ్బులు మింటమెండుగ వనుల్
కానుంగులన్ గాఢ్కనున్
దిమ్మంజీకటులే భయస్థుడితడిల్ చేర్పుండగున్ నీవవే
గమ్మా రాధయటంచునందుడనుపన్ గాళింది సంజమ్ములన్
నెమ్మింగేళి జరించు రాధ హరియున్
నిండించుతన్ ప్రేమమున్"

ఈ యనువాదము మూలమందలి సౌందర్యమునంతను తనలో ప్రతిబింబింపజేయుచున్నది.

శ్రీచల్లా పిచ్చయ్య శాస్త్రిగారు మూలమునకు చేసిన మృదుమధురపద గుంఫనానువాదము శ్రోతల కమందానందము నొనగూర్చునటకు వారియనువాదమునుండి యీక్రింది పంక్తులను చూడుడు-

"ఈకరాలినను నాకుకదలినను" మధుధారవలెనున్న జానుతెనుగునపదసమావేశమును తిలకించుడు-

"పొంకపు మంకెనపూవు జగానిగ బింకమడంచు కెమోవి"

అభినవ జయదేవ శ్రీపిచ్చయ్యశాస్త్రిగారి రచన గాంచిన ఆంధ్రాధ్యాత్మ రామాయణకీర్తనలు స్మృతి పథమునమెఱయును. వీరి

ని శ్రీహరినాగభూషణం వంటి పెద్దలు వేనోళ్ళకొనియాడియుండిరి.

ఈవ్యాసమున శ్రీరత్నకవిగారు పిచ్చయ్యశాస్త్రిగారి బహుముఖప్రజ్ఞను, అనువాదవిధానమందలి రామణీయకతను, వారికిగలయభినవ జయదేవబిరుదసార్థకతను పఠితలకు వీనులవిందగునట్లు తెలిపిరి.

కవిరత్నమైన వీరు అజ్ఞాతమహనీయరత్నములనేరిరి.

---

# సమాజంలో భార్యాత్వం

ఈ వ్యాసారంభమున "As ever green as the fair" అనే చైనాదేశమందలి సంఘటనకు చెందిన లాన్ చంగూల దాంపత్యగాథ వివరింపబడినది. ఇందు స్త్రీ భర్తయనురాగముకొరకే పరితపించును. భారతీయవాఙ్మయమున ఆరణ్యపర్వాంతర్గతనలోపాఖ్యానమున దమయంతి ద్వితీయస్వయంవరము ప్రకటింపబడగా నలుడామెను శంకింపయాతని వెదకుటకే స్వయంవరముద్దేశింపబడినదని, మనోవాక్కాయకర్మలచే శుద్ధురాలనని యామె ప్రకటించును. ఈ రెండు గాథలును సుఖాంతములే. కథాద్వయము పరస్పరము సామ్యముగలవి. "భాగ్యరేఖ" యను చలనచిత్రమందలిగాథకు, పై వృత్తాంతములతో తుల్యత గలదు.

విషాదాంతగాథలునుగలవు. చిత్రాంగీసారంగధరులగాథ, తిష్యరక్షకుణాలులగాథలు విషాదపర్యవసానములు, పెద్దలు నిర్ణయించి చేసినవివాహములయందు వైఫల్యమునొందినవియు గాన్పించుచున్నవి.

భార్యనువదలి ద్వితీయ వివాహమును గావించుకొని, సంఘమునన్నేమియుచేయలేదనెడి ధైర్యముతో సంచరించు యువకుడు గలడు. అతని పత్ని దైన్యావస్థనొందుచున్నదని అంబటిపూడివారు తమకు తెలి

సిన వాస్తవిక గాథనీవ్యాసమున నుట్టంకించిరి.

సంఘమందలి యిట్టి యవ్యవస్థలకు కారణమేమని కవిగారు ప్రశ్నించి మూలహేతువులను వెలికితీసిరి. "స్త్రీలకు స్వాతంత్ర్యాం కావాలి" యనెడి పాశ్చాత్యుల అర్థరహితమైన రచనల జదివి తద్భావ వ్యామోహితులైన కొందరు వనితలు పెండ్లికనువగుకాలమున వివాహ ముఁజేసికొనక ముప్పదిసంవత్సరముల వయసును పొందియు, చేతిలో పుస్తకముల విలాసముగ ధరించి సంచరించుట యిట్టి దురవస్థకు నొక హేతువనిరి. ఇట్టి స్త్రీలు వివాహానంతరము యుద్యోగములఁజేయుచు కాలము గడిపెదరు. భార్యయనుపదమునకు భరింపబడున దియను నర్థము గలదు. స్వతంత్ర జీవనము గలిగి, భరింపబడని యిట్టి స్త్రీలు భార్యలెట్లగుదురు. వీరును భర్తలగుటచే భర్తల జంటలనవలయునని కవిగారు చమత్కారముగ నిరూపించిరి. రావణదుశ్శాసనాదుల సమర్థించెడి గ్రంథములు వెలువడుట పతితల దురదృష్టమనిరి. డెలైలా, క్లియోపేట్రావంటి స్త్రీలు, రావణాదులవంటి పురుషులు పెరుగుట విచారార్హమనిరి. మహాకవి భర్తృహరి స్త్రీలోలుడగుట, స్త్రీచే పరాభవింపబడుట, తన్మూలమున విరక్తుడగుట యిందుదహరింప బడినవి. సత్యమును ప్రియముగ మాట్లాడుమనెడి "సచ్ బోలో మీఠాబోలో" యను సూక్తి యుదహరింపబడినది.

---

## రుబాయత్ - రబ్బీ

ఉమర్ ఖయ్యాం అనుకవి ఏకాదశశతాబ్దోత్తరార్థమున పర్షియా దేశమున జన్మించెను. ఈతడు వైద్యజ్యోతిషగణితవేదాంతములనభ్య సించి వంశపరంపరాగతమగు డేరాలుకట్టు పని నేర్చి, ఐదువందల రుబాయత్ లను రచించెను. పందొమ్మిదవ శతాబ్దమువరకు యీ రుబా యత్ లకు నవీనప్రపంచమునెట్టి ఖ్యాతియు లభింపలేదు. గాని యీ

శతాబ్దమున జననమందిన ఫిడ్‌రాజెల్డ్ యను నాంగ్లకవి డెబ్బది యైదు పద్యములతో వాని నాంగ్లమున ననువదింప నూత్నలోకమందలి కవితా రిరంసువులు ఆనందాశ్చర్యముల బొందిరి. ఈతడు శాస్త్రములయందు, పరలోక విషయములందు, వైమనస్యమునొంది ప్రాప్తించిన సుఖములే మిన్నయను భావముతో కవితలల్లెను.

అబ్రహామ్ బెన్‌మీర్ ఇబెన్‌ఎజ్‌రా యను యూదుజాతి యువకుడు రబ్బీయను నామధేయముతో ప్రసిద్ధుడాయెను. ఇతడు స్పెయిన్ దేశమున జన్మించెను. బహుదేశాటనము జేసి హీబ్రూ,అరబ్బీ భాషా గ్రంథములననువదించెను. వేదాంత జ్యోతిష గణిత శాస్త్రముల నధ్యయనము చేసెను. సరసకవిత జెప్పగలదిట్ట. ఈతడు ప్రాపంచిక భోగములే మిన్న, రేపు లేదనెడి ఉమర్‌ఖయ్యాంతత్త్వమును నిందించి పరలోకమున్నదని యాధ్యాత్మిక సుఖము నొందుటమావవుని కర్తవ్యమని భోధించుచు కవితలల్లెను. ఈరబ్బీ వ్రాసిన కవితలనాంగ్లమున రాబర్ట్ బౌనింగ్ యనునతడు 1812–89 సంవత్సరాలమధ్య ననువదించెను. జీవి మరణించిన పిమ్మట యేమియు నుండదు. గాన జీవించినంతలో మధ్యమును మహిళను సేవించి సుఖించుమని ఉమర్‌ఖయ్యాం ఇట్లనుచున్నాడు.—

"కావున మట్టిలో గలియికన్ వసియించు దినాల నెచ్చెలీ
జీవిత సౌఖ్యముల్ మనకు జిక్కిన మట్టుకు జుఱ్ఱిపోదమే
ఆవలమట్టి మట్టిగలియన్ మధువుండదు గానముండదీ
నీ వను పాటకత్తె ధరణిన్ గనుపింప దనంతమంతయున్

నన్నాశ్లేషించుకొని మధురగీతమాలపించిన నాకదెస్వర్గమనుచున్నాడు—
"నన్‌గవుంగలించుచు నీవొకపాటపాడుచో నాకము వేరెలేదడలి నాకిదెనాకము చాలునెచ్చెలీ:"

"పసచెడ వాదభేదముల పండితులన్ పడి చావనిమ్ము ఈ
ముసలి ఖయాముకింత సుఖమున్ సమకూర్చగ రమ్ము నెచ్చెలీ
ఉసురను పిట్ట లేచు నెపుడో యిది సత్యమసత్యమన్యమే
కుసుమము నిల్చు రాలక తగుల్కొని తీవియపైని నిత్యమే"

పండితులవాదముల నలక్ష్యముచేసి స్త్రీ స్నేహామునిందు వాంఛించు చున్నాడు.

దేహసౌఖ్యముల శాశ్వతములని నిత్యము నిత్యానిత్యవస్తు వివేకమొనరింప సమర్థుడు కావలయునని రత్నకవి ఆధ్యాత్మ విద్యాపరవశుడై యిట్లనును—

"యౌవనమంతమై ముసలి యాకృతి వచ్చెడివేళ పూర్వమే
భావములావరించె మదికట్టినకృత్యములెవ్వి వాని సం
భావనమాత్మకున్ వెలుగు ప్రాప్యముసేయు పటుత్వయౌవన
వ్యావృతి దాటి యాత్మపరమాత్మల యైక్యవిభూతి క్రమ్మెడున్"

## నేనెఱిగిన కవులు - చెళ్లపిళ్ల, వేలూరి, శ్రీపాద

శ్రీఅంబటిపూడి వెంకటరత్నకవిగారు కవులగూర్చి స్వీయానుభవముల వివరించియున్నారు. కవిగారు శ్రీచెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారివద్ద విద్యాభ్యాసమునకై వారిగ్రామమునకు వెడలిరి. చెళ్ళపిళ్ళవారి గృహమున ప్రవేశించి వారివద్దవిద్యాభ్యాసము చేయసాగిరి. శాస్త్రిగారు మత్తమధురపికధ్వనిసమేతము బహుళలతాపరివేష్టితమునైన మామిడితోటయందుండిరి. అట్టితఱి వారిని రత్నకవిగారు సమీపించి నమస్కరించిరి. శాస్త్రిగారు తానులోగడ బోధించిన అన్యోన్యాశ్రయ దోషమును వివరింపు మనగా సంపూర్ణముగ దానిని వివరింప సంతోష

తరంగితాంతరంగులైరి. వీరిని సాగనంపు సమయమున కొంగ్రొత్త ధోవతిని యుత్తరీయమును పెట్టిరి.

గృహమున చిక్కని పెరుగుతో భోజనమిడిరి. రత్నకవిగారు విద్యార్థి దశయందుండియే కవితల నారంభింప చెళ్ళపిళ్ళవారు మంద లించిరి. చెళ్ళపిళ్ళవారి కవిత మధుస్రవన్తియని కవిగారి నిశ్చితాభిప్రా యము. వీరిలోని మార్దవమునకు అంటిపూడివారెంతయో ముగ్ధులైరి.

## శ్రీ వేలూరి

వేలూరి శివరామశాస్త్రిగారి వద్ద విద్యాభ్యాసమొనరించు కాం క్షతో వెంకటరత్నంగారు చిరివాడ గ్రామమున కరుదెంచిరి. ఆరోజు వర్షప్రభావమున కవిగారు జారిపడుట తన్మూలాధనొందుట జరిగింది. శివ రామశాస్త్రిగారి యింటిముందు కొందరు యువకులాంగ్ల భాషయందు సంభాషణ మొనర్పసాగిరి. వారిని ప్రశ్నించి శివరామశాస్త్రిగారి గృహ మును గుర్తించి లోనికి ప్రవేశించిరి. అందరితోబాటు వీరును భోజన మొనర్చిరి. మధ్యాహ్న సమయమున పాఠము చదువుటకు రమ్మని పిల చిరి. ఆ సమయమున వారు బనియన్ ధరించి చాపపై కూర్చుండిరి. కౌముదిపాఠమును బోధించి శిష్యుని బాధనుగాంచి నీకవసరమైన నిచట కాఫీని త్రాగవచ్చు. ఎట్టినిషేధమును లేదనిరి.

శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారివద్ద ఉపనిషత్తులు, అరవిందు నియాంగ్లగ్రంథమును, ఆంధ్రభారతమును, మధ్యాహ్నం కౌముదిని, సాయంసమయమున నాటకమును పఠించెడివారు. ప్రతిదినము శాస్త్రి గారు బోధించినకౌముది పాఠమును మనముననిడుకొని టీకనువ్రాయు చుండెడివారు. ఆసమయములో శివరామశాస్త్రిగారు ఇంటివద్దనే శతా వధానమును చేయుచు తమ ధారణాబలమును పరీక్షించుకొను చుండెడివారు.

రాత్రిరఘువంశమందలి యొక సర్గనుచూసి, ప్రభాతసమయమున అనర్గళముగనాసర్గను చెప్పి విద్యార్థులకాశ్చర్యమును కలిగించెడివారు. ప్రాతఃకాలమున చిత్రాసనముపైనుండి ప్రాణాయామ మాచరించెడి వారు. వీరు శ్రీ జయంతి భగీరథ శాస్త్రిగారి శిష్యులు. చెళ్లపిళ్లవారివి గూడ కొంత కాలము సేవించియుండిరి. పిమ్మట శాస్త్రిగారితో కలిసి శ్రీ వేలూరి వారు శతావధానముల నిర్వర్తించుచుండిరి.

## శ్రీ శ్రీపాద

వీరు శ్రీ చెళ్ళపిళ్ళవెంకటశాస్త్రిగారి గురువులు. ముగ్గురుకవులు, చేపట్టి రచించిన శ్రీమదాంధ్రమహాభారతమును వీరొక్కసారియే రచించిరి "నిర్మాణేయ ది మార్మికోసి...." అను శ్లోకమున ఖ్యాతుడైన జగన్నాథపండితరాయులు వ్యక్తీకరించిన దర్పం వీరిలో గలదు. ఆలంపురంలోని యొకసభలో శ్రీపాదవారు పాల్గొనిన సమయమున శ్రీ రాధాకృష్ణపండితులధ్యక్షులై యుండి భగవద్గీత యందలి పంక్తులకు చక్కని వ్యాఖ్యానమొసగిరి. శ్రీపాదవారు యాంధ్ర భగవద్గీతను రాధాకృష్ణునకంకిత మిచ్చిరి. వీరు ఆంధ్రదేశాస్థానపండితులు.

## విశ్వనాథ

వీరు గుంటూరు ఏ.సి కాలేజీలో లెక్చరర్ గా నున్నసమయంలో రత్నకవిగారు శిష్యులుగనుండెడివారు. రత్నకవిగారు వ్రాసిన "ప్రణయవాహిని" కావ్యం పై విశ్వనాథవారు తమ అభిప్రాయమునొసంగిరి. కంభమెట్టులో సురవరం ప్రతాపరెడ్డిగారధ్యక్షులుగ విశ్వనాథ సత్యనారాయణగారు, అంబటిపూడి వెంకటరత్నంగారు,

యుద్ధకాల వాఙ్మయమనెడి యంశముపై ఉపన్యసించియుండిరి. అంబటిపూడివారు తమ "మైనాదేవి" కావ్యమునుండి పద్యములను చదివిరి.

మరల రిపబ్లిక్ డే రోజు రేడియోలో కవిసమ్మేళన కార్యక్రమములో విశ్వనాధవారు, అంబటిపూడి వారు పాల్గొనిరి. రాఘవదంపతుల యార్థిక సహాయమున విశ్వనాధవారు "వేనరాజు" గ్రంథమును ముద్రించిరి. అప్పుడా దంపతుల ప్రేరేపించి, రత్నకవిగారి "చంద్రశాల" కావ్యమునకు గూడ నార్థిక సహాయము నందింపజేసిరి. విశ్వనాధవారు తమ గ్రంథములకు "రసతరంగిణి" యను నామముంచిరి. రత్నకవిగారు విశ్వనాధవారి రామాయణ కల్పవృక్షమును పఠించి సంతసించిరి. విశ్వనాధవారు ప్రయోగించిన "త్వరుగ్రభుచలద్భ్రగమోఘ ఖండికా" యనెడి సమాసమును సామాన్యులు ప్రయోగింపలేరనుట సత్యము. ప్రారంభమున "ఆత్మనిత్యమ్ము కాలాద్య నవచ్ఛిన్నము" అని ఆత్మతత్త్వ నిరూపణ మొనర్చిరి.

## గడియారం

శ్రీగడియారం రామకృష్ణశర్మగారు శ్రీవేలూరి శివరామశాస్త్రి గారి శిష్యులు. అలంపురం సభలలో వీరుపన్యసించిరి. గడియారం వారేరచన జేసినను అందులో విషయ గౌరవముండును. గడియరం వారు ఉత్తమశీల సంపన్నులు. హైద్రాబాద్ నగరమున రిపబ్లిక్ డే యుత్సవము జరిగినది. ఆ ఉత్సవమున శ్రీవేదుల సత్యనారాయణశాస్త్రిగారు, శ్రీపోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. మంచి కబ్యమును గూర్పమని అంబటిపూడిని కోరిరి శ్రీగడియారం రామకృష్ణశర్మగారు "శివభారతం" అనే మహాకావ్యమును రచించిరి. అదియనేక కవితాగుణములచే వాసికెక్కినది. రాజశేఖరకవి వ్రాసిన "రాణాప్రతాప చరితము" తోనన్ని విధముల తులతూగుచు, పెద్దలచే ప్రశంసింపబడిన గ్రంథరాజము శివభారతము. ఇదె గడియారంవారికి సర్వత్రవిస్తృతయశస్సునాపాదించినది.

## మధునాపంతుల

శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు 'ఆంధ్రపురాణం' అను కావ్యమును రచించిరి. ఆంధ్రకవులను వర్ణించు భాగ్యము గొప్పదనిరి. ఆంధ్రభాషాయోషను తమ గ్రంథమందిట్లు వర్ణించిరి.

"అలమలుగు మేలిముసుగులో నందగించు
నాంధ్రచారిత్ర సురసుందరాంగి సొగసు
మనసు పండువుగానెంచు కొనెడి సిరికి
నోచువాడె రసజ్ఞత మోచువాడు"

కవికావ్యాలలోనేది యుత్తమమో నిర్ణయించవలయునన్న సహృదయులే ప్రమాణమని Ruskin మహాశయుడిట్లనుచున్నాడు—

"Whatever bit of a wiseman's work is honestly and benevolently done, that bit in his book or his piece of art. It is mixed always with evil fragments ill, done redundent afflected work. But if you read rightly, you will easily discover the true bits and those are the book."

శాస్త్రిగారి యాంధ్రపురాణమును సహృదయ పాఠకులందరు నేకగ్రీవముగ నుత్తమ గ్రంథముని నిర్ణయించిరి. 'ఆంధ్రరచయితలు' యనునది శ్రీమధునాధపంతుల సత్యనారాయణ శాస్త్రిగారి ద్వితీయ మహోత్కృష్ట గ్రంథము.

## కవిత్వంలో పోలికలు

పూర్వకవుల రచనలయందలి సామ్యములను తదనంతర కవులకృతులయందు నిరూపించుటయందు రూపానుకరణము భావానుకరణము అని రెండు పద్ధతులు గలవు.

కాళిదాసమహాకవి నిర్మితమగు నభిజ్ఞానశాకుంతలమునందలి 'సరసిజమనువిదం శైవలేనాపిరమ్యం' అను శ్లోకపాదమందలి 'కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్' అను శ్లోకపాదమును తెనాలి రామకృష్ణకవి తన 'పాండురంగమాహాత్మ్య'మను కావ్యమున ప్రకృతిమధురంబులకు వేషరచనమేల యనుట యనుకరణమేనని చెప్పనగును.

ఇక్లే "గచ్ఛతిపురశ్శరీరం ధావతి పశ్చాదసంస్తుతం చేతః
చీనాంశుకమివ కేతోః ప్రతివాతం నీయమానస్య" అను కాళిదాసుని భావమును నందితిమ్మన "పారిజాతాపహరణకావ్యమున" "అరదము నెక్కె కేతనపటాంచల చంచలమైన తాల్మిలో" యనుపద్యపాదమున ననువదించెను.

పోతన మహాకవి "బాలాలోకనశృంఖలానిచయ సంవేలా నిస్సరణంబు గానక మహా విద్వాంసుడున్ కామినీ హేలాకృష్ణకురంగశాబకమగున్ హీనస్థితిన్ ఐంటెరే "యనుపద్యస్వరూపమును మాత్రము గ్రహించుచు, యందలి భావమును వ్యతిరేకించుచు నొకానొక కవి,

"లాలామూత్రపురీష ఘర్మజల కీలాలాత్మికల్ భావులం
చేలా రోతలు పుట్టనాడుదురు యోగీంద్రుల్ వృథాలాపముల్
లాలా మూత్రపురీష ఘర్మ జలకీలాలాత్ములో తారటీ
ప్రాలేయాంబు పటీర పంక ఘనసార క్షౌద్రదివ్యాత్ములా"

యనినుడివెను.

శ్రీ దువ్వూరిరామిరెడ్డిగారు వ్రాసిన "వనకుమారి"లో_
"ఊర్ణనాభుల తంతు సదోత్కరంబు
హిమకణావళి బొలుపొందెు" యని గలదు.

Samuel taylor coleridge వ్రాసిన The picture అను గ్రంథమున

"The dew drops at morn.

Glitter on the spiders webs యనిగలదు. ఇది ఇట్లుండ మహాకవి ధూర్జటి "లూతాకల్పిత తంతుపద్యములు వోల్చున్ చెప్పచిత్రంబుగ్రై"యని ప్రవచించినాడు. పై మూడుకావ్యభాగముల యందును ఒకే అభిప్రాయమనుస్యూతమైనది. ఇట్టి సందర్భములయందు కావ్యభావ సమానుకృతి కాలనిర్ణయము ననుసరించును. మహాకవి ధూర్జటి కాలానంతరమే పై గ్రంథములు వెలసియుండుటచే ధూర్జటి భావములనే పై వారనుకరించిరని చెప్పవచ్చును.

Off wayయను నాంగ్లకవి.

"O woman lovely woman,
nature made tree
to temper man
we had been brutis without you" యనెను.

ఈ భావం 'వనకుమారి' లో యిట్లనుకరింపబడినది-

"మనుజుండేమను యెట్లువోవునొగదా మాధుర్య ర్యాత్మనైచను కాంతామణులుండ కుండిననిలన్ సద్భావముల్ మానిదు
ర్జనుడై ఘాతుక సత్వమట్టులనహోరాత్రంబులన్ గ్రూరవ
ర్తనమే వృత్తిగ గర్కశాత్ముడయి నిందంబొందు నేమో చెలీ"

శ్రీ వేములవారి రచనలలో శ్రీ రవీంద్రనాధ్‌టాగూర్ భావములు బహుళముగ గోచరించును. వేదులవారి 'సమకాంత' యను కావ్యమందలి భావములను శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు తమ పద్యములయందు స్ఫురింపజేసిరి. ఈ భావములనే శ్రీ జాస్తి వెంకటనరసయ్యగారు 'పుష్పవాంఛ' యను కావ్యమున గోచరింపజేసిరి.

శిశుపాలవధమహాకావ్యమున 'హిరణ్యపూర్వం కశిపుం ప్రచక్షతే'యని మాఘకవి విచిత్రప్రయోగమును చేసెను. కాని నిజమారయ ఏతాదృశమాఘప్రయోగమునకు "దేవపూర్వం గిరింతే" యను

కాళిదాసుని ప్రయోగము మూలమని తెలియ కాళిదాసునిపై గౌరవ మినుమడించును.

అలంపురం సభలలో రత్నకవిగారుయుపన్యసించుచు రాయప్రోలువారి 'పూలకడుపులలో తేనెపోసె నెవడో'' యను ప్రయోగమును అబ్బూరివారి "కడలెఱుంగగ జాలని కలకుగతుల" యను దానిని విశ్వనాధవారి 'తల్లి ఔక్కలోడాగి' యను పద్యమును చదివి యందలి భావమాధుర్యమును శ్రోతలకందించిరి. మూలభావమెవరిదో విమర్శకాగ్రేసరులు పరిశోధించి గుర్తించాలి.

'కారుమొయిళ్ల కాటుక........' యనుకృష్ణశాస్త్రిగారిపద్యమును వినినంతనే 'మేఘైర్మేదురమంబరం........' అను గీతగోవిందమందలి శ్లోకము స్మృతియందు గోచరించును జాషువాగారి పద్యములు Gray పండితుడు రచించిన Elergy కియనువాదము. ఇందులోని భావమునే గ్రహియించి శ్రీశ్రీగారు "సుప్తాస్థికలు" యను కబ్బమును వెలయించిరి.

విశ్వనాధవారి శృంగార వీధిలోని జంతు క్రీడన సభ్యముగ నెంచరాదు. "బృహదారణ్యకోపనిషత్తు"లోని "సవైనైవరేమే" యను గాధను, జదివిన సహృదయులకు పై వర్ణన యనౌచిత్య యుక్తముగ గోచరింపదు.

పాశ్చాత్య మహాకవి యగు షెల్లీ 'ode to the west wind' ను రచించెను. Ode అనునది ఖండకావ్య ప్రక్రియ. ఇది గ్రీకుభాషలో ప్రసిద్ధము. అట్టి గ్రీకుభాషాప్రక్రియయే షెల్లీ రచనకుమూలమవనగును. ఈ ప్రక్రియ యందు కవిభావావేశమున ఉదాత్త భావమును వెల్లడించుట, కవితాశక్తి నంతను జూపుట జరుగును. "West wind" యను కావ్యమందు ఐదు పద్యములు గలవు. జగద్గురువులైన శ్రీ శంకరభగవత్పాదులవారు చిత్తమును సంబోధించుచు వ్రాసిన శ్లోకములత్యంత మనోజ్ఞములు. west wind యందలి భావమిట్లుండును—

**Sanskrit alone is the language of India as a whole**

శ్రీ అంబటిపూడి వెంకటరత్నంగారు సంస్కృతభాషయే భారతదేశమంతటను సర్వవ్యవహారములకు నుపయోగపడగలదని యీ ఆంగ్ల వ్యాసమున నిరూపించిరి. ఈ వ్యాసము ఆంగ్లభాషయందు కవిగారికిగల యభిజ్ఞత, సంస్కృతభాషను రాజభాష చేయుటకు వారి ప్రయత్నములను నిరూపించుచున్నది. ఈ వ్యాసప్రారంభమున దేశము మఱియు జాతీయత కలియుననిరి. గమనించుడు—

"A state plus nationality makes a nation"

జాతీయత యెక్కుడుండునో కవిగారినిర్వచనమును వారి భాషయం దేగాంచుడు.

"where the seven qualifications ......... ......one race, one territory, one religeion, same history and same traditions, similar social and polit'cal relations and same political ideal .. .... are there is nationality

నాగరికత బాగుగా నభివృద్ధిచెందిన కాలమున భారతదేశము సర్వతోముఖాభివృద్ధిని పొందినది. అట్టి సంస్కృతి నాగరికతలతో కూడిన కాలము నుండి అశోకుని కాలము వరకు సంస్కృతభాష ప్రజలలో బహుళ ప్రచారమునొంది సంభాషణ యోగ్యముగనుండెడిది ఈభావములను వారాంగ్లమున నిట్లు వెల్లడించిరి—

"India was blooming in the perfection of civilizati on. From that time up to the time of Ashok Sanskrit was spoken by the people at large,

చారిత్రక విషయములవగాహన మొనర్చుకొనుటకుసంస్కృతభాష అవసరము. సంస్కృతమందలి విద్యానాధుని ప్రతాపరుద్రీయమును పఠింపక కాకతీయులపరాక్రమమును గూర్చిగాని మాహాత్మ్యమును గూర్చి గాని ఏచారిత్రకుడును చెప్పలేడు.

"Without reading the Sanskrit Prataparudriya any His- torian can not give you the real account of Kakatiya valour and magnamity"

మొగలాయీలకుగూడ వారి విషయములు సంస్కృతపద్యముల యందు వ్రాయించుకొనుటయే అభీష్టము.

"Even the Moghul emperors made their biographics wri tten in Sanskrit verses"

షాజహాన్ చక్రవర్తి సంస్కృత విజ్ఞాని కానియెడల జగన్నాథ పండితరాయలు యాతనియాస్థానమున కనకాభిషేకముచే సన్మానింప బడియుండెడివాడుగాదు.

మొదట సంస్కృత భాషకు ప్రాముఖ్యమునిచ్చి పిమ్మట మిగిలిన భాషలను గుర్తింప వచ్చును. సంస్కృతభాషనిచ్చిన యాతడన్నియు చేయగల్గును.

"First give him Sanskrit he does the rest"

ప్రసిద్ధ జర్మను విద్వాంసుడగు మాక్స్‌ముల్లర్ ఇట్లభిప్రాయపడుచున్నాడు—

'The most wonderful Language'

శబ్దసౌందర్యము పటిష్టమైన వ్యాకరణ నియమాలు గల అద్భుతమైనభాష సంస్కృతమని భావము.

రవీంద్రనాథటాగూర్ సంస్కృత పండితుడై సంస్కృత కావ్యమాధుర్యములను గీతాంజలి యందు ప్రతిఫలింప జేయుటచే నాతనికి నోబెల్ బహుమానము లభించినది. దైర్వాణినే భారతదేశమున జాతీయ భాషగా చేయని యెడల భారతీయుల స్వపరిపాలనమునకును, ఆంగ్లేయుల పరిపాలనమునకును యెట్టి భేదముండదు.

"If sanskrit is not made the national language of India there will be no difference between the British rule and the Indian rule."

ఇట్టివ్యాసమున సంస్కృతభాషను జాతీయభాషగా నొనరింప వలసిన ఆవశ్యకత్వమును గూర్చి కవిగారు వివరించియుండిరి. ఆంగ్ల భాషయందు రచింపబడిన యీ వ్యాసమందలి వారి పంక్తులను ఉదహరించితిని. సంస్కృతవ్యాప్తికై "సురభారతి" యను సంస్కృతవ్యాస మున నేను కొన్ని సూచనలను పత్రికాముఖమున తెలిపియుంటిని. సంస్కృతభాషావ్యాప్తికి నందరు యథాశక్తి పాటుబడవలయును.

## వర్తమానకవిత

విజయనామ సంవత్సర వైశాఖమాసమున వెలువడిన సుజాత పత్రికలో "వర్తమానకవిత" యను వీరి వ్యాసము ప్రచురింపబడినది. అందు కవిత్వమునకు చెందిన కొన్ని యమూల్యాభిప్రాయములను రత్నకవిగారు నిర్దేశించియుండిరి.

ఉమర్ ఖయ్యాం అనునతడు కేవల భౌతికసిద్ధాంతములను కవిత యందు ప్రకటించిన కవిశేఖరుడు. వీనిననుసరించి ఆంగ్లమున Shelly, keats కవులు కవితలు జెప్పిరి. భారతీయకవులు భౌతికసిద్ధాంతములను ప్రచార మొనర్చినను అందు అంతర్గతముగ నాధ్యాత్మిక భావములుండును. భౌతికముద్వారా నాధ్యాత్మికతను జెప్పుట భారతీయకవుల వైశిష్ట్యము.

"యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్"

యనెడి దైవవాక్యమునందు విశ్వాసం లేని వాళ్ళను గూర్చి Hallowmen "ఎక్కుడు గదపించు మానవులకున్ సుఖదమ్ములు జ్ఞాన

మేఘములట్" అని బోధించినాడు. బృహదారణ్యకోపనిషత్తు లోని గాథచే ప్రభావితుడైన ఇలియట్ అను మహాకవి "what the thunder said" అనే కావ్యాన్ని రచించెను. సంస్కృత భాషాభిమానం ప్రాచీన భావాలపై అనురాగం అధునాతనకవియైన శ్రీ శ్రీకి కూడ గలదనుటకు యీ క్రింది సూక్తులే యుదాహరణము —

"నానుడి నీ గుడిగా
నా గీతం నైవేద్యంగా
నా విసరిన రస విస్మృమర కుసుమపరాగం
ఓహో రసధుని మణిఖని జననీ"

వైదిక సంస్కారం అజ్ఞాతంగా నవయుగ వైతాళికుడైన శ్రీశ్రీ హృదయంలో దాగియుండి భావావేశ సమయాన యిలా ప్రసరించింది —

"నా గీతం గుండెలలో ఘూర్ణిల్లగ
నా జాతి జనులు పాడుకునే
మంత్రంగా ప్రయోగించాలని"

వేదంలో, వచ్చినపదాలే మరల మరల వచ్చే పద్ధతిలో పనసలున్నాయి.

"ఇంద్రశ్రేష్ఠాని, శ్రేష్ఠాని ద్రవిణాని, ద్రవిణాని ధేహి, ధేహి చిత్తం, దక్షస్య సుభగత్వం." ఈ పనసల పద్ధతులలో దొర్లిన శ్రీశ్రీ గారి కవితాపంక్తులు వారి హృదయాంతరాళాలలో దాగిన వైదిక సంస్కృతికి ప్రతీక.

నిద్రకు వెలియై
నేనొంటరినై
నాగదిలోపల చీకటిలో
చీకటిలోపల నాగదిలో

నాగదిలో
చీకటిలో
నేనొక్కడన్నై
నిద్రకు వెలియై
కన్నులు నిండిన కావిరితో
కావిరి నిండిన కన్నులతో
కన్నులతో
కావిరితో

ఛందస్సులు శబ్దాలంకార పోకడు... శ్రీశ్రీ కవితను వదలలేదనడానికి యీ క్రింది వారి కవితయే ప్రమాణభూతంగా నిలుస్తుంది.

"పెల్లీనవకపు హాల్లీసకమున"

పరిణతి చెందుతున్నకొలది కవిత్వానికి స్పష్టత (Clarification) వస్తుంది. మహాకవి రాయప్రోలు, శ్రీశ్రీ ఛందోవ్యాకరణాలను పాటించి రాణించారు. నవ్యకవులను వాని కవితాభంగిములను గుర్తించిన శ్రీ అంబటిపూడి వెంకటరత్నకవిగారు తమ యభిప్రాయములనిట్లు తెలిపిరి.

"మలుపు లెరిగిన కలత మే మార్గముందు
పయనమయ్యును తప్పుత్రోవలకుబోను
కలిసివచ్చిన బాటల గలసికొనును
బాటలేకున్ననొక క్రొత్తబాటవేయు"

"విద్యనేర్చినవాడె విప్రుడు. వీర్యముండినవాడె క్షత్రియుడు." అనెడి మహాకవి గురజాడవారి యభిప్రాయముతో "వర్తమానకవిత" యను వ్యాసమును ముగించిరి. ఈ వ్యాసమున కవిగారు ప్రాచీనకవితావైభవమును, వైదికభావ మహిమను నవీనుల కవితలను చక్కగా పరిశీలించిరి.

శ్రీ అంబటిపూడి రత్నకవిగారు ఇరువదినాలుగు పేజీలతో "శ్రీమాత" యను పేర నొక బృహద్వ్యాసమును రచించిరి. ఈ వ్యాసము ముద్రితము. కవిగారీవ్యాసమును రచించుటకు 15 గ్రంథములను పరిశీలించియుండిరి.

బాల్యము నుండియు నాంగ్ల సంప్రదాయములనలవర్చుకొని పాశ్చాత్యాభిప్రాయములయందు బద్ధానురాగులైన శ్రీ అరవిందుల వారు కాదాచిత్క దైవప్రేరణచే భారతీయ సంప్రదాయౌన్నత్యమును గుర్తించి యోగమార్గానుయాయులై దివ్యదర్శనమందిరి. శ్రీమాత వారికంతేవాసిని. ఈమెకు The Mother అని లోకమందు వ్యవహార నామము, అరవిందుడు శ్రీమాత జిహ్వాగ్రమున నివసించును. Aravinda himself a sage. బాహ్య సౌందర్యము నశ్వరము. కాని మానసిక సౌందర్యం గొప్పది. అట్టి మానసిక సౌందర్యమును వృద్ధిపరచుటకనేక సూక్తులనరవిందులవారు ప్రవచించిరి.

శ్రీమాత బాల్యమునుండియు అరవిందుని పుణ్యపురుషునిగ భావించినది. అరవిందునియందామెకు కృష్ణమూర్తియే గోచరించునట. "In mother's childhood's vision she saw myself when she knew as Krishna."

## సాహిత్యం

1950 వ సంవత్సరం ఫిబ్రవరి "శోభ" పత్రికలో ఈ వ్యాసం ప్రచురింపబడింది. ఈవ్యాసంలో రత్నకవిగారు అమూల్య విషయములను తెలియజేసి యుండిరి. సాహితియనగా వాగ్దేవియైన భారతియే. ఆమెను గూర్చిన అర్చనయే సాహిత్యమనబడును. శ్రీ అంబటిపూడి వెంకటరత్నకవిగారి గురువులు తాము గురువులగుటకు గురువులను సేవించుటయే అని చెప్పియుండిరి. అట్లే కవిగారును వివిధగురువులకు శిష్యత్వము చేసిరి. సాహిత్యమనగా—

"సహితయోర్భావః సాహిత్యమ్" శబ్దార్థముల కలయికయే సాహిత్యము. "శబ్దార్థయోః శోభాశాలితాం ప్రతి మనోహారిణి అవస్థితిః సాహిత్యముచ్యతే"

మనోహరమైన కావ్యమందున్న శబ్దార్థములు శోభను కలిగించుటయే కావ్యరమణీయకతకు లక్ష్యము.

పతంజలి వ్రాసిన మహాభాష్యమందు శబ్దార్థములన్వయాంశము సాహిత్యమునుగూర్చి మీమాంస కలదు.

"కః శబ్దః?, యేన ఉచ్చరితేన అర్థః ప్రతీయతే. కః అర్థః? యశ్శబ్దేన ప్రత్యాయ్యతే. కిం సాహిత్యం? యశ్శబ్దార్థయోః సంబంధః".

శబ్దార్థముల సంబంధమే సాహిత్యమని పతంజలి అభిప్రాయము. "వాగర్థావివసంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే" యనెడి కాళిదాసుని శ్లోకమును పరిశీలించినయెడల వాగర్థములు రెండును సాహిత్యమని తేలును పాశ్చాత్యులు "Union of the two" అని సాహిత్యమును నిర్వచించిరి. ఆ రెంటిని "Mind and language" అనినిర్దేశించిరి. వారిలో కొందరిట్లనిరి,— "Artistic expression of human mind in emotional and rhythmical language,,

లయబద్ధమైన భావోద్రేకయుక్తమగు భాషయందు కళాత్మకముగ మానవ హృదయములను ప్రతిబింబింపజేయుటయే కవిత్వము. సాహిత్యమునకు Rhetoric అని నామము కలదు. Rhes అనుపదము Stream, tarent అనే పదాలనుండి వచ్చింది. ఇట ఈ భావము ద్రష్టవ్యము. "Rhetoric is the art of clear and effcetive use of language written or spoken as a vehicle for the communication f ideas"

"శప్యతే అనేనేతి శబ్దః అనే వ్యుత్పత్తి నిబట్టి ఉచ్చరింపబడేది శబ్దమని నిర్వచింపవచ్చు శం సుఖం దదాతీతి శబ్దః అనేది శబ్దానికి మరయొక వ్యుత్పత్తి. సుఖము నిచ్చునది శబ్దము, "శపయతి అవగమ యతి అర్థం ఇతి శబ్దః" అనే వ్యుత్పత్తికి అర్థావబోధనము సేయునది శబ్దమనుట పొసగును.

పృథివ్యప్తేజో వాయ్వాకాశములలో ప్రథమమాకాశమే. "శబ్దగుణకమాకాశమ్" అను తార్కికనిర్వచనానుసారము గగనమునగల లక్షణముశబ్దమే. మూలాధార చక్రమునుండి వెలువడిన ధ్వనియే శబ్ద వాచ్యమగును. శబ్దమునకు అక్షరమని వర్ణమని నామములు గలవు. స్పందనానుగుణంగా రూపమును పొందును. శబ్దమర్థమును కలిగి యుండును.

"ఏషాదైవీ వాగనువదతి స్తనయిత్నుః దదద ఇతి" అనెడియుప నిషద్వాక్యము దానదయాదమములను దేవదానవమానవులు ముగ్గురు యలవరచుకొనవలయునని బోధించుచున్నది. "ఊకాలోజ్ఝ్రస్వదీర్ఘ ప్లుతః" యను పాణినీయసూత్రము అజ్రూపమైన శబ్దమునకు గల త్రివిధ రూపభేదములను వివరించుచున్నది

అర్థము వాచ్యలక్ష్యవ్యంగ్యమని మూడువిధములుగ నుండును. కావ్యమునకు పాశ్చాత్యుల నిర్వచనములిట్లున్నవి.

Elevated Expression of elevated thought or feeling in prose or verse.

"అత్యున్నతభావములను ఉన్నతపద్ధతిని గద్య పద్య రూపమున వ్యక్తీకరించుటయే కావ్యము.

"Poetry is the art of expressing in melodious words the thoughts which are the creations of feeling and in agination'.

శ్రవణానందకరములు, మనోజ్ఞములైన పదముల ద్వారా భావాభివ్యక్తీకరణమే కవిత్వము.

'Poetry is the embodiment in appropriate language of beautiful thought in agination or emotion'

భావోద్రేకసమయమున సుందర భావములను ప్రస్తావోచిత భాషయందభివ్యక్తీకరించుటయే కవిత్వము.

**'Poetry is at bottom a criticism of life'**

జీవితవిమర్శయొక్క ప్రారంభస్థానమున కవిత్వముండును.

Poetry is the most in tense expression of dominant emotions and the higher ideals of the age'

ప్రబలమైన, గాఢమైన భావములయొక్క అభివ్యక్తీకరణమే కవిత్వము.

(Pen association)

ఒకానొక కథానికాకర్త కవిత్వమునుగూర్చి యిట్లనును—

'He can so portray a moment in life'

కవి జీవితమందలి సన్నివేశము నభిలింఖింపగలడు. రసమనగా నేమియో వివరించుచు 'రస్యతే ఇతిరసః' అను వృద్ధుల నిర్వచనము నొసంగిరి ఆస్వాదింపబడు నదియే రసము. 'రసోవైసః' యనుశృతి భగవానుడు రసస్వరూడపుని బోధించుచున్నది.

'క్రతుం కుర్వీత' యని వేదము యజ్ఞములు సేయుడని పురుషుల బోధించుచున్నది. 'అథఖలు క్రతుమయః పురుషః' యనునది పరము పురుషుడు యజ్ఞమయుడని తెలుపుచున్నది. ఇటగల క్రతుమయ శబ్దమునకు వాసనామయుడనియు అర్థము చెప్పవచ్చును. 'రససిద్ధాః కవయః' అనునది కవులు రసనిర్మాణమున నిష్ణాతులని చెప్పుచున్నది.

'నానృషిః కురుతే కావ్యం' అనునది ఋషికానివాడు కావ్యమును రచింపలేడని బోధించును. భారతీయుల సంస్కారమును

పాశ్చాత్యవిద్వాంసుడగు Arnold శ్లాఘించియున్నాడు. అస్మద్దేశ సంస్కృతి ప్రేరితుడైన శ్రీ రవీంద్రనాథటాగూర్ యూరప్ దేశం వెళ్ళి గంభీరోపన్యాసమునొసగి ప్రజలనానందాబ్ధిలో నోలలాడించినాడు. వేలమంది యా యుపన్యాససమయమున నిశ్శబ్దముతోనుండిరి.

సరోజినీదేవి భారతీయమహిళయైనను ఇంగ్లండు దేశమున నివసించి పాశ్చాత్యభావనాప్రేరితయై కావ్యమును రచించినది. ఆ దేశస్థులా కావ్యమును పఠించి, ఇందు మీదేశ సంప్రదాయములు గోచరించుటలేదనియూ, భారతీయ భావనలతో కావ్యమును రచింపుడని పలికిరి. సాత్త్వికులు రసానందమునొందగలరు. సాత్త్వికుల స్వరూపమిట్లు నిరూపింపబడినది—

"పరస్య సుఖదుఃఖాదేః అనుభావేన చేతసః
అత్యంతేనానుకూలేన యేవ తద్భావనం భవేత్
తత్ సత్త్వం తేన నిర్వృత్తాః సాత్త్వికా ఇత్యుదీరితాః
అనుభావత్వ సామాన్యే సత్యప్యేషాం పృథక్తయా
లక్షణం సత్త్వజత్వాద్ధి తే చ స్తంభాదయః స్మృతాః"

ఇతరుల సుఖదుఃఖములను అత్యంతానుకూలమగు హృదయానుభవముచే భావనచేయగలుగుటయే సత్త్వమగును. అట్టి సత్త్వగుణమును పొందినవారు సాత్త్వికులు. స్తంభప్రళయాదులయందు అనుభవింపబడుట యను సామాన్యధర్మమున్నను సత్త్వమునుండి యుద్భవించుటచే స్తంభాదులనెడి సాత్త్వికభావములు వేరుగ చెప్పబడినవి. ఇట్లీ వ్యాసమున సాహితీతత్త్వమునంతను సమగ్రముగ జెప్పిరి.

తూపురాన్ ప్రాంతమున జరిగిన కవి సమ్మేళనమునందు రత్నకవిగారర్థవ్యత్యోపన్యాసమునొసంగిరి. వీరాయుపన్యాసమున కావ్యలక్షణ

ముల ప్రస్తావించుచు, ప్రజలను సన్మార్గమున నడిపించునదియే కావ్యమను భావముగల ఈ క్రింది పద్యభాగముదాహరించిరి. —

“కవితయనంగ పద్యముల గద్యములన్ రచియించుటౌనె భా
వ విలసనంబు లోకహితవర్తనమున్ బ్రచురింపజేసికన్
గవకుమ వర్ధమట్ల వస్తుతత్త్వమును భాసిలజేయుట .... ....”

“ప్రాసగ ముత్తెపుసరుల్ పోహళించినరీతి శబ్దార్థములు మైత్రితో భాసిలవలెనని పింగళిసూరన చెప్పియున్నాడు. ఆచార్య రాయప్రోలు వారి నిర్వచనంగూడ యీ సందర్భమున స్మరణార్హము.

వేదములయందు సైతము అనేకాలంకారములు ప్రయోగింపబడినవి. కవి, కావ్యం రెండూ సృష్ట్యాదినుండి ఉన్నాయి. “కవిం పురాణమనుశాసితారం” అను ప్రమాణమే పై విషయమునకు నిరూపకము. శ్రుతులందు చక్కని భావములున్నవనుటకీ క్రింది పంక్తులే లక్ష్యములు —

“యాన్యస్మాకం సుచరితాని తానిసేవితవ్యాని నో ఇతరాణి”

ఏవి మనకు సుచరితములో వానివే సేవింపవలయును. ఇతరములను సేవింపరాదని భావము.

సందర్భానుసారముగ నీ వ్యాసమందు ప్రవృత్తినివృత్తుల తారతమ్యమును తెలుపు చక్కని శ్లోకముదహరింపబడినది. ఆ శ్లోకమిది —

“నమాంసభక్షణేదోషః నమద్యేనచమైథునే
ప్రవృత్తిరేషాభూతానాం నివృత్తిస్తు మహాసుఖమ్”

మాంసభక్షణము, మద్యపానము మొదలగు పనులయందు దోషం లేకున్నను, వానినుండి మరలుటవలన గొప్పసౌఖ్యముగలదు.

భావమేమియులేని కవితలు అధమకావ్యములగును. ఇవి నింద్యములు. ఇందులకుదాహృతి —

"అతడు శూలముద్రిప్పు నితడు వాలముద్రిప్పు
నెలమినాతనికంటె నితడె ఘనుడు"

భాషాతపస్సు, భావమననం, లోకానుభవం కవికి కావలసిన ముఖ్యలక్షణాలు. ఈ లక్షణములు గల కవియే మహాకవి. వాని కావ్యములే శాశ్వతకావ్యములని రత్నకవిగారు తమ యుపన్యాసములో జెప్పిరి.

## వసుచరిత్ర సమీక్ష

శ్రీ అంబటిపూడి వెంకటరత్నకవిగారు వసుచరిత్రను సమీక్షించుచు చక్కని వ్యాసమును రచించి నల్గొండ జిల్లాగ్రంథాలయ వారోత్సవ సమయాలలో చదివిరి. ఈ వ్యాసము "చుక్కాని" యను జాతీయ వారపత్రికయందు ఐదు పత్రికలలో వరుసగా ప్రచురింపబడినది. చుక్కాని పత్రిక తేదీలు క్రమంగా ఇవి : 15-1-72, 22-1-72, 5-2-72, 12-2-72, 19-2-72.

రామరాజభూషణుడను నామాంతరముగల భట్టుమూర్తి పురాణ గాథయందలి యనౌచిత్యములను, అసభ్యాంశములను తొలగించి యుత్తమమైన రసవత్ప్రబంధముగ కృతిని వెలార్చెను. ఈ వ్యాసారంభమున కవిగారు వసుచరిత్రయందలి ప్రధానగాథను యందలి మలుపులను చక్కగా వివరించిరి. వసుచరిత్రయందు నాటకీయత గోచరించును. ఇట్టి నాటకీయతను ప్రబంధముల యందు రమణీయముగ ప్రవేశపెట్టిన ఘనత తిక్కనసోమయాజికి దక్కినది. నిర్వచనోత్తర రామాయణమున సీతను పరిత్యజించు సందర్భమున నాటకీయత గోచ

రించును. నాటకమును గూర్చి అరిస్టాటిల్ చెప్పిన విషయములు యిట్లున్నవి —

"Unity of action, Unity of place, Unity of time."

ఈ క్రియా స్థల కాల సాహచర్యములు మూడును వసుచరిత్ర ప్రబంధమున సంపూర్ణముగ గలవు.

వసుచరిత్రయందలి నాయికానాయకులగూర్చి పాశ్చాత్యుల విమర్శలను సహేతుకముగ ఖండించిరి. పద్మసచివుడు నాయికా పాద రేఖలనెట్లు గాంచెనను ప్రశ్నకు యాతడు సాముద్రికశాస్త్రాభిజ్ఞుడనియు కన్యావివాహసమయమున సాముద్రికలక్షణములను పరిశీలించుట యుక్తమనియు, యాతడు సాముద్రికవేత్తయనుటకు గ్రంథమున ప్రమాణములున్నవనియు, కవి బహుశాస్త్ర నిష్ణాతుడనియూ హేతు హేతుమద్భావ పురస్సరముగ నిరూపించిరి.

"కేవలకల్పనాకథలు కృత్రిమరత్నములాద్యసత్కథల్
వానిరిబుట్టు రత్నముల .... .... .... .... .... .... నెడికవి"

ప్రతిజ్ఞను వివరించిరి. పురాణగాథల గ్రహించి యందు కల్పనలప్రవేశ పెట్టిన కావ్యరసికుల డెందముల నాకర్షించును. పిమ్మట వసుచరిత్ర కర్త కవితానిరూపణము చేసిరి.

"అరిగా పంచమమేవగించి .... .... ...." యను పద్య మందలి సంగీతశాస్త్రార్థములనెన్నిటినో బహిర్గతముజేసి మూలకారుని హృదయమును పాఠకుల కందించిరి.

నందితిమ్మన ముద్దుముద్దుగా కలకంఠవధూకలకాకలీ ధ్వనితో రోదించెనని, భట్టుమూర్తి బావురుమనెనని తెనాలిరామకృష్ణుని పరిహాసమున్నది. స్త్రీలరోదనమునుగూడ కవులెంత కమనీయముగా వర్ణింతురో సోదాహరణమీవ్యాసమున నిరూపింపబడినది.

"నానాసూనలతావితానముల నానందించుసారంగ మే
లా నన్నొల్లదటంచు గంధఫలి బల్కాకన్ తపంబంది యో
షానాసాకృతిబూని సర్వసుమనస్సౌరభ్యసంవాసమై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబులిర్వంకలన్"

అను పద్యము హృద్యము, నిరవద్యము. ఇందలి యుత్ప్రేక్ష సహృదయ మనోరంజకమనుటలో విచికిత్సలేదు. ఇట్టి యనేక పద్యములనుదాహరణముగగొని వసుచరిత్రకారుని కవితామాధుర్యమును సహృదయులకందించిన రత్నకవిగారు ధన్యులు.

వసుచరిత్రమత్యద్భుతమైన కావ్యమగుటచే కాళహస్తి కవి గైర్వాణీభాషయందనువదించెను. కవిగారు యథావకాశము సంస్కృతానువాదమునుగూడ పరిశీలించిరి. శ్రీ కాశీనాధుని సుబ్రహ్మణ్యం గారి సంపాదకత్వమున హైదరాబాదు నుండి వెలువడిన చుక్కాని పత్రికకు వసుచరిత్రపై కవిగారు వ్రాసిన యీ వ్యాసముత్కర్షాధాయకము.

శ్రీ వంగల రామకృష్ణశాస్త్రిగారి పదవీవిరమణ సమయమున గుంటూరు నగరమున కవిగారు అధ్యక్షోపన్యాసమునిచ్చిరి. ఆ యుపన్యాసమున ఆర్ష ధర్మమును వేదగృహ్య సూత్రములను నిర్వచించి వివరించిరి. మనుస్మృతియందు ఐదువందల సాంఘిక ధర్మములు ప్రతిపాదింపబడినవి. "మననాత్ త్రాయతే" యని మంత్రశాస్త్రమున మంత్ర పదము నిర్వచింపబడినది. తాంత్రికవిద్యలు, బౌద్ధతంత్రముల స్వరూపములు, చైనాదేశమందు ప్రసిద్ధినొందిన క్రమాచార తంత్రము వ్యాఖ్యాతములు.

భారతదేశమున పదునెనిమిది శక్తిపీఠములు గలవు.

"లంకాయాం శాంకరీదేవీ కామాక్షీ కాంచికాపురే

ప్రద్యుమ్నే శృంఖలాదేవీ చాముండాక్రౌంచపట్టణే

.... .... .... .... .... .... .... .... .... ....

కాశ్మీరేతు సరస్వతీ" అని ఆశక్తిస్థానములు వివరింపబడినవి.

సర్వతంత్రములయందును మహానిర్వాణతంత్రము మహత్తా పూర్ణమని నిశ్చయింపబడినది. శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారి సౌందర్యలహరి యందలి యీ క్రింది శ్లోకము సరహస్యార్థప్రకాశనము ప్రస్తావింపబడినది.

"శివశ్శక్త్యాయుక్తః యదిభవతి శక్తః ప్రభవితుం
నచే దేవం దేవో నఖలుకుశలః స్పందితుమపి
అతస్త్వామారాధ్యాం హరిహరవిరించాదిభిరపి
ప్రణంతుం స్తోతుంవా కథమకృతపుణ్యః ప్రభవతి ? "

ఈశ్వరుడు శక్తిసమేతుడైననే సృష్ట్యాదికార్యనిర్వహణాధౌరేయుడగును. శక్తివిహీనుడైన చలింపనేరడు. హరిహరవిరించాదులచే ప్రశంసింపబడు నిన్ను పుణ్యవిహీనుడెట్లు నుతింపగలడు?

శాకల్యునిచే ప్రవర్తింపబడిన జ్యోతిశ్శాస్త్రమునందు వరాహమిహిరుడు, యవనాచార్యుడు, సత్యాచార్యుడు, జీవశర్మ, కృష్ణవర్మ ప్రభృతులు కృషిసలిపి అమూల్యగ్రంథముల రచించియుండిరి. వా స్తుశాస్త్రమునకు చెందిన విషయములతో కవిగారు తమయుపన్యాసమును పూర్తి జేసిరి.

## ప్రబంధపరమేశ్వరుడు - అరణ్యపర్వశేషము

1972 ఏప్రిల్, మే, జూన్ నెలల స్రవంతి మాసపత్రికలలో వరుసగా పై వ్యాసము ముద్రింపబడినది. ప్రబంధకలితార్థయుక్తి,

అక్షరరమ్యత నానారుచిరార్థసూక్తినిధిత్వము యనునవి వాగనుశాసనుడైన నన్నయ కవితయందలి ప్రధానలక్షణములని విపశ్చిదపశ్చిములచే ముక్తకంఠమంగీకృతములు. నన్నయ భారతమందలి శరద్వర్ణనాపరమైన యీ పద్యమత్యంత కామనీయకమును సంతరించుకొనినది.

"శారదరాత్రులుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులన్
చారుతరంబులయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీర సౌరభముదాల్చి సుధాంశువికీర్యమాణక
ర్పూర పరాగపాండు రుచిపూరములంబర పూరితంబులై"

వ్యాసభారతమున "శివాఽభవత్" యని మాత్రమేయుండ నన్నయగారు చారుతరంబులయ్యె నని వాడి మూలాధిక సౌందర్యము నవతరింప జేసిరి.

మహాకవి ఎఱ్ఱన రచనమందలి "స్ఫురదరుణాంశు - " యనెడి పద్యమందలి సోయగము మహత్తరము. అరణ్యపర్వమందలి చివరి భాగము యక్షప్రశ్నలు. 'ఏనుధర్ముడజువ్వె ....' యను పద్యమందలి ధర్మపథము వివిధ పద్ధతులచే వివృతమైనది.

నెహ్రూగారు రచించిన "Discovery of India" గ్రంథమున గల మహాభారత ప్రశంసాపరవాక్యములనీ వ్యాసమున నుదహరించిరి. నృసింహపురాణ వైచిత్ర్యమును మనమున నిడుకొని ఎఱ్ఱపోతసూరి ఎఱ్ఱనను గూర్చి చేసిన ప్రశంసను దెలిపిరి. ఎఱ్ఱననుగూర్చి, "అరణ్యపర్వశేషోన్నయనం బొనర్చి-" యని తదనంతర సుధీమణులాతని బ్రస్తుతించిరి. ఇట ఉన్న యన శబ్దమునకు పూరించుటయనియే అర్థము. ప్రబంధపరమేశ్వర పదమెఱ్ఱనకు అన్వర్థనామధేయము.

కాళిదాసుడు, ఎఱ్ఱన తమగ్రంథములయందు లేడిని వర్ణించిరి 'వారివారి వర్ణనములయందలి సాదృశ్యవైసాదృశ్యములిందు సమీక్షింప

బడినవి. మేఘసందేశమున కాళిదాసుని "సూచిభేద్యపదము తరవంత రులచే స్వీకృతమని, రమణీయభావాభివ్యంజన సమర్థమని వేదం వెంకట్రాయశాస్త్రిగారు పరిశోధించి తేల్చిరి.

తోరోయును ఆంగ్ల మహాకవి వాట్సన్ నదీతీరమందలి దట్టమైన అంధతమసమును ఇట్లభివర్ణించినాడు —

"The darkness was so thick that you could cut it with knife" ఎఱ్ఱనమహాకవి రచనలయందలి 'లింగగ్లులు' - "అతిమలినాంగి" అధిక దుష్టాచార- "పద్యరత్నాలు పరమరంజకాలని కవిగారు ప్రతిపాదించిరి".

పరీక్షిత్తుచరిత్ర, సావిత్రిచరితము, సీతకధలను ఎఱ్ఱన రస స్ఫూర్తితో అమృతగుళికలుగా మార్చినాడని ప్రవచించిరి.

శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి సంపాదకత్వమున వెలువడిన "శోభ" 1947 ఏప్రిల్ సంచికలో "పర్యవేక్షణము" యను వ్యాసమును కవిగారు రచించిరి. ఆ వ్యాసమున "సౌందర్య" మను పదమునకు మూలము కీట్స్ మహాకవియొక్క 'A thing of beauty is a joy for ever' యనెడి వాక్యము.

కవులు వర్ణనలలోకూడ నాయికానాయక వ్యవహారారోప ణల జేసి కావ్యసౌందర్యాన్ని ఇనుమడింపజేసారు. నదీసముద్ర, లతా వృక్ష పదాలలో స్త్రీపుంలింగ పదప్రయోగస్వారస్యం గమనించాలి. "యోగిముక్తి కాంతతో సుఖిస్తున్నాడు"నడంలోకూడ శృంగారభావ స్ఫూర్తిగలదు. సర్వత్ర సౌందర్యం నిబిడీకృతమైయున్నది. జగన్నాథుని గూర్చి శ్రీ కాశీ శేష వెంకటాచలసూరి "రాత్రౌయవన్యావిహృతః కాశ్యాం గంగాతటేశయానః పండితజగన్నాథః" అనడం గమనించాలి. ఇక్కడ ప్రయుక్తములైన పదాలు శృంగారభావాన్ని హృదయాంతః రాళాలలో స్ఫురింపజేస్తూ మనస్సునకాహ్లాదము నొసంగుచున్నవి. సృష్టిలోగల శృంగారభావాన్ని మనోహరంగా కవులభివ్యక్తంజేసారు.



7-5-1943 శ్రీకృష్ణదేవరాయల భాషానిలయంలో సన్మానం



గురువర్యులు శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు

# CHAPTER - II

# ఖండకావ్య పరిశీలనము

## ధర్మజనిర్వేదం

ఇది రత్నకవిగారు రచించిన అముద్రిత గ్రంథము. భారత యుద్ధానంతరము మృతులైన పుత్రబాంధవుల స్మరించి ధర్మజుడు విలపింపగా తమ్ములు, ద్రౌపది ఆతనినోదార్చినారు. మహాభారతమున శాంతిపర్వము ప్రథమాశ్వాసమునసీగాథ వర్ణింపబడినది. ఈ గాథనే గ్రహించి కవిగారు ఏబదియారు పద్యములతో ఈ ఖండ కావ్యమును వెలయించియున్నారు. ఇందు ధర్మజ విలాపము 18 పద్యములు. మిగిలిన పద్యములు సాంత్వనములే. ఇందుత్పలమాలశార్దూలం మత్తేభం, శిఖరిణి వృత్తాలు ప్రయోగింపబడినవి.

కర్ణుని పరాక్రమాన్ని స్మరించి ధర్మజుడెలా విలపిస్తున్నాడో చూడండి —

"ఆతని కేతనమ్మున భయమ్మును గోనెడి కేసరిన్ గనన్
భూతములెల్ల పర్వులిడి పోవును రాజు రజఃప్రధానుడై
భూతలినేలగాగలడు భూప్రజ కాతనియానలన్ వినన్
భీతి జనింపకున్నదపినీతి ధరాస్థలి తాండవింపదే

ఆయువు తీరినవారి గూర్చి విచారింపవలదని, వనవాసం చేస్తూ వైరాగ్యాన్ని పొందడం క్షత్రియున కనుచితమని సవ్యసాచి ఓదారుస్తాడు. భీముడు నాల్గు ఉదాహరణములతో ధర్మజుని ఓదార్చినట్లు తిక్కన భారతంలో ప్రతిపాదింపబడినది. మూలమునగల ఒక్కొక్క పాదమును గ్రహించి ఒక్కొక్క పద్యముగా కవిగారు చిత్రించుట పరమ రమణీయం. ఈ క్రింది పద్యాలలోని హృదయ సమార్జకత్వమును, మాధుర్య ప్రసాద గుణములను, అప్రస్తుత ప్రశంసాలంకార చాతురిని గాంచుడు—

1. "దాహముత్కటమై వేరు దారిలేక,
కూపఖననమ్మొనర్చి దివ్యోపభోగ్య
మధుర జలములగని త్రావ మనసు గొనక,
వీడిపోవు తృషార్తుని వెఱ్ఱియేమి?

2. "వట మహావృక్ష శాఖాగ్ర బద్ధమైన,
తేనెపట్టుల నీగల తెగువు జేసి
పాలద్రోలి గ్రహించిన ప్రసవ సార
మై వును గ్రోలనియాతడెవడో

3. "తీక్ష్ణమైన బుభుక్షచే తెరువుతెన్నో,
త్రొక్కి గడియించుకొన్న తండులములెన్నో
వండి వడ్డించుకొని ముందు బరగుచుండ
తినని వాని మనోవృత్తి తీరదేమి?

4. "తనకు తాను వరించిన తరుణినెన్నో
విధుల వలపించి వశము గావించుకొనియు
భోగ సమయ మహారంభ వేగవేళ
దాని స్పృశియింప ననునాతడౌనదేమి?

గార్హస్థ్యంలోగూడ యజ్ఞాలు చేసి మోక్షం పొందవచ్చని నకులుడు, వ్యక్తిత్వం వదలవద్దని సహదేవుడు, మానినినవమానించినవానిని శిక్షించుట ధర్మమేనని ద్రౌపది ఓదార్చడంతో ఆతడు స్వస్థచిత్తుడవుతాడు. శత్రువులను సంహరించుటయే క్షత్రియునకు వేదోక్తకర్మమని, నిర్వ్యాపారిమైయుండుటయే మోక్షంగాదనీ, అలా అయితే పర్వతాద్యచేతనవస్తువులకు ఎప్పుడో వచ్చేదనీ, గృహదహనం, పరసతిని అవమానించడం చేసినవాడు బ్రాహ్మణుడైనను వధార్హుడేనని చెప్పే ఉపదేశ పద్యాలను రమణీయంగా ప్రసాదగుణ భూయిష్టంగా కవిగారు చెప్పినతీరు సహృదయ మనస్సులను ద్రవింప చేస్తుందనడంలో అతిశయోక్తిలేదు.

"చెడుగులు బంధులైన పడజీల్చియు ధర్మముగెల్చి లక్ష్మినీ
పుడమినిగొన్న భూపవర పొక్కెదవే పురుషార్థ సిద్ధికిన్
కడిమికులోచితమ్మైన కార్యముజేయుట వేదబోధిత
మ్మగుగుము వేదనామయముహుర్మ్మహురన్మధనమ్మొడందలో
పనిలేకున్కియె మోక్షమిచ్చు నెడలన్ పాషాణమున్ పర్వతం
బునుముక్తంబని పల్కగావలయునేమో! కర్మముల్ జేయుచున్
తనయాత్మన్ పరతత్త్వమందునిగియింపన్ కర్మజాతం ప్రశాం
తిని గొన్నట్లగునంచు జ్ఞానియిలము క్తింబొందు నీజన్మలో

ధర్మాధర్మ విషయంలో అందరూ సమానమేనని నిష్పాక్షికంగా వ్యవహరించాలని చెప్పే భారతధర్మంలో ఈ కవికిగలయభినివేశాన్ని ఈ క్రింది పద్యములో గమనించండి—

"గృహములకు నిప్పుబెట్టి నిక్కెడి కిరాతు
పరసతుంగోరి గర్వించు పాపహృదయు
బంధునేని బ్రాహ్మణునేని వధయొనర్చి
దండనము సేయుటయే రాజధర్మమంద్రు"

పరీధావి సంవత్సర "ఉగాది" పండుగ సందర్భంగా ఏడు పద్యాలను "చతుష్పాత్తులు" అనే కవితగా రచించారు. ఈ పద్యాలలో భారతీయధర్మము, జాత్యభిమానము, దేశభక్తి గోచరించుచున్నవి. ఇందులో భారతదేశమంతా ఒకటేననీ, అందరూ ఐకమత్యంతో ఉండాలని బోధించే యీ పద్యం మనోహరం.

ఆసేతు శీతాచలా వృతమే దిసీ
తల మొక్కటై భారతమ్ము నాగ
ఇందున్న వివిధ జనేహాసముత్పన్న
భావమ్ము లొక్కటై పరగుగాక
వైవిధ్య మది ప్రకృత్య విరోధమై
యేకమై భేదమెద్ది యేనడగుగాక

పర పరిహేళనాకరముగా బ్రతికిన
జాతి యశో భాగ్యమ్మె వెలుగుగాక
ఇది భారతఖండమున క్రొత్త దేదొ కలిగి
వెలిగెడి వెలుంగు నూతనోద్వేగరీతి
దీని కేవేవో హేతువుల్ తెల్పువార
లేమి చెప్పిన తెలియని హేతు వేదొ॥

భావకవితచే ప్రభావితులైన రత్నకవిగారు సంస్కృతంలో కూడా భావకవితను రచించారు. "అపాత్తులు" అనేది వీరి సంస్కృత కవిత పరంగా మృదుల భావసమేతమై అలరారుతూంది. ఏనాటికైనా ధర్మం గెలుస్తుందనే దృఢవిశ్వాసం ఉందనీ, సర్వమానవులకు మంచి కలుగుతుందని తాను సంతసిస్తున్నానని చెప్పిన మాట హృదయాన్ని పులకరింపజేస్తుంది. ఈ కింది పంక్తులు చూడండి—

"జయతి ధర్మ ఇత్యాశాకిరణమ్
భవతి పదితి జగతి తోషణమ్"

తనను తానువిమర్శించుకోవడం, తన అనుభవాలను కవితద్వారా ప్రకటించడం కవికి ముఖ్యలక్షణం, "కశ్చాహం కాచమే శక్తిరితి చిన్త్యం ముహుర్ముహుః" అంటాడు చాణక్యుడు ఆత్మపరిశీలనం కవికి చాలా అవసరం. ఆలక్షణం రత్నకవిగారికి గలదనడంలో ఏడు పద్యాలతో గూడిన "పట్టివేత" అనే కవితయే తార్కాణం. ఈకవి ఆ కవితలో సర్వత్ర తనకు భారతీయసంస్కృతియే గోచరిస్తున్నదని చెబుతాడు. భగవద్గీతలో వేదార్థం కనిపిస్తూందనీ మౌస్ (Mouse) అనే ఆంగ్ల పదంలో గూడ మూషకమనే సంస్కృత భాషాపదమే గోచరిస్తుందని చెప్పడం కవిగారికిగల వేదసంస్కృతి, సంస్కృతభాషపై గల అభిమానానికి నిదర్శనం, చూడండి—

"చదివెదనుగీత శ్రుతి వాక్యసరళిదోచు
కాళిదాసున వాల్మీకి గానుపించు

మాసనగ మూపశబ్దమ్ము మదికిదోచు
గ్రాసనగ గ్రాసశబ్దమ్ము గ్రాలు మదిని

శ్రీ అంబటిపూడివారు లాల్‌బహదూర్ శాస్త్రి గారి మృతి విని దిగ్భ్రాంతులై సంతప్యమాన చేతస్కులై తొమ్మిది పద్యాలను రచించి జగద్విలాపమని పేరిడిరి. సహృదయుడు కార్యదీక్షాపరుడైన లాల్ బహదూర్ మరణం యావత్ప్రపంచాన్ని విలపింపజేసింది. కాళిదాసుని కుమారసంభవంలోని రతీవిలాపంలో ప్రయోగింపబడ్డ వియోగినీవృత్తాలు ప్రసిద్ధిపొందాయి. క్షేమేంద్రుడు తన ఔచిత్య విచార చర్చలో కవి రసానుగుణంగా వృత్తాలను ప్రయోగించాలని అదే వృత్తౌచిత్యమని నిర్వచించాడు. కరుణరసానుకూలములైన వియోగినీవృత్తాలనే గ్రహించి యీ చిఱుకావ్యాన్ని వెలయించడం కవిగారి ఔచిత్య దృష్టికి తార్కాణం. "పొట్టివాడైన బహుగట్టివాడు" అనే సూక్తికి లక్ష్యుడైన లాల్‌బహద్దూర్‌ను వామనునితో పోల్చి వర్ణించడం ఎలా రమణీయంగా ఉందో చూడండి—

"అతిమానవరూపధారివై
గగనంబంటెడు విశ్వమూర్తివై
రణజేతవు శాంతిజేతవున్
జనసామాన్యము కానికీర్తితో"

సత్యాహింసలనే ప్రధానసూత్రాలుగా నమ్మి, నిరంతర గీతాధ్యయన పరాయణుడై, స్వాతంత్ర్యసముపార్జనాబద్ధకంకణుడై, మానవాళిని, ప్రగతిపథంలో నడిపించిన మహాత్మాగాంధీగారిని స్మరిస్తూ, అంబటిపూడి వెంకటరత్నంగారు పదునొకండు పద్యాలను రచించారు. వీటికి 'గాంధీస్మృతి' యని పేరు పెట్టారు. గాంధీ జయంతులను జరిపేవారు చాలామంది ఉన్నా ఆయన సిద్ధాంతాలను పాటించే వ్యక్తి ఒక్కడైనా లేడు గదాయని చెప్పిన కవిగారి పద్యం ఎలా హృదయానికి హత్తుకుపోతుందో చూడండి —

"సత్యాహింసలు మూలసూత్రములుగా సాగించి నీ జీవికన్
నిత్యానందము జూరగొన్న గురువా! నీ గాంధిదేవా! భవ
ద్దౌత్యమ్మున్ గొని సాగి నీవలె మహాధ్యానమ్ము జేయంగ నౌ
చిత్యమ్ముల్లంచినవాడొకండైనని శిష్యుండు లేడేల్లకో"

ఈ పద్యాలు "కావ్యాంజలి" అనే కవితా సంకలనంలో రెండవ పుటలో ముద్రింపబడ్డాయి.

గాంధీగారు నిర్యాణం చెందినప్పుడు పలువురు విచారించారు. గాంధీగారి నిర్యాణం ప్రపంచానికి తీరనిలోటు. గాంధీగారి స్మృతి విని తన్మయులై "గాంధీనిర్యాణం" అనే శీర్షిక క్రింద పదునెనిమిది పద్యాలను సంస్కృతాంధ్రాంగ్లాలలో వెలయించి తనకుగల బహుభాషాభిజ్ఞతను చిరుపాత్రంలో కూడా వెల్లడించారు. గాంధీగారివలె దేశభక్తులైన వీరు గాంధీయెడల సానుభూతిని చూపి విలపించడం ఎంతో సముచితం. సహృదయులను రంజింపజేయడానికి మూడు సంస్కృతంలోను, పదమూడు ఆంధ్రభాషలోను, మూడు పద్యాలు ఆంగ్లంలోనూ చెప్పారు. మూడు భాషలలోని వీరి కవితకు మూడు లక్ష్యాలను చూడండి —

"మానవుడు మానవుని జంపి మమతగొనుచు,
మూటగట్టెడిశాంతిసముద్రదశేదో
తెలియరాక విమర్శించి తీక్ష్ణదృష్టి,
గతచరిత్రమ్ము తడవె నిమ్ములువమతిని"

"సజ్జనం జనసంసేవ్యం ద్రష్టుం నేచ్ఛతి దుర్జనః
తథాభూతః పరం క్రూరః మహాత్మా నమపాతయత్"

"In the foul body crept
Many germs its abrupt
Grown they have late
And struggle in great hate"

ఆంధ్రావనీ మహోజ్జ్వల చరిత్రనుగాంచి పులకించిన ఆంధ్రులలో అంబటిపూడి వారొకరని చెప్పవచ్చును. "ఆంధ్రదేశప్రాశస్త్యం

అనే శీర్షిక క్రింద వీరు పదమూడుశ్లోకాలను కొంత వచనకవితను రమణీయంగా కూర్చారు. 1938 లో వెలువడిన 'Historical Sketch of Telugu literature' అనే గ్రంథంలో శ్రీ T. Raja gopala Rao గారు Tradition say' అనియిచ్చిన విషయం ఈ కవితకాధారం.

ఆతపతప్తుడైన అగ్నిమిత్రుడను రాజు అరణ్యంలో సంచరిస్తూండగా ఒక యోగి ఆంధ్రదేశ మహాత్మ్యాన్ని చెబుతాడు. ఇందులో ఆంధ్రదేశప్రాశస్త్యం. ఏకశిల. రాజమహేంద్రవరం నగరాల గొప్పదనం. విద్యానాథుడు, ప్రతాపరుద్రుడు, నన్నయలు ఆంధ్రభాషకొనరించిన సేవ, వారి జాతీయత మొదలగు విషయాలు ఇందులో వర్ణింపబడినవి. ఇందులో "సాధ్నోతి" అనే ధాతువు లెస్సగా ప్రయుక్తమైనది. ఆంధ్ర పదానికి వ్యుత్పత్తి ఈవిధంగా చెప్పబడింది. అంధుడిని రక్షించడంచే ఆంధ్రమైంది.

"అంధం రక్షతి తస్మాద్ధి ఆంధ్రమిత్యభిధీయతే"

కవిగారి కవితకు ఆంధ్రదేశాన్ని వర్ణించే ఈక్రిందిశ్లోకం మచ్చుతునక.-

గోదావరీ నిర్మల వారిపూతా
కృష్ణా జలక్షాళిత పాపజాతా
పినాకినీ స్వాదువనైః పునీతా
బాభాతి మాతాంధ్ర ధరాసమస్తా"

పై శ్లోకంలో అంత్యానుప్రాస, "బాభాతి" అనే క్రియాప్రయోగం సహృదయులనలరిస్తాయనడంలో సందేహం లేదు.

కవిగారి లేఖినినుండి వెలువడిన గ్రంథాలలో "పరినపూలు" అనే చిరుపొత్తం గణనీయం. ఇందులో మూడుపద్యాలతో "చంద్ర నామి" యనే కవితను, ఎనిమిదిపద్యాలతో "చైతన్యస్పృహ"ను మూడుశ్లోకాలతో "జగద్దర్శనం" అనే సంస్కృత కవితను ఐదు పద్యాలతో "అనుభూతి"ని కూర్చారు. ఈ లఘుకావ్యాలు 24-10-69 తేదీన రాత్రి గం. 7-46 ని.లకు రసమంజరి కార్యక్రమం క్రింద ఆల్

ఇండియా రేడియో, విజయవాడవారిచే ప్రసారం చేయబడినవి. విశాలవిశ్వంయొక్క మాహాత్మ్యాన్ని తెలియజేస్తూ చెప్పబడిన కవితయే చంద్రగాము. మాధుర్యాన్ని గ్రహించడానికి ఈ క్రింది పద్యాన్ని గమనించండి —

"ఈ విశాల నభోవీధినెన్నియెన్ని, తారకలు మిన్కు-మిన్కు-ని దర్శనీయ కాంతిశోభమ్ములా నావకాశముననునరుని హృదిలోన భావనిర్ఘరులనింపు

భగవల్లక్షణమైన చైతన్యం లేకపోతే జీవి యెందుకూ కొరగాదు. చైతన్యప్రభావాన్ని 'చైతన్యస్పృహ'లోని యీ క్రింది పద్యం వివరిస్తుంది.

"పూవులలోని వాసనల పోడుములన్ గ్రహియింప కర్ణముల్
కావు సమర్థముల్ గద జగత్సువిశాల మహద్విభూతిలో
నావహిలంగనేర్చిన మహాద్భుత వస్తువెదో గ్రహింప నీ
జీవులలోన వెల్గు ఘనచేతనయే సుసమర్థమయ్యెడిన్"

పిరి "జగద్దర్శనమ్" అనే కవితలో ప్రపంచంలోని సజ్జనదుర్జనుల ప్రవర్తనలు విశదీకరింపబడ్డాయి. కేవలం మూడుశ్లోకాలలో కూర్చబడిన లఘుకవితయిది. మచ్చుకొక పద్యాన్ని గమనించండి —

"ఆరంభే పశురేవ శిక్షితమతిః జాతో మనుష్యస్తతః
శిక్షాదత్తమతిర్వివేక కుశలో జాతస్స దేవోఽపరః
శిక్షాభ్రష్ట వివేక దుష్టమతయః క్రూరాహి తుల్యాః ఖలాః
దుగ్ధైస్స్వాదుభి రుద్గిరన్తి విషమిత్యేతజ్జగద్దర్శనమ్"

ప్రారంభంలో మనుష్యుడు పశుసముడే. జ్ఞానంవల్ల క్రమంగా మానవుడవుతాడు. అట్టి మానవుడు మంచివాడవడి, వివేకంఉంటే దేవుడుగా మారుతాడు. క్రమశిక్షణ వివేకం లేని దుర్జనులు సర్పాల వంటివారు. పాలవంటి తీయని మాటలతో విషాన్ని క్రక్కుతారు. ఇదే ప్రపంచస్థితియని పై కవితకు భావం. "విషకుంభం పయో

ముఖమ్" "మధుతిష్ఠతి జిహ్వాగ్రే హృదయేతు హాలాహలమ్" అనే ప్రాచీన సూక్తుల భావం యిందులో గోచరిస్తుంది. ఎంత మహత్తర మైన భావమో చూడండి.

దుర్జనులలోని బహువిధములైన దౌర్జన్యాన్ని గమనించి భయ పడిన రత్నకవిగారి హృదయంనుండి వెలువడిన కవితయే 'అనుభూతి' 'ప్రథమం దుర్జనం వందే సజ్జనం తదనంతరమ్' అని తెనాలి రామ కృష్ణుడు, సుందర పాండ్యదేవ కవులవలె రత్నకవిగారు ఖలునిచూచి భయపడడం సమంజసం. "సాధూనాం దుర్జనాద్భయమ్" అని చాణ క్యుడు దుర్జనులవలన భయపడడం సజ్జనలక్షణమేనని సూచిస్తున్నాడు. ఇదే భావాన్ని ఐదు పద్యాలలో కూర్చినారు. ఈ పద్యాన్ని నిరీక్షించండి—

"కాని మనుష్యకము జూచి తేని నాకు,
చెడ్డ భయమౌను మాటాడ సిగ్గుపడెద
ఒకొ్కకమొడంద నొకొ్కక యురగమేమో
కాటువేయునోనని తొలంగదలతు"

పట్టివేత, ఆత్మచర్చయనే రెండూ ఒకే కవితకుగల నామ ధేయాలు. రత్నకవిగారు ఆంధ్రమాతను కీర్తిస్తూ 'తెలుగుతల్లి' అనే పేరుతో నాల్గుపద్యాలను రచించారు. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" యనే వాల్మీకి సూక్తిననుసరించి జన్మనిచ్చిన ఆంధ్రమాతను ఆంధ్రభూమిని కీర్తించడం కవిగారి ఆంధ్రజాతీయాభిమానానికి నిదర్శనం. "దేశభాషలందు తెలుగు లెస్స" యని శ్రీకృష్ణదేవరాయలు, "ఆంధ్రత్వమాంధ్ర భాషా చ నాల్పస్య తపసః ఫలమ్" అని మహా పండితులైన అప్పయ్యదీక్షితులవారు "ఆంధ్రమతిరమణీయమ్" అని జగన్నాథపండితుడు "Italian of the East" అని పాశ్చాత్యులు ప్రశంసించిన ఆంధ్రభాషాజననిని కీర్తించి రత్నకవిగారు ఆంధ్రులకను

సరణీయులై నారు. ఇవి 1956-11-7 తేదీగల ఆంధ్ర సచిత్రవార పత్రికలో ప్రచురింపబడినవి. ఆంధ్రభాషామాతను స్తుతించే ఈ పద్యం చిత్తాహ్లాదకరం.

చల్లనితల్లి మా తెలుగుసంపదకీ భువి సాటిలేదు నీ
పిల్లల పాటలెన్నొ వినవే జననీ మధుమాధురీ రసా
భ్యుల్లసితంబులై జగమునూపునవై దృఢమాతృభక్తి సం
పల్లవితంబులై యొక రవమ్మయి నినున్ నుతించునే"

వీరే ఐదు పద్యాలతో "నవ్యాత్మ" యనే కవితను వ్రాసారు. నవీనులు పంచభూతాలను జయించాలని కోరుచున్నారని అందువలన అన్ని సమస్యలు, వినాశాలు వాటిల్లుతున్నాయనీ, క్రమశిక్షణతో మన ప్రాచీనులు చెప్పిన కర్మలాచరిస్తే ప్రయోజనముంటుందని యీ కవితలో చెప్పబడింది. ఈ పద్యాలు "సుజాత"యనే పత్రికలో ప్రకటింపబడినవి. నవీనులకంటె ప్రాచీనుల భావాలు సమంజసం అనే ఈ పద్యాన్ని ఆస్వాదించండి —

"పెరిగెడి యాశలద్రుంచెడి,
మరలను గనిపెట్టినారు మాన్యులు పూర్వుల్
సరికావవియని నవ్యులు,
నరమారణయంత్రపాళి నాటింత్రు పెసల్"

1952 అక్టోబర్ నెల సుజాత పత్రికలో తొమ్మిది పద్యాలతో గూడిన కూజానామాయనే కావ్యం ప్రకటింపబడింది. విచిత్రమైన సన్నివేశంగల భావకావ్యమని చెప్పవచ్చు. రంజాన్ పండుగనాటి సంధ్యాసమయంలో, చంద్రరేఖ లీలగా గగనంలో కనుపిస్తున్న సమయంలో కవి కుమ్మరియింటికి బయలుదేరి వెల్తాడు. అక్కడి కుండలు తమ స్థితిని కవికుమారునికి వెల్లడిస్తాయి. కవి కుండలతో కాదా

తాత్మ్యాన్ని చెంది వాటిని వర్ణించడం జరిగింది. నన్ను నిర్మించారుగాని మరల పగిలితే మట్టిలోనే కలుపుతావుగదాయని ఒక ఘటం చెబుతుంది. నన్ను రెండు కపాలాలుగ జేస్తారుగదా అంటుంది మరొకటి. వక్రమైన నా రూపాన్నిచూసి హసిస్తారుగదా అంటుంది మరొక కలశం దాహంతో మరొక కుండ తపిస్తుంది. ఇంతలో చంద్రరేఖ స్పష్టంగా దృగ్గోచరమవుతుంది. కుమ్మరి రాసాగాడు. కవి తన గృహానికి చేరుకోవడంతో కావ్యం ముగుస్తుంది. తనను ద్రాక్షారసంతో కడిగి ద్రాక్షరసాన్ని పోసి ద్రాక్షాపత్రాలతో చుట్టి తోటలో పూడ్చమని ఒక కలశం చెప్పిన ఈ క్రింది పద్యాన్ని గమనించండి.

"తడబడు నాదు ప్రాణమును కమ్మని ద్రాక్షకణాలనిల్వ పో
కడ గమనించి యీతనువు కానిని ద్రాక్షరసాల చక్కగా
కడుగుము ద్రాక్షపత్రముల గట్టిగచుట్టి మరంద మాధురుల్
సుడివడు పూలతోట నొకచోటన పూడిచిపెట్టుమాపయిన్"

1952 ఆగస్టు సంచికలోని "సుజాత"లో పంద్రెండు పద్యాలతో "హితోక్తి"ని రచించారు. పల్లెల్ని నిందించేవారు పల్లెల్లో కాపురముంటే సాధకబాధకాలు తెలుస్తాయి. పొరుగువాడు మరణించినా కూతురికి పెండ్లి చేస్తూఉండటం నగరాలలో కనిపిస్తుంది. ఒకరిభాష ఒకరికి తెలియకపోవడం అక్కడి లక్షణం. పార్టీలు, నోరెత్తి అన్యాయాన్ని ఎదిరిస్తే కక్షలు పూనడం వలన పల్లెలు చెడిపోయాయి. దేశంలో దరిద్రులెక్కువ. ధనికులు దరిద్రులను పీడిస్తారు. శాసనాలు పెట్టి అమాయకులను పీడిస్తారు. మదాంధులైన హూణులు మనలను దోచుకొని బంగారపుమూటలుగట్టారు. వారి దౌర్జన్యాన్ని వందల సంవత్సరాలు సహించి చివరకు నోరెత్తినా కోపగిస్తారెందుకో? మానవులు దేవతలుగా మారాలిగాని రావణులుగారాదు. అందరినీమనం సమానంగా గౌరవించాలి. సర్వభూత సమానత్వం వలననే పరాయివాళ్ళు దేశాన్ని

పాలించినా సహించాం. పూర్వం రాజులు భేదాలు పాటించారనా్ని ప్రస్తుతం ప్రజారాజ్యం గనుక మనం భేదాలు మరచి సక్రమంగా ఉండ వచ్చు. దురాక్రమణలవల్ల పంటలులేని భూములలో నివసించాల్సి వచ్చింది. దేశరక్షణమిషతో పాలకులు పేదలను వంచిస్తున్నారు. ఈ భావాలతో ఈ కవిత సాగింది. ఈ కవితను ఈ పద్యంద్వారా ఆస్వాదించవచ్చు —

"నగరమునందు నీ పొరుగునన్ గల యాతని చావువేళ నీ
సొగసుల కూతు పెండ్లియగుచుండును బంధమదేమి యిర్వురే
తెగలకు చెందువారలో ప్రదేశము లెయ్యెడనుండి వచ్చిరో
సుగమము కావు భాషలొకచోటున నిర్వురు కూడియుండినన్"

ఇలాగే యీ కవితలో "భారతమన్నదే పరమపావననామము" అని ప్రతిపాదించడం హృదయాహ్లాదకరం.

సిరిప్రెగడ భార్గవరావుగారు కవిగారి ముఖ్యశిష్యులు. గురుభక్తి పరాయణులు. వారు మరణించినపుడు శిష్యవాత్సల్యంతో చలించి పోయిన రత్నకవిగారి గుండెలోతులనుండి భార్గవుని స్థితిని తెలియ జేసే తొమ్మిది పద్యాలు వెలువడ్డాయి. ఇవి అముద్రితాలు. కవిగారి విలాపాన్ని చూడండి —

"జీవితమన్నచో ప్రబలచింతలు దుర్భరవేదనల్ నిరా
శావళు లంతులేని విపదబ్ధులు నా ప్రవిరోగముల్ రుజల్
చావులు కంటినీళులు విచారములున్ కృశియింపుచున్ యిటే
జీవితమన్న నీ కిచట చిక్కనదెట్టి ప్రశాంతి భార్గవా"

"సుఖలిప్స" యనునది ఏడు పద్యముల కవిత. సుఖంకోసం అఱ్ఱులుచాస్తూ బయటి ప్రపంచంలో తిరగడం వ్యర్థమని, ఆధ్యాత్మిక సుఖమే సుఖమని యిందులోని బోధ.

"అంతర్లోక విశాలవీధుల మనోహంసమ్ము స్వేచ్ఛాదశ
ప్రాంతమ్ముల్ తిరుగాడియాడి స్థిరభావ ప్రాప్తసల్లగ్నవి
శ్రాంతింబొందుటలో లభించుసుఖమే శాంతమ్ముగా శాశ్వతా
నంతానంద పదమ్ముగా దెలిపి రుద్యత్సాధకుల్ తాపసుల్"

"ఆంధ్రుడెవ్వడు? అనాంధ్రుడెవ్వడు?" అనేది కవిగారి వచన గేయం. "వెఱ్ఱివాడా విసము గ్రక్కకు, ఆంధ్రుడెవ్వడనాంధ్రుడెవ్వడు?" అనే పల్లవితో యీ కవితసాగింది.

"త్రిలింగము తెలుంగై నది
తెలుగు తెనుగాంధ్రమ్ములౌకచే
అర్థమిచ్చెడి వేరువేరగు
పేరులన్ పొందియున్నవి"

పెద అమ్మయ్య ద్వితీయ పుత్రుని వివాహము 25-5-1972 దినాన జరిగినది. ఆ సందర్భంలో కవిగారు వరుని యాశీర్వదిస్తూ పంచ రత్నాలు వ్రాసారు. ఈ పంచరత్నాలనుండి "దేవతలు వధూవరులకు శుభములు కలుగ జేయవలె"ననెడి యీ క్రింది పద్యాన్ని చూడండి—

"కలువలఱేడ శ్రీసతికి కాంతుడ భారతి భర్త పార్వతీ
లలనమగండ పెండ్లియని లాస్యములాడు వధూవరుల్ సుఖం
బొలయగ దీవనల్ సలిపియున్నతులౌటకు పూలుజల్లి యీ
కులములు రెండు పెంపుగొన కూర్చుడు నా శిషులిట్టిపట్టులన్"

శ్రీ కొండూరి వెంకయ్యగారి కుమార్తె వివాహం 7-2-1979 నాడు జరిగింది. ఆ సమయంలో చదివిన నవరత్నాలనుండి వధూవరులు లక్ష్మీనారాయణులను భావంగల యీ పద్యాన్ని ఆస్వాదించండి —

"ఓ రమా నీకు కన్యాత్వమూడిపోయి,
ధర్మపత్నీత్వమిచ్చెడి తరుణమిద్ది
లక్ష్మినామమ్ము దాల్చిన లలనవీవు
విష్ణునామకుడగు పతి వెలసె నీకు"

1-6-72 నాడు శ్రీమంచికొండ లింగయ్యగారు ద్వితీయ పుత్రునికి వివాహం చెయ్యడం ఆ సమయంలో రత్నకవిగారు పంచరత్నాలలో ఆశీర్వదించడం జరిగింది. వాటిలోని యీ క్రింది పద్యం పరమ రమణీయం. ఈ ఆశీర్వచన పద్యాలలో గూడా కవిగారి కవితామాధుర్యాన్ని గుర్తింపవచ్చు.

"బాలుడ భిక్షమయ్య! అదె బాలిక సూర్యకళాఖ్య భార్యకా
జాలెను నీకు భిక్షుమయి జల్లగ భర్తగ చెంత జేర్చగా
జాలితివోయి సూర్యకళ చక్కగ దంపతులైర మీరు మీ
పాలును గాంచగావలెను పాపలనింక సమాహితాత్ములై"



---

1. "ప్రకృతి సౌందర్యసుమములో ప్రణయరసమొ,
జీవనంబు .... .... .... .... ...." (ప్రణయవాహిని)

2. "ఇది భరతభూమి నీ పుణ్యమేదియొ పండి
భారతీయుడ వైతివి .... .... .... ...." (మైనాదేవి)

3. "పరమపావన సూత్ర సంబద్ధమైన
దార్యధర్మము .... .... .... .... ...." (మైనాదేవి)

# CHAPTER-III

# ఆధ్యాత్మిక పద్య గద్య గ్రంథవళులు

బాదరాయణుడు పరబ్రహ్మమును బోధించుటకై నాల్గు అధ్యాయములలో బ్రహ్మసూత్రములను రచించెను. "అథాతోబ్రహ్మ జిజ్ఞాసా" "జన్మాద్యస్యయతః" "శాస్త్రయోనిత్వాత్" "తత్ సమన్వయాత్" అనునవి బ్రహ్మసూత్రములయందలి ప్రారంభ సూత్రములు ఈ నాల్గింటికీ చతుస్సూత్రియని పేరు. ఈ బ్రహ్మసూత్రములకు శంకర మధ్వ రామానుజులు అద్వైత ద్వైత విశిష్టాద్వైత పరములుగ సద్వ్యాఖ్యానములనొనరించిరి. ఇందలి భావములు దుర్బోధములగుటచే ప్రాకృతులకుగూడ నందలి భావములను తెలియజేయుటకై వానిని సరళగద్యమున ననువదించిరి. ఈ శాస్త్రమునుగూర్చి కవిగారికి దృఢానురాగము గలదు.

"ఈక్షతేర్నాశబ్దమ్" అను సూత్రములకు శంకరభాష్యమెటులున్నదో గమనింపుడు.

"నచసాంఖ్య పరికల్పితమచేతనం ప్రధానం జగతః కారణం శక్యం వేదాన్తే ష్వాశ్రయితుమ్, అశబ్దం హి తత్. కథమశబ్దత్వమీక్షతేః? ఈక్షితృత్వ శ్రవణాత్కారణస్య. కథమ్ ఏవం హి శ్రూయతే – సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీదేకమేవా ద్వితీయమ్-ఇత్యుపక్రమ్య తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజోఽసృజత ఇతి ..... ....."

ఇట కవిగారి రచనమాలకింపుడు —

"ఈక్షతేః = శ్రుతియందు ఈక్షధాతువుయొక్క ప్రయోగముండుటవలన, అశబ్దమ్ = శబ్దప్రమాణశూన్యమైన ప్రధానముఅనగా త్రిగుణాత్మకమైన జడప్రకృతి, న = జగత్తునకు కారణముగాదు.

ఉపనిషత్తులలో సృష్టిప్రసంగము వచ్చినపుడెల్ల "సఐక్షత లోకాన్నుసృజై '(ఐతరేయోపనిషత్)' 'తదైక్షత బహుస్యాం

ప్రజాయేయ' (ఛాందోగ్యోపనిషత్తు) అను దృష్టాంతములలో "ఈక్ష" ధాతుప్రయోగము కన్పట్టుచున్నది. ఈక్ష ధాతువునకిచట సంకల్పము అని అర్థము. ఈక్షణ చేతన ధర్మము. కావున త్రిగుణాత్మకమైన జడప్రకృతికి లేక ప్రధానమునకు ఈ ధర్మమున్నట్లు శబ్ద ప్రమాణములేదు. అందుచే ప్రధానము జగత్తునకు ప్రధానకారణము గాదు.

ఇట్లే మఱియొక సూత్రమును గాంచుడు —

"తదభావో నాడీషు తచ్ఛ్రుతేరాత్మనిచ" (13-2-2)

దీనికి శంకరభగవత్పాదాచార్యులవారి భాష్యమిట్లున్నది —

స్వప్నావస్థాపరీక్షితా సుషుప్తావస్థేదానీం పరీక్ష్యతే. తత్రైతాః శ్రుతయోభవన్తి. క్వచిచ్ఛ్రూయతే- తద్యత్రైతత్సుప్తః సమస్తః సుప్రసన్నః స్వప్నం న విజానాత్యాసు తదానాడీషు సుప్తోభవతి ఇతి అన్యత్ర తు నాడీరేవానుక్రమ్య శ్రూయతే - తాభిః ప్రత్యవసృప్య పురీతతి శేతే" తథా అన్యత్ర నాడీరేవానుక్రమ్య తాసు తథాభవతి యదాసుప్తఃస్వప్నం న కంచన పశ్యత్యథాస్మిన్ ప్రాణఏవైకధాభవతి. తథాఽన్యత్ర "యఏషోఽంతర్హృదయ ఆకాశస్తస్మిన్ శేతే." తథాఽన్యత్ర "సతాసోమ్య తదాసంపన్నో భవతి స్వమపీతో భవతి" ఇతి. ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించనవేద నాంతరమ్ ఇతి చ. తత్ర సంశయః— కిమేతాని నాడ్యాదీని పరస్పర నిరపేక్షాణి భిన్నాని సుషుప్తిస్థానాన్యాహోస్విత్పరస్పరాపేక్షయైకం సుషుప్తిస్థానమితి. కింతావత్ప్రాప్తం ? భిన్నానీతి కుతః ఏకార్థత్వాత్..........
...................................... ఇలా సాగిపోయింది శాంకర భాష్యం.

దీనికి రత్నకవిగారి గ్రంథాన్ని పరిశీలించండి —

తదభావః=సుషుప్త్యవస్థయందు ఆ స్వప్నదృశ్యమునకు అభావము కలుగును. ఆ సమయమున, జీవాత్మ, నాడీషు=నాడులయందు సంస్థిత

మగును. తచ్ఛ్రుతేః = ఆ విషయము శ్రుతులయందు చెప్పబడినది. చ=ఇంకను, ఆత్మని=ఆత్మయందుకూడ నుపస్థితమగును. "తద్యత్రై తత్సుప్తః .... " ఎప్పుడు జీవుడు శయనించునో, ఎప్పుడు స్వప్నము లుండవో అప్పుడు సర్వవిధముల సుఖియై నాడులయందు వ్యాపించి పాపస్పర్శలేని వాడగును. "అథయదాసుషుప్తో....ఎప్పుడు సుషుప్త్యవస్థ ప్రాప్తించునో అప్పుడతనికేమియు తెలియదు. శరీరమందలి డెబ్బదిరెండువేల హితనాడులు సమస్త శరీరమునందును వ్యాపించి యుండును. వాని యందు వ్యాపించి క్రమముగా నాడుల మూలస్థానమైన పురీతత్ అను హృదయస్థానమున శయనించును."స్వాప్నాంతమే" ఓ సౌమ్య ఆ సుషుప్తిసమయమందు జీవుడు సత్ తో సంపన్నుడు కాగలడు. "యత్రసమస్తః .... " ఆ సుషుప్తి కాలమందు పరమాత్మ స్పర్శ ప్రాప్తించును.

ఈ రీతిగ స్థాలీపులాకన్యాయముగ బ్రహ్మసూత్ర గ్రంధము సరసగద్యానువాదప్రక్రియద్వారా సుబోధము చేయబడి పఠితల నానందింప చేసినదో సోదాహరణము మూలముతో సంవదించి నిరూపింపబడినది. గ్రంధాంతమున కవి తన గ్రంధ వంశాదులగూర్చి ఇట్లు తెలిపెను.

"స్వామింగూర్చిన భక్తిసప్తతిపయిన్ సంధ్యానమస్సప్తతిన్
ప్రేమన్ గూరిచి బ్రహ్మసూత్ర తతికిన్ ప్రీతిన్ కవిత్వమ్ములో
ధామమ్మున్ రచియించి సప్తశతిసంధానించి సర్వేశనీ
యామోదమ్మును బొందజూచితిని చేతైనట్లు కృష్ణప్రభూ"

"వరసుబ్బాంబిక తల్లిగా విబుధుసుబ్రహ్మణ్యు నాతండ్రిగా
వ జన్మంబును గొన్నవాడ కవి వేంకటరత్ననాముండ నా
పరధామమ్మును జేర్చు సాధనముగా భావించి నిర్మించితిన్
పరలోకమ్ము గ్రహించి సంస్కృతి దరింపన్ వచ్చు కృష్ణప్రభూ"

"నాకున్ లోకులకున్ భవాంబునిధి సంతారమ్ముకై నావగా
శ్రీకంబౌ పరధామమందరియ నిశ్శ్రేణి స్వరూపంబుగా
వాకొంటిన్ ప్రభుసప్తశత్యభిధనీ భక్తిప్రశస్తిన్ బుధుల్
చేకొన్నన్ పఠియించినన్ ప్రభుకృపాశీస్సిద్ధి కృష్ణప్రభూ"

"జటిలమ్మైనది బ్రహ్మవిద్యయని తత్సారమ్ము గద్యస్ఫుటో
త్పటలమ్మున్ వెనువెంట జెప్పితిని సందర్శించి భక్తాళి ప్ర
స్ఫుట భావామృతపాయులై వరుసగా బొందన్ పరబ్రహ్మసం
తట వీలైనది సాధనమ్ముగొన సాధ్యంబౌను కృష్ణప్రభూ"

## సంధ్యా విద్య

ఇదియొక ఆధ్యాత్మిక గద్య గ్రంథము. సంధ్యావందన ప్రక్రియకు సరళ గద్యానువాదము. మంత్రములు వేదములగూర్చి అర్థరహిత పాఠముకంటె నర్థసహిత పాఠము గొప్పదని వృద్ధులనుచున్నారు. నిరుక్తమందు యాస్కమహర్షి యీ వచనము నిట్లుదహరించెను. —

"స్థాణురయంభారవాహః కిలాభూత్ అధీత్య వేదంన విజానాతి
యోఽర్థమ్
యోర్థజ్ఞ ఇత్సకలం భద్రమశ్నుతే నాకమేతి జ్ఞానావిధూత
పాప్మా"

కావున మంత్రార్థమును దెలియుట ఆవశ్యకము.

"ఆపః పునన్తు పృథివీం పృథివీపూతా పునాతుమామ్

"పునన్తు బ్రహ్మణస్పతిః బ్రహ్మపూతా పునాతుమామ్"

యనెడి మంత్రమునకు రత్నకవిగారి గద్యానువాదమును గాంచుడు—ఉదకములు స్వతస్సిద్ధముగా పవిత్రములైనవి. అట్టి ఉదకములు నాకు

ప్రాశనార్హములైన యుదకములనిచ్చునట్టి భూమిని పవిత్రము జేయుగాక. అట్లు యుదకములచే పవిత్రమైన భూమి నాకుదకములనిచ్చి నన్ను పవిత్రునిగా జేయుగాక. అట్లే నాకు బ్రహ్మోపదేశము జేసిన యాచార్యుని పవిత్రుని జేయుగాక. అట్లు పవిత్రుడైన యాచార్యుడు మంత్రోపదేశ మొనర్చి నన్ను పవిత్రునిగా జేయుగాక.

ఈ మంత్రమును తిలకించుడు —

"ఉద్యన్తమస్తంయన్తమాదిత్య మభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్ సకలం భద్రమశ్నుతే అసావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి య ఏవం వేద. అసావాదిత్యో బ్రహ్మ"

దీనికి రత్నకవిగారి సరసానువాదమిట్లున్నది —

"విజ్ఞాన సంపన్నుడైన బ్రాహ్మణుడు ఉదయించుచున్న అస్తమించుచున్న సూర్యుని ధ్యానించి ప్రదక్షిణము చేసినచో సమస్త శుభములను బొందుచున్నాడు. ఈ కనబడు సూర్యుడే పరబ్రహ్మమని తెలిసికొనినవాడు ఆ పరబ్రహ్మమే అయి బ్రహ్మైక్యమును పొందు చున్నాడు. ఈ సూర్యుడే పరబ్రహ్మము.

కర్మకాండను బోధించు 'సంధ్యావిద్య' ను గద్య గ్రంథముగా ననువదించి సాధారణులకు సైతము కర్మకాండ యందుత్సాహమును గలిగించిన రత్నకవిగారెంతేని ప్రశస్యులు.

## బ్రహ్మసూత్రములు-పద్యానువాదము

సరసకవితా ధురంధరులగు శ్రీ అంబటిపూడి వేంకటరత్న కవి గారు "సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ" యనెడి వాక్యముచే లక్షితమగు బ్రహ్మమును బోధించు బాదరాయణకృతబ్రహ్మసూత్రములను పద్య గ్రంథముగారచించిరి. ఇందు సూత్రమునకొక్క పద్యముండును. వీరే

గ్రంథమును యనువదింప సంకల్పించినను వీరి జిహ్వాగ్రమునుండి పద్య పరంపరలు శ్రవణానందకరముగా వెలువడును. సూత్రముల యందలి పూర్వపక్షసిద్ధాంతముల రెంటిని ఒకే పద్యమునందిమిడ్చుట సామాన్యులకలవగు పద్ధతిగాదు. అట్లని ఏ పద్యమునందును పూర్వపక్ష, సిద్ధాంతములనిముడ్చు శ్రమయును గానంబడదు. నిరంతరకృష్ణపదారవింద సంధ్యావందన పూతచేతస్కులగు కవిగారు శ్రీకృష్ణానుగ్రహము చేతనే యిట్టి గ్రంథమును రచింపగలిగిరని చెప్పవగును. బ్రహ్మసూత్రములను, సంధ్యావిద్యను కృష్ణస్తుతినిగలిపి ఏడువందల పద్యములతో సప్తశతిని కూర్చిరి గ్రంథత్రియరూపమైన సప్తశతి వారి యారాధ్య దైవమగు నందగోపాలకునికే నంకిత మొనర్చి యభీష్ట దైవాను గ్రహమును బడసిరి కృష్ణస్తుతిభక్తిని, సంధ్యావిద్య కర్మను, బ్రహ్మ సూత్రములు జ్ఞానమును బోధించును. ఇవి త్రివిధమార్గ దర్శక గ్రంథములు. బ్రహ్మసూత్రార్థమును పద్యములలో రచింప బూనిన వేంకటరత్నకవిగారు ప్రారంభమున నిట్లనిరి. —

"శ్రీమద్వ్యాసమునీంద్ర నిర్గతవచశ్శీనిర్మిత బ్రహ్మసూ
త్రామర్త్యమ్మగు దర్శనమ్ము నరజాత్యానందధామమ్ము సు
త్రామాది త్రిదివస్థులైన గొన సత్పాప్యమ్ము జన్మాది పీ
డామూర్తుల్ గ్రహియించి ముక్తులగు శ్రేష్ఠస్ఫూర్తి కృష్ణప్రభూ"

నరులకేగాక దేవులకును నానంద మొసంగు బ్రహ్మవిజ్ఞానమును జన్మాది బాధాతప్తులైనవారు గ్రహించి ముక్తులగుటకై తామీగ్రంథమును రచించుచున్నట్లు కవిగారు వాకొనిరి.

శమదమాదిషట్కసంపత్తి, ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము, ముముక్షుత్వము, విరాగిత్వముగల సత్పురుషునికి బ్రహ్మపదార్థ జ్ఞానము నొంది మోక్షము నందవలెననెడి కాంక్షగలుగునని బ్రహ్మదర్శనము నందలి ప్రథమసూత్రము నిట్లు వతరించినారు — "అథాతో బ్రహ్మ

జిజ్ఞాసా" ఇట బ్రహ్మణోజిజ్ఞాసా బ్రహ్మజిజ్ఞాసాయని కర్మణిషష్ఠిని జెప్పవలయునని, అథశబ్దమునకు శమదమాద్యానంతర్యమే యర్థమని శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారు వివిధ రమ్యార్థములను ప్రతిపాదించియున్నారు. సూత్రమందలి సారమును గ్రహించి రత్నకవి గారిట్లు పద్యానువాదమును చేసిరి. —

> "తమిమై నాలుగుసాధనమ్ముల బ్రశాంతస్వాంతుడై కర్మకాం
> డమునందృప్తిగొనంగ జాలక సదానందమ్ము వాంఛించి బ్ర
> హ్మమునందుంచి మనస్సు తద్విషయ జిజ్ఞాసార్త చేతస్కుడై
> విమలోదార విచారశీలుడగు జూవే జీవి కృష్ణప్రభూ"

సూత్రమందలి యథశబ్దమును శంకరులిట్లు వ్యాఖ్యానించిరి— "తస్మాదథశబ్దేన యథోక్తసాధన సంపత్త్యానంతర్యముపదిశ్యతే" అథ శబ్దమునకు సాధన సంపత్తిని బొందిన పిమ్మటయని అర్థము. అతః అను పదమునకు శంకరుల వ్యాఖ్య — "యస్మాద్వేద ఏవ అగ్నిహోత్రాదీనాం శ్రేయస్సాధనానామనిత్యఫలతాం దర్శయతి - 'తద్యథేహ కర్మచితో లోకః క్షీయత ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే (ఛాందోగ్య) ఇత్యాదిః" అనగా వేదోక్త కర్మలవలనగలుగు ఫలమనిత్యమే ననియు "బ్రహ్మవిదాప్నోతిపరం" అనుటచే బ్రహ్మజ్ఞానమువలన నిత్యఫలము కలుగుటవలన, యని అర్థము.

'తస్మాద్బ్రహ్మ విజిజ్ఞాసితవ్యమ్' అని శంకరభాష్యపంక్తి. బ్రహ్మము తెలిసికొనబడవలెనని భావము.

అథశబ్దమునకు శంకర వ్యాఖ్యానమును మనమున నిడికొని "తమిమైనాలుగు సాధనమ్ముల బ్రశాంత స్వాంతుడై" యనినారు. అతః అనుదానికి భాష్యమందలి "సారముతో కర్మకాండమున దృప్తింగొనజాలక" యనిరి. బ్రహ్మజిజ్ఞాసాయను దానిని "తద్విషయజిజ్ఞాసార్త చేతస్కుడై" యని యనువదించిరి.

భాష్యమందలి "నిశ్శ్రేయసంసారబీజావిద్యాద్యనర్థనిబర్హణాత్" యనెడి పంక్తిని 'ఆనందోబ్రహ్మ' యనెడి యొకానొక శ్రుతిని సందర్భోచితముగ, సూత్రాతిరిక్తముగ ననువదించుచు 'సదానందంబు వాంఛిరచి' యనిరి.

ద్వితీయ సూత్రమగు 'జన్మాద్యస్యయతః' యనుదానికి పద్యమిట్లు వ్రాసిరి.

"అతులాశ్చర్యకరమ్ము సర్వజగతీ వ్యాపార రూపాదిక
మ్మతలిర్పన్ రచియించి పెంచి తుదకున్మాలించి యెల్లన్ విలీ
నతనొందించుకొనంగ జాలిన మహోన్నత్యంబుతో వెల్గు ని
ర్మితియేదో అదె బ్రహ్మమౌనట విచారింపగ కృష్ణప్రభూ"

ఏతత్సూత్రార్థ వివరణమున శంకరులు తమ భాష్యములో "యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశన్తి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ" యని యుదహరించిన తైత్తిరీయశ్రుతిని మనమున నిడుకొని 'రచియించి పెంచి తుదకున్మాలించి' సృష్టిస్థితిలయాదులకు కారణభూతముగ బ్రహ్మమును నిర్దేశించి మూలకర్త యభిప్రాయము చెడకుండ ననువదించిరి.

"శాస్త్రయోనిత్వాత్" యనునది బ్రహ్మదర్శనము నందలి తృతీయ సూత్రము. "యథోక్తమృగ్వేదాదిశాస్త్రం యోనిః కారణం ప్రమాణం అస్యబ్రహ్మణః, యథావత్స్వరూపాధిగమే" యని భాష్యమందలి పంక్తిగలదు. బ్రహ్మమే ప్రపంచమునకు కారణమనుటకు శాస్త్రమే ప్రమాణమని అర్థము వీరి పద్యానువాదమిది. —

"పరమాత్మన్ గుణనామరూప రహితావ్యక్తమ్ముగా జెప్పుటల్
తిరమైయుండ జగత్త్రియల్ నెఱపువృత్తింజుట్టు పెట్టించునె

ల్లరు శంకింతురుగాని వేదముల జూడన్ వచ్చు నీయంతకున్
పరమే కారణమంచు రెంటనది సంబద్ధమ్ము శ్రీకృష్ణప్రభూ"

"తత్తుసమన్వయాత్" అనునది వేదాంత దర్శనమందలి చతుర్థ సూత్రము. త్రివిధ కారణములయందు పరబ్రహ్మము ప్రపంచమున కుపాదాన నిమిత్తము అగును. ఈ విషయము శాస్త్రసమన్వయ ముచే తెలియనగును.

దీనికి అనువాదపద్యము —

"అదియే కారణమెట్టులౌనన నిమిత్తాఖ్యంబుపాదానమా
పదమందన్వయముంగుదుర్చుమని విద్వత్పూచితమ్మయ్యె న
య్యాదియీవిశ్వమునందు నెల్లయెడలన్ వ్యాపించెతద్వ్యాప్తితే
నిది లేదంచు శ్రుతుల్ వచించునిది వర్ణింపంగ గృష్ణప్రభూ"

"ప్రకృతిశ్చప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్" (1 అ. 4 పా 23 సూ).

బ్రహ్మమే జగత్తుకుమృదాదివదుపాదానకారణమగునని మరల నదియే కులాలాదివన్నిమిత్త కారణమగునని, "ఉతతమాదేశమప్రాక్ష్యః యేనా శ్రుతం శ్రుతం భవత్యమతంమతంవిజ్ఞాతమ విజ్ఞాతమ్" యనెడి ప్రతిజ్ఞ వలనను "యథాసోమ్యై కేనమృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" అనెడి దృష్టాంతమున దెలియు చున్నదని సూత్రమునకు భావం, దీనిని కవిగారిట్లనువదించిరి.

"శ్రుతమౌన శ్రుత మెట్లనన్ దెలియవచ్చున్గా ప్రతిజ్ఞార్థ మే
గతినేకమ్మగు మృత్కణంబు నెఱుగంగా సర్వమృజ్ఞాన మొం
దితి దృష్టాంతము దీనినంద్రునిటులీ ద్విస్థానముల్ వైరరు
క్తిలేకుండుటచేత బ్రహ్మమెయుపాదానమ్ము కృష్ణప్రభూ"

ఈ యనువాదమున సూత్రార్థము స్ఫుటముగ ప్రతిపాదింప బడుటయేగాక నిమిత్తోపాదానములకు లోకమందుగల వైరమిట యీ పాదింపబడరాదని శాస్త్రప్రామాణ్యముగలదని గూడ సూచించినారు. అనుమానప్రమాణము వేదమును సమర్థింప వలయునేగాని దానిని భేదింపరాదని భారవి 'బలాదనుమానేన న చాగమః క్షతః' అనియు 'సుకృతః పరిశుద్ధ ఆగమః కురుతే దీపఇవార్థ దర్శనమ్' అనియు చెప్పి యున్నాడు.

"తదనన్యత్వమారంభణశబ్దాదిభ్యః" (2 అ. 1 పా. 14 సూ.).

జగద్బ్రహ్మములకు అభేదమేగలదని "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" అను శ్రుతియందలి అరంభణ పదము "ఐతదాత్మ్యమిదంసర్వం" అను శ్రుతియు ద్యోత్యము చేయు చున్నవి. భాష్యమందలి — 'వికారోఘటః శరావః ఉదంచనం చేతి' నతు వస్తువృత్తేన వికారో నామకశ్చిదస్తి. నామధేయమాత్రం హ్యేతదనృతం మృత్తికేత్యేవ సత్యమ్" అను పంక్తి నాధారముగా గొని చేసిన కవిగారి యనువాదమును గాంచుడు —

"ఒక మృత్పిండము కుండమూకుడను పేర్లొందంగనేమాయెనం
తకు సర్వమ్మును మృత్తికేకదనన్యత్వంబు కన్పట్టదే
ప్రకృతిన్ బ్రహ్మమునుండి పుట్టినదిగా భావింప నారెంటికిన్
ప్రకటమ్మయ్యె ననన్యభావము శ్రుతిప్రోక్తి కృష్ణప్రభూ"

"వ్యాప్తేశ్చ సమంజసమ్"

ఈ సూత్రార్థమునంతయు వివరించి శంకరులవారు సారాంశముగ నిట్లనిరి. —

"అతశ్చవ్యాప్తేః హేతో రోమిత్యేతదక్షరమిత్యేతస్యోద్గీథమిత్యేతత్ విశేషణమితి సమంజసమేతన్నిరవద్యమిత్యర్థః." ఈ పంక్తి

అర్థము - వేదముల యందు సర్వత్ర ఓంకారము వ్యాపించియుండుట చేత ఓంకారమునకు ఉద్గీథమనునది విశేషణము. ఈ అధికరణప్రారంభమున ఈ అర్థమంతయు "వేదేషువ్యాప్త ఓంకార ఉద్గీథేన విశిష్యతే" అని సూచింపబడినది.

ఈ భావమును రత్నకవి,

"తగవేదమ్ములనెల్లనోంకృతులు వ్యాప్తమ్మయ్యెనవ్వానిలో
దగునేయోంకృతి ధ్యానమందనిన నధ్యస్తమ్ము సామమ్ము నం
దొగి నుద్గీథములోని భాగముగ నయ్యోంకారమంచున్ వచిం
పగ ఛాందోగ్యమదే సమంజసముగా భావింతు కృష్ణప్రభూ" అని

అనువదించిరి.

"భోగేన త్వితరేక్షపయిత్వా సంపద్యతే" దీనికి శంకరవ్యాఖ్య
"ఇతరేత్వనారబ్ధకార్యే పుణ్యపాపే ఉపభోగేన
క్షపయిత్వా బ్రహ్మసంపద్య
తే తస్యతావదేవ చిరంయావన్నవిమోక్ష్యేஉథ
సంపత్స్యే బ్రహ్మైవ
సన్ బ్రహ్మాప్యేతి ఇతిచైవమాదిశ్రుతిభ్యః" ఆరబ్ధ కర్మల వలన కలుగు పుణ్యపాపములనుపభోగమువలన నశింపజేసికొని యోగి పరబ్రహ్మమగును.

"వెలయున్ కర్మలు మూడు తీరులెవుడో వెన్బడ్డ జన్మమ్ములో
గలదానిని వచియింపనెట్లనగ ప్రాక్ప్రారబ్ధ మీ జన్మలో
ఫలభూతమ్మగు సంచితమ్ముకలుగన్ భావ్యర్థమాగామిగా
విలయమ్మొందును రెండుమూడును మొదల్ వేధించుకృష్ణప్రభూ"

ప్రాకృతులకుగూడ వేదాంతార్థమునందించుటకు వీరుపయోగించినశైలి సరసమై సర్వులకీశాస్త్రమున అభిరుచికల్గించునటుల యొప్పారుచున్నది.

## సంధ్యావిద్య (పద్యానువాదము)

శ్రీ అంబటిపూడి రత్నకవిగారు సంధ్యావందనమందలి మంత్రముల భావమును సరళ గద్యమున ననువదించుటయేగాక పద్యముల యందును భావముల గూర్చిరి. గాయత్రీ మంత్రమిట్లున్నది—

"ఓంభూః ఓంభువః ఓంసువః ఓంజనః ఓంమహః ఓంతపః ఓం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహిధియో యోనః ప్రచోదయాత్"

పైసప్తవ్యాహృతులను గాయత్రీమంత్రమును గలిపి ఒకే పద్యమున యెంత సరళసుందరముగా ననువదించిరో తిలకించుడు —

"భూలోకమ్ము భువమ్ము స్వర్గము మహమ్మున్ పై జనాఖ్యమ్మునా
పై లోకమ్ము తపమ్ము దానిపయినొప్పున్ సత్యమీరీతి నా
యాలోకమ్ముల సృష్టిజేసిన వరేణ్యంబైన తేజమ్ముతో
నాలో బుద్ధి నిరేచు సూర్యునిగనిన్ ధ్యానింతు గృష్ణప్రభూ"

"అపోహిష్ఠామయోభువస్తాన ఊర్జేదధాతన
మహేరణాయ చక్షసే యోవశ్శివతమోరసః
తస్యభాజయతే హనః ఉశతీరివమాతరః" దీనియనువాదమిది—

"అవనిన్ మాకుసుఖమ్ము గూర్చునది గానన్నమ్ము స్థాపించుసం
స్తవనీయమ్మును సుందరమ్మునగు విజ్ఞానాంబకమ్మిచ్చునె
క్కువ కల్యాణదమైనయట్టి రసమున్ గూర్చున్ చనుల్ జేసి శై
శవమందంబిక పాలు పిల్లకిడువిచ్చున్ నీరు కృష్ణప్రభూ"

"తస్మా అరంగమామవః యస్యక్షయాయ జిన్వథ ఆపోజనయ

ధ్యానః దీని యనువాదమిట్లున్నది.

"ఆపోదేవతలార! అరసము మీస్వాధీనమందుంటచే
మాపాలొందగజెల్లు తద్రసము సన్మానింతు మిమ్మెప్పుడున్
మాపంటల్ పరివృద్ధినొందుత కుటుంబవ్యాప్తియాగావుతన్
మాపుట్టున్ రసిద్ధమేయనుచు బైమార్జింతు కృష్ణప్రభూ"

సంధ్యావందనసమయమున గాయత్రీధ్యాన శ్లోకమిట్లున్నది—

"ముక్తావిద్రుమహేమ నీలధవళ చ్ఛాయైర్ముఖై స్త్రీక్షణై:
యుక్తా మిందు నిబద్ధ రత్నమకుటాం తత్త్వార్థవర్ణాత్మికాం
గాయత్రీం వరదా భయాంకుశ కశాశ్శుభ్రం కపాలంగదాం
శంఖం చక్ర మథారవింద యుగళం హస్తైర్వహంతీం భజే"

ఈ ధ్యానశ్లోకమును సరసహృదయులైన కవిగారెట్లనువదించిరో చూతుడు—

"ముత్తెంపుంపవడంపు పైడి వసనల్పుం దెల్పు మోముల్ కనుల్
పొత్తన్ మూడు కిరీటమందు నెలకాయన్ సర్వవర్ణాత్మచే
నొత్తున్ దావరదా భయాంకుశకశల్ వ్యుద్యత్క పాలిగదల్
మొత్తన్ శంఖము చక్రమంబుజ యుగమ్మున్ దేవి కృష్ణప్రభూ"

సూర్యధ్యానమందలి "ఆసత్యేనరజసావర్తమానో అమృతం మర్త్యంచ హిరణ్యయేన రథేనా దేవో యాతి భువనాని పశ్యన్" అను సూర్య మంత్రమునకు కవిగారి యనువాద మిట్లు సాగినది—

"సత్యాపూర్ణ రజస్సుతోడ నరులన్ స్వర్వాసులన్ నింపితా
నత్యాశ్చర్యకర మ్మునౌ రథమునందారూఢుడై సర్వలో
కత్యస్థావర జంగమాది గతులీక్షల్ సేయు సూర్యుండొగిన్
ప్రత్యాయాతుడదే దివమ్మున జనన్ దర్శింతు కృష్ణప్రభూ"

నైష్ఠికులు సంధ్యావందన మాచరించిన పిదప "జనార్దనుని నుతించి సర్వవేద ఫలమును, సర్వతీర్థ ఫలమును బొందును. వాసుదేవుని వలన అన్నిలోకములు వాసితములైనవి. అన్నిలోకములకు నిలయుడగు వాసుదేవునికి నమస్కారము" నేడి భావముగల యీ క్రింది శ్లోకముల పఠింతురు....

"సర్వవేదేషు యత్పుణ్యం సర్వతీర్థేషు యత్ఫలమ్
తత్ఫలం పురుష ఆప్నోతిస్తుత్వా దేవం జనార్దనమ్
వాసనాద్వాసు దేవస్య వాసితంతే జగత్త్రియమ్
సర్వభూతనివాసోసి వాసుదేవ నమోస్తుతే"

వీనిని సరస మధురముగ సుందరముగ నిట్లనువదించిరి ....

"కలదే పుణ్యము సర్వవేదములలో గన్పట్టు దీర్థాళిలో
ఫలమేదోయది నిన్ను భక్తి గొలువన్ ప్రాప్తించు నీవాసనన్
గలుగన్ వాసితమై జగత్త్రియము కృష్ణా సర్వభూతస్థగో
కులవాసీ వసుదేవజా ప్రణతి చేకోవయ్య కృష్ణప్రభూ"

"జన్మాంతరాదేవ కృష్ణే భక్తిర్మనస్వినాం" అను న్యాయము ననుసరించి శ్రీ పరబ్రహ్మస్వరూపుడగు శ్రీ కృష్ణునియందు భక్తి జన్మాంతర సంస్కారము వలననే కలుగును.

సహజ కృష్ణభక్తులగు కవిగారు యీ పద్యములలో కృష్ణప్రభూ యను మకుటమును జేర్చి శ్రీ కృష్ణునికే కృతినిచ్చుట ప్రశంసార్హము. సంధ్యావందనాంతమున సహజముగ వాసుదేవుని నమస్కరింతురు. గ్రంథము కృష్ణపరముగనే సాగుట విచిత్రము. "మయ్యేవ మన ఆధత్స్వ" యను కృష్ణునిమాట పాటించిరి.

## ప్రభుసప్తతి

శ్రీ కృష్ణభక్తి వశంవదులైన రత్నకవిగారు భక్తిభావబంధు రంగా డెబ్బది పద్యములను కృష్ణప్రభూయను మకుటమున రచించి

కృష్ణసప్తతి యను గ్రంథమును రచించిరి. కవిగారు ఉప్పలపాడు గ్రామమున కేగిన సమయమున మతుకుమల్లి నరసింహాంగారి హనుమత్స్తోత్రావళిని జూచి, ప్రాతః కాలమున కృష్ణధ్యానము సేయుసమయమున ఈపుస్తకమును వ్రాసిరి. వీరి గ్రంథమును చీరాల నగరమునందలి శ్రీ పెంటేల బలరామయ్యగారు జూచి ముద్రణ సాహాయ్యమును జేసిరి. మిత్రుల యభీష్టానుసారము యిందలి పద్యములకు కవిగారే టిప్పణిని రచించిరి. ఈగ్రంథము "సాహితీమేఖల" రజతోత్సవ సమయమున ప్లవనామ సంవత్సర రథసప్తమినాడు విడుదలచేయబడినది.

ప్రభుసప్తతి యందలి ప్రారంభ పద్యమిట్లున్నది.—

శ్రీదమ్మై భవసాగరోడుపమునై చిన్మూర్తమై జీవన
హ్లాదమ్మై సకలార్తినిర్హరణ దివ్యన్మంత్రమై యొప్పిన
మోదమ్మిచ్చు నటంచు సంధ్యల ద్విజుల్ ముప్పూటకృష్ణార్పణం
బో దేవా యని నున్న బిల్చునెడ బిల్చుల్ విందు కృష్ణప్రభూ"

ఎవ డేవిధమైన మార్గాన్ననుసరించినా శ్రీకృష్ణుని చేరుతారు. మహిమ్నస్తవంలో—

"రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిలనానాపథ జుషాం
నృణా మేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ" అని యీభావమే ప్రతిపాదింపబడినది గదా. ఇంకా కవిగారిలా అంటారు—

"భావోదాత్తసు ధీవిధాయకములో బ్రహ్మను సంధానదీ
తావైవశ్యముతో సుఖమ్ముగొననో కాలమ్ము కృష్ణప్రభూ"

కాంతిభాసితములైన హిమానీ శీకరములు భూమి కాంత ధరించిన నగలని వర్ణించుట కవిగారి భావనాపటిమకు, కవితాహృదయ

స్పందనమునకు ప్రతీకయనవచ్చును. సహృదయులారా! ఆవర్ణన గాంచుడు—

"హిమబిందుల్ ప్రతిపత్ర మందుబడి బాలేనప్రభాపాళిచే
విమలచ్ఛాయలు గ్రక్కు ముత్తెములుగా విద్యోతితమ్ముల్ ధరా
రమణీగాత్రము నిండ వెల్గు నగలన్ రాణించు నట్టుల్ కనన్
గమనీయమ్ములు ప్రొద్దుకెంపు జిగిమొగ్గల్ వేయ కృష్ణప్రభూ"

"సంసారే రే మనుష్యావదత యదిసుఖం స్వల్పమప్యస్తి కించిత్"

యని సంసారమున స్వల్పముగనైనను సుఖములేదని భర్తృహరి మహాకవి తన వైరాగ్య శతకమున నుడివినాడు. ఈ భావమునే కవిగారెట్లు చిత్రించిరో గాంచుడు —

"అంతర్లోకములో మనస్సు ఖగతుల్యంబై బహువ్యాపకా
నంతవ్యోమ పథమ్ములందిరుగు నాశాంతమ్ములందాక నా
వంతైనన్ నిలుపోవదీచపల మాయాసారధిన్ నమ్మి పో
నెంతైనన్ శ్రమియించు దేహము సుఖమ్మెచ్చోటఁ గృష్ణప్రభూ"

శరీరములు అంతస్సీమలో పడు గాలిగుమ్మటములనుట కడుం గడు హృదయంగమము. నిర్వేదమును బోధించు నీ వర్ణనము రసానుకూలము. "ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా" యని గదా ధ్వనికారుని యనుశాసనము. ఈ కావ్యమున మనోదర్ప ప్రభావము వర్ణింపబడినది.

"ప్రకృతింజూచి గ్రహింపవచ్చు బహుధర్మమ్ముల్" యనెడి పద్యభాగము "సముద్రాదులు పదునెనిమిది మంది గురువులు గలరని, వాని నుండి గ్రహింపవలసిన విషయములు గలవ" నిబోధిం చేసి శ్రీమద్భాగవత గ్రంథమును దలపింప జేయుచున్నది.

రత్నకవిగారి యీరచనమున ధారాశుద్ధి సామాన్యులకుగూడ నర్థమగురీతి సర్వత్ర చూడనగును. "ద్రాక్షాపాకస్స కథితః బహిరంతస్స్ఫురద్రసః" యని ద్రాక్షా పాకలక్షణము. ఝుటితిత్యర్థ స్ఫోరకమై రసనిర్భరమైనది ద్రాక్షాపాకము. కావ్యమంతయు నిట్టి ద్రాక్షాపాకమునందే నడచినది.

"తథా శరీరాణి విహాయజీర్ణా అన్యాని సంయాతినవానిదేహీ" యను గీతాభావము "ఆత్మదేహములు దాటంబోవు" యను చోట గానవగును. జీవుడు సాలెపురుగు వంటి వాడని ముప్పదిరెండవ పద్యమున జెప్పబడినది. "యోగి పతివ్రతాతుల్యుడ"నుట వేదాంతదర్శనమందలి మహోన్నత్యమును దెలుపుటయే.

కవిగారు పద్యరచనమున వెనుకకు దిరిగి చూడవలసిన యవసరమే లేకుండ భావమును నడింపింపగలరని యీక్రింది పద్యముద్వారా నిరూపింపబడు చున్నది. ప్రాకృతులకును కావ్యరసమున నాదరమును గల్పింప సమర్థులు.

"నిను భావించు విధానముంగనక కన్నీరోడ్చి యవ్యక్తరీ
తిని నేమెుగణించి చిక్కక మహార్తింగుంద నేలారణో
ర్వివని గాండీవికి బోధజేసిన బుధశ్రేష్ఠుండవై విశ్వమూ
ర్తిని జూపించిన నిన్ను లోనిలిపి తృప్తింగొందు కృష్ణప్రభూ"

"ఆడించెదవు బొమ్మలాటకాడునుబోలె" యని శ్రీ కాసుల పురుషోత్తమ కవి చెప్పియుండ, రత్నకవి "బ్రదుకున్ బొంగరమట్లు ద్రిప్పు" నను భావము నభివ్యక్తీకరించిరి. "మకరందమును పూలపాల" నినవ్యకవులు వాడి భావనవ్యతను సాధించిరి. కవిగారు లౌకికోదాహృతిని జూపి భావనవ్యతను చూపిరి.

"మయ్యేవ మన ఆధత్స్వమయి బుద్ధిం నివేశయ"
"అనన్యాశ్చింతయన్తో మాంయేజనాః పర్యుపాసతే"

"తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్" యనెడి గీతాపంక్తుల భావము వీరి యాక్రింది పద్యభాగమున గోచరించును.

"సతమునీయందే సమాయుక్తులై లీనుల్గాగ తదీయ సంభరణమో
విందాల్తు నన్నట్టి నీయానన్ నమ్మినవాడు ధన్యుడని నాయారూఢి"

"చేదులు పండ్లుగానగుటయబ్రమ్మోమి కృష్ణప్రభూ" యనిభగవత్సంకల్పానుసారము తీపి చేదుగ, చేదు తీపిగ మారవచ్చునని సూచించిన విధము యిదేయర్థముగల

"విషమప్యమృతం క్వచిద్భవేదమృతం వా విషమీశ్వరేచ్ఛయా" యనెడి కాళిదాసుని వాణిననుసరించు చున్నది.

చేదు తీపిగ రుచ్యముగ మారవచ్చుననుటకు వీరుచూపిన లౌకికోదాహరణము రవంత హాస్యమును వెలార్చుచు రమణీయముగనున్నది.

"ఒగరుల్ రేగులుపండి తీపిగొనగా నొప్పున్ భుజింపంగఁజేఁ
దుగనున్నట్టివి కాకరల్ తఱిగి యందుంగా రముంబెట్టి వం
డగరుచ్యమ్ముగు కూరగాందనరుచుండన్ జూడమేనేడుచె
డ్డగసిద్ధించిన కర్మపక్వమయి పండన్ వచ్చు గృష్ణప్రభూ"

"దేహోదేవాలయః ప్రోక్తః" యనుతత్త్వము "బడలే దేవళమాను" యనువాక్యముద్వారా యిందు ప్రతిపాదింపబడినది.

"పంథానో బహవో లోకే కర్మణాం సిద్ధిహేతవః" యనునది "బహుమార్గమ్ములు నిన్ను జేరుటకు విద్వత్సూచితమ్ముల్" యని చెప్పబడినది. కర్మమార్గము కంటెను భక్తిమార్గమున రత్నకవిగారికి అభిమానము మెండు.

"భక్త్యాత్వనన్యయాశక్యః ద్రష్టుమేవంవిధోఽర్జున" యని భక్తి సర్వోపాయముల యందు సులభ మార్గమని భక్తిచే భగవానుడు చూడఁబడునని గలదు. ఈ భావమునే కవిగారిట్లు వెలయించిరి-

"భక్తినీయెడఁ విశ్వాసమ్ము నూల్కొల్పుఁ బాపహారమ్మైనది ముక్తిగూర్చు సులభోపాయమ్ము".

"అనుమితికరణ మనుమానమ్" అనునది అనుమాన ప్రమాణ లక్షణము. ధూమాగ్నుల సాహచర్యమును కార్యకారణ భావమును గుర్తించి హేతువుచే సాధ్యము ననుమానించుటయే అనుమానప్రమాణ మగును. దీనినే సుందరముగ కావ్యమందు ప్రతిపాదించిన యది కావ్యాను మితియగును. కావ్యానుమితి చారుతాశాలియని మహాకవులు వ్యంగ్యార్థమును దీనిద్వారా స్ఫురింప జేయుదురని వ్యక్తి వివేకమున మహిమభట్టు వాకొనినాడు. ఈశ్వరుడే ప్రపంచమునకు కర్త. ప్రపంచేశులకు గల కార్యకారణమును విశ్వనాథ భట్టాచార్యుడు,

"నూతన జలధరరుచయే గోపవధూటీదుకూలచోరాయ
తస్మై కృష్ణాయనమః సంసార మహీరుహాస్య బీజాయ" యని

సూచించి యీశ్వర స్థితిని నిరూపించెను. కావ్యానుమితి చారుతాశాలిగ ప్రయోగించుచు కవిగారు ప్రపంచ కర్తృత్వముననుమానించుచు నిట్లనుచున్నారు—

"తల్లిందండ్రిని జూచి వారికగు సంతానమ్ము నీక్షించిత
త్సోల్లాసంబగు కార్యజాతమున హేతువ్యాప్తి గుర్తించి వి
శ్వోల్లాసంబున కాద్యహేతువులుగా నూహించి మాయేశులన్
ఉల్లేఖించివచో ప్రమాణమది కాకున్నెట్లు కృష్ణప్రభూ"

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు" యని కఠోపనిషత్తు నందు సావయవ రూపకముగలదు.

"మాతర్మాయే కుమతిభగిని హేపితర్మోహజాల" యని శిల్హాన మిశ్రుడు తన శాంతిశతకమున అమూర్తములకు రూపకల్పన జేసియున్నాడు. కవిగారి సావయవరూపక సమేతమగు నీక్రింది పద్యమునను అమూర్తములకు సుందర రూపకల్పన గోచరించుచున్నది.

"మనసేకామిని బుద్ధిమాత పరమాత్మజ్యోతియే తండ్రిజీ
వున కంతర్వ్యాతిలో గృహస్థజన కల్పుండేచు తత్తద్గితో
క్తిని విన్నన్ సుఖియౌను లేని యెడలన్ ఖేదించి ఖేదింపజే
యును భావానుగుణమ్ము లభ్యమగు శాంత్యుద్దీప్తి కృష్ణప్రభూ"

"ఆప్తవాక్యంప్రమాణమ్" "ఆప్తస్తుయథార్థోపదేష్టా" యని ఆప్తుడు యథార్థవక్తయని యాప్తవాక్యముపాదేయమని తర్కసంగ్రహమున కలదు. పరమాత్మ తండ్రియని, జీవుడు గృహస్థుడని, తండ్రి మాటవినని సుతుడు చెడునని పైపద్యమున రత్నకవి చెప్పుట శబ్దఖండమందలి ఆప్తవాక్య లక్షణమును స్మరింప జేయుటయే. బైబిలునందు తండ్రిమాటవినని కుమారుడు చెడునని సోదాహరణము చెప్పబడినది. కృష్ణునకు క్రీస్తునకు దగ్గర సంబంధము గలదని యనేక గ్రంథములందు గలదు. ఇట్టిగాథ పైపద్యమునగోచరించుచున్నది.

"నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా

తస్యాశ్శిఖాయా మధ్యేపరమాఽఽత్మా వ్యవస్థితః" యని పురుష సూక్తమున హృదయ పుండరీక మధ్యమున పీతవర్ణ శాంతిమధ్యమున పరమాత్మగలడని చెప్పబడిన భావము పఠితలకు భక్త్యావేశమున రోమాంచము గలుగునట్లీ క్రిందిపద్యమునం జెప్పబడినది. ఈమధురాతి మధురవర్ణనమును గాంచుడు——

"హృదయాబ్జంబున కష్టపత్రములు ద్వాత్రింశత్సుకింజల్కముల్
పొదలున్ సూర్యునిబింబమానడు మనోవృన్ దానిమధ్యన్ సుధా
భ్యుదయాంశుండగు చంద్రమండలము తద్గ్వాభమిన్ శిఖావత్ప్రిభా
ప్రదరమ్మొండట మధ్యపీతమగు భాస్వత్కాంతి కృష్ణప్రభూ"

"చంచలం హిమనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్" అని గీత యందు మనస్సు చంచలమనియు, "అభ్యాసేన తు కౌంతేయ" యని అభ్యాసముచే దానిని నిగ్రహింప వచ్చుననియు చెప్పబడినది. ఈభావ మును కవిగారిట్లు చెప్పిరి—

"చలమౌచిత్తము నిశ్చలమ్మగుట కెంచన్ మార్గమభ్యాసమం
దులకెన్నెన్నొ విధానముల్ .............................."

వివిధకవులు, భాగవతులు శ్రీ కృష్ణ భక్తులై యాతని మధుర రూపమును తనివిదీర వర్ణించి కృతకృత్యులైరి. కవిగారు శ్రీకృష్ణుని మధురమంజుల రూపమును వర్ణించి తాను తన్మయులగుటయేగాక మనలను తన్మయత్వమున నోలలాడించు చున్నారు. ఆవర్ణనము నొక సారి తిలకించుడు——

"అకాంతిన్ బహురత్నదీధితుల సొంపావిష్టమై యుండనం
దేకాంతమ్ముగ చంద్రకోటి సమభాసీహన్ శుభస్ఫాటిక
శ్రీ కమ్మైన ధగద్ధగిత మూర్తిన్ గొన్నవానిన్ నినున్
నాకాలుష్యము లో హటిల్లఁగని యానందింతు గృష్ణప్రభూ"

## ప్రభుసప్తతి (గద్యానువాదం)

ప్రభుసప్తతియను పేర శ్రీ కృష్ణుని సంబోధించుచు వ్రాసిన పద్యములకు మిత్రులకోరిక ననుసరించి గద్యరూపమున టిప్పణిని వ్రాసియుండిరి. కవిగారే వారి యభిప్రాయములను సోపపత్తికముగ వివరించుట యిందలి విశేషము. ఈటిప్పణి సరళసుందరమై యొప్పారు చున్నది. ఈక్రిందిపద్యమును చూడుడు —

"వివిధమ్ముల్ కుసుమమ్ములందుగల వేర్వేరైన మాధుర్యముల్
చవిగొల్పన్ గొని తేనెటీగలు మధుశ్రాయమ్ములం జేసియొ
క్కవిశేషమ్మగు సర్వసార మమరంగన్ గూర్చు నద్దానిలో
వివిధత్వమ్మెటుబోయెనే కతమె భావింపంగ కృష్ణప్రభూ"

ఈ పద్యానికి గద్యానువాదం యిలాసాగింది. —

"యథా సోమ్య మధుమధుకృతః నిస్తిష్ఠన్తి నానాత్యయానాం వృక్షాణాం రసాన్ సమవహార మేకతాంగమయన్తి" అని ఛాందోగ్యోపనిషత్తు చెప్పును. పూలు అనేకవిధములుగనున్నవి. ఒక్కొక్కదానిలోని మధువు యొక్క రుచివేరు. తేనెటీగలు ఈ భిన్నములైన మధుకణములను తెచ్చి తేనెతుట్టెలో కూర్చిపెట్టును. అది అన్ని పూలలో మధుకణముల సారము. అదియే తేనె. ఏకమైన తేనెలో భిన్నత్వమున్నదా? అట్లే సర్వగతాత్మ ఏకము.

''ఒకపత్రంబునవెన్కబూని తలపై కూగించి యూహించియిం
కొకపత్రంబును ముందు పట్టుకొని వెన్కొక్కెత్తునన్ లేపిముం
దుకు జేరున్ మఱియిట్లే పోవునది ముందుబట్టి వెన్కెత్తికీ
టకమొక్కండటు లాత్మదేహములు దాటన్ బోవు కృష్ణప్రభూ"

"తద్య థా తృణజలాయుకా తృణస్యాన్తం గత్వా అన్యమాక్రమ్య ఆత్మానము పసంహరతి ఏవ మేవాయమాత్మా ............ ఇదంశరీరం నిహత్య ........ అన్యమాక్రమ్య ఆత్మానము పసంహరతి" అని బృహదారణ్యకోపనిషత్తు చెప్పును. జలగవంటి ఒక కీటము ఒక ఆకుకొననుజేర తలయెత్తి యింకొకయాకును తలతోపట్టుకొని వెనుకభాగము నక్కడికి లాగుకొనును. అట్లే మఱియొక యాకుపైకి జేరుచు పోవుచునేయుండును. అట్లేయాత్మ ఒకశరీరము మరణింపగా నింకొక శరీరమును జేరి పోవుచునే యుండును."

ఈ అనువాదమునందు కవిగారికి గల బోధనానుభవము స్ఫుటమగుచున్నది. కొన్ని పద్యముల కనువాదము సేయునపుడు యాంగ్ల

గ్రంథములనుండి ప్రమాణముల దెత్తురు. అందుకుదాహరణముగా యీక్రింది పద్యానువాదము గాంచుడు—

"ఏనే మేఘపతత్త్ర పత్త్రములలోనే దైననాకాశసీ
మానీరాకర యాత్రలన్ సలిపి బ్రహ్మాండంబు వ్యాపించిరా
లేనాయంచు కవీశుడూహపడు నీలీలన్ గనంగోరినే
దేనేనయ్యెదనేట్లటంచు మదినూహింతేమొ కృష్ణప్రభూ"

"ఊహాజాలము చిత్రమైనది. "oh! lift me as a wave, a leaf a clould" అని షెల్లీ తన "ode to the west wind" లోచెప్పినాడు నేనేయొక మేఘమునో యొకపిట్టనో అయినచో ఆకాశమను మహా సముద్రముపై దీర్ఘయాత్రలు జేయుచూ సర్వము వ్యాపించి వత్తునే యని కవియనుకొనును. నాకును అట్టికోరికలు కలుగును. ఏమనగా సర్వేశ్వరుడవు నీవు. ఈవిశ్వము నీలీల. నీలీలలు నాకుదెలియవలయు నన్ననేను నీవైనచోకుదురును. అందుచే నేను నీవుగా యగుటయెట్లు అని యేమోయూహింతును."

వీరి యీగ్రంథమున నుపనిషత్తులనుండి గూడ ప్రమాణములు దహరించిన ఘట్టములు గలవు. ఈక్రింది పద్యము, తదనువాదము పరమ రమణీయములు.

"ఆకాంతిన్ బహురత్నదీధితుల సొంపావిష్టమై యుండనం
దేకాంతమ్మగ చంద్రకోటి సమభాసీహన్ శుభస్ఫాటిక
శ్రీకమ్మైన ధగద్ధగిత మూర్తిన్ గొన్నవానిన్ నినున్
నాకాలుష్యము లోహటిల్ల గనియానందింతు కృష్ణప్రభూ"

"ఆ బంగారుకాంతిలో యనేక రత్నకాంతులు చుట్టియుండును. దానినడుమకోటి చంద్రులవెలుగులో శుద్ధస్ఫటికముల యొక్క మెఱు

పుత్రో ధగధగలాడుచున్న నిన్ను నాసర్వపాపములు నశించునట్లు కాంచి యానందింతును.

"ప్రభామధ్య గతంపీతం నానారత్నప్రవేష్టితమ్
తస్యమధ్యగతం దేవం వాసుదేవం నిరంజనమ్

శుద్ధస్ఫటికసంకాశం చంద్రకోటి సమప్రభమ్" అని ధ్యానవిందూపనిషత్తు

"ఏకంశాస్త్రం దేవకీపుత్రగీతమేకోదేవో దేవకీపుత్రఏకః" అని రామానుజాచార్యులవారు చెప్పినట్లే కవిగారు శ్రీకృష్ణునియందే దృఢభక్తిని ప్రదర్శించి ధన్యులైరి. "శ్రేయఃప్రాప్తికరౌషధం పిబమనః శ్రీకృష్ణదివ్యౌషధమ్" అని ముకుందమాల యందు కులశేఖరాళ్వారుల వారు "మనసా శ్రేయఃప్రాప్తిని కలిగించునదియు నైన శ్రీకృష్ణుడనెడి దివ్యౌషధమును త్రాగుమని చెప్పిరి. రత్నకవిగారు వారిమనసుచే శ్రీకృష్ణామృతమును త్రాగి సహృదయులచే త్రాగించిరని చెప్పవచ్చును. లీలాశుకుని కృష్ణకర్ణామృతము నందువలె యీగ్రంథమున మృదుమధురపద విన్యాసము గాన్పించుచున్నది.

"వాసుదేవం పరిత్యజ్య యోఽన్యం దేవముపాసతే
తృషితా జాహ్నవీతీరే కూపం వాంఛంతి దుర్భగాః" అని పాండవగీతయందున్నది. కృష్ణుని విడచియితరుల సేవించువారు గంగను విడచి బావిని చేరువారు. కవిగారు శ్రీకృష్ణునే కొలిచి ధన్యులైరి.

---

1. భారత రక్తబిందువు ప్రపంచమునందెవడొందియున్న నా
వీరకుమారకుండు మృతి భీతికి లోగడు .... .... (మైనాదేవి)

2. మాతృసేవకు రాని సోమరి యొవండో (మైనాదేవి)

# CHAPTER - IV

## నాటకములు

## అకృతజ్ఞో నరః (నాటికా)

ఆంగ్లభాషయందు David Hore burgh వ్రాసినమూడంకముల "The Ungreatful man" అనునాటకమునకిది సంస్కృతీకరణము వేయి సంవత్సరముల క్రిందట యొకానొక దాక్షిణాత్యబ్రాహ్మణుడు గలడు. ఆతడు శాంతమనస్కుడు. ఆతడుకొంతకాలము కాశీనగరమందును, కొంతకాలము అరణ్యమునందును జీవించెను. మురళీవాదన పరాయణులైన కొందరు సోదరులతోను, మిత్రులతోను కలసి కాలముగడపుచుండెను. ఈతని భార్య కొంతకాఠిన్యమును వహించుచుండును. ఈతడు సోమరియైయితర బాలకులతో కలసి గోళీలనాడుచుండ, భార్యకోపించి ధనమును తెమ్మని శాసించును. జీర్ణవస్త్రములనెంతకాలము ధరింపగలనని భార్య నిందింప యీతడు సువర్ణమొట లభించునని తోడిబాలురనడుగును. వారీతని నవహేళనచేయుచు చెట్లక్రింద దొరకునని బింకముగ పల్కెదరు. ధనము దొరికిన యెడల మీకు గోళీలను దెత్తునని పల్కి బంగారము కొఱకరణ్యమును ప్రవేశించుటతో ప్రథమాంకము ముగియును.

ఆ బ్రాహ్మణుడట్లు విపినమున దిరుగాడుచు దొరకిన కందమూలాదుల భుజించుచు రాత్రుల వృక్షచ్ఛాయముల నిద్రించును. ఏకాకియై పిపీలికామశక బాధనందుచు సువర్ణము కొఱకు లతానికుంజముల యందును, పాషాణములందు నన్వేషించుచుండును. పిపాసితుడై కూపమును జేరనందుండి వరుని యాక్రందనము వినవచ్చును. ఇది ద్వితీయాంక గాథ.

భానుకాంతి ప్రసారితమైన జగతీతలము సువర్ణ సదృశమై యుండ బ్రాహ్మణుని మనసు దోలాయమానమగును. నదిని గాంచి యంధకారము, నదీతరంగములు తన్ను నాకర్షించుచున్నట్లు భ్రాంతి నొంది విహ్వలుడగును. తన్ను రక్షింప నదీదేవతల ప్రార్థించును. పిమ్మట కూపమును జేరి యందలి మూడు జంతువులను నరుని కాపాడును. ఈతనికి జంతువులు సహాయము చేయును. అందొకటి సువర్ణము నొసగ తద్విక్రయార్థము కాశీనగరమున కేగును. అచట ఉపకృతి నందిన నరుడే గాన్పించి యీతనిపై సువర్ణస్తేయమును మోపి చెఱసాల కంపును. సర్వమూలకముగా భూపాలుడు సత్యమును గుర్తించి బ్రాహ్మణుని సన్మానించి నరుని శిక్షించును. ఇట్లు తృతీయ చతుర్థ పంచమాంకములయందు గాథ వర్ణింపబడినది.

## నాటక మందలి విశేషములు

భారతీయ నాటకములయందు సూత్రధారుడు ప్రస్తావనయందు మాత్రమే గాన్పించును గాని యంకములయందు గాన్పింపడు. మూలాంగ్ల నాటకకర్త ప్రతియంకముునను సూత్రధారుని ప్రవేశింపజేయును. ప్రతి యంకారంభమునను సూత్రధారుడు కొంత కథను కొనసాగించి దెలుపును. పిమ్మట సంభాషణలు సాగును. మూలమందలి యీ పాశ్చాత్యసంప్రదాయము సంస్కృతమున యథాతథముగ పాటింపబడినది. సంస్కృతమున పాశ్చాత్య సంప్రదాయమును జొప్పించుట కవిగారికిగల నూతనప్రక్రియాన్వేషణమునకు ప్రతీకయనవచ్చును. "పురాణమిత్యేవ న సాధు సర్వం నవీనమిత్యేవ న చానవద్యమ్" యనునట్లు హృద్యమైనపుడు పాశ్చాత్యపద్ధతి ననుసరించుటయందు దోషము గాన్పింపదు.

విభ్రాంతుడై నదీదేవతలఁ బ్రార్థించు బ్రాహ్మణుని వచనములలో మూలమందలి పాశ్చాత్య భావము గాన్పింపదు. భారతీయత నైష్ఠికత గోచరించును. ఇందులకా పంక్తులే యుదాహరణము.

"నదీజలేషు యాః దేవతాః వసన్తి తా మే ప్రసన్నాత్మనః భవన్తు." నదియందలి దేవతలు నాయందు ప్రసన్నతా బుద్ధితో నుందురుగాత యనిభావము.

ఆక్రందన విని రక్షింపసమకట్టిన బ్రాహ్మణుని వచనములయందు చక్కని భావము. సుభాషితముల యందలి శైలియనుకరింపబడినది. చూడుడు—

"ఆపన్న రక్షణపరో భవతీహ యోఽసౌ
మాన్యశ్చ మానవమనాస్స మృదుస్వభావః
యస్సానుభూతివిముఖః కఠినప్రవృత్తిః
తం మానవం పరిహసన్తి మృగాః విరక్తాః"

మానవతా యుక్తుడై మృదుస్వభావియైనవాడు యాపన్నుల రక్షించును. సానుభూతిలేని కఠినుని మృగములుగూడ పరిహసించును. మృగములు పరిహసించునని సామాన్యముగ జెప్పబడినను, యిది కథ యందుండుటచే భవిష్యదర్థము వ్యంగ్యమగుచున్నది. శాకుంతలమందలి "అన్యైర్ద్విజైః పరభృతాః ఖలు పోషయన్తి" యనువాక్యము సప్తమాంకగాథను వ్యంజనచే సూచించుచున్నది. ఇదియునట్లే. "అధిగుణేయాచనావరంహి" యనమాటలో ఉత్తముని యాచించుట మంచిదనునర్థముగల "యాచ్ఞా మోఘా వరమధిగుణే నాధమే లబ్ధకామా" యను కాళిదాసుని భావమేవీరి హృదయమునుండి ప్రసరించినదిగాని మూలకర్తదిగాదు. "యఃకృతముపకారం విస్మరతి సపవపురుషాధమః" యనునది యందమైనమాట.

మూలమునందలి మూడంకముల గాథయిందై దంకములైనది. ఇక మూలగ్రంథము, యనువాదముల రెంటినీ పరిశీలించెదము. మూలమునందని దిక్కులనుగాంచి భయభ్రాంతుడైన బ్రాహ్మణు డిట్లనును—

"oh sweets spirits of the river! keep me
safe while I slumber here at your side,
Guard me from all the evils of the night
And come to my help it danger threatens"

దీనికి కవిగారియనువాదము—

"న నదీముద్దిశ్యధ్యానం కరోతి, నదీజలేషుయాః దేవతాః తామేప్రసన్నాత్మానో భవన్తో మాం రక్షన్తు"

మూలకర్తయును భారతీయసంప్రదాయప్రభావితుడేనని చెప్పనగును. కానిచో భారతీయగాధను గ్రహింపడు. మూలమున—

"one should always help a man in distress" అనునది "ఆపన్నరక్షణపరో భవతీహ ఉ యోసేవ్యశ్చమానవమనాస్స మృదుస్వభావః" అని పద్యరూపమున నవతరించినది.

మూలాంగ్లగ్రంథమున నది సంభాషించును. అవె యిందుపరిహృతమైనది. స్వర్ణకారునికి భార్యగాని, జంతువుల నామములుగాని మూలమునలేవు. అవియిందు ప్రతిపాదింపబడుట గమనార్హము.

నాటకాంతమున ననువాదకర్తయగు రత్నకవి సుభాషితముల యందలి యీక్రిందిశ్లోకముంచినాడు.

"ప్రథమ వయసిపీతం తోయ మల్పంస్మరన్తః
శిరసినిహితభారాః నారికేలాః నరాణామ్
సలిలమమృతకల్పం దద్యురాజీవితాన్తమ్
నహికృత ముపకారంసాధవో విస్మరన్తి

నారికేళవృక్షములు ప్రారంభమున నరులొసంగిన నీటిని ద్రావి ప్రత్యుపకార బుద్ధితో యమృతకల్పజలము నొసంగుచున్నవి. సాధువులు యుపకృతిని విస్మరించరు.

గ్రంథమందలి యీక్రిందిశ్లోకము పరమరమణీయము కవిగారి ప్రతిభానిష్పన్నము. ఇదెంతమన ఆహ్లాదకరమైనదో గాంచుడు—

"పాతువో గిరిజామాతా యస్య ద్వాదశలోచనః
తథైవ గిరిజామాతా ద్వాదశార్ధార్ధలోచనః"

గిరిజాదేవి ద్రష్టలనుకాపాడుగాక. ఈమె సుతుడు పండ్రెండు కన్నులుగలవాడు. ఈమెకు తండ్రిహిమవంతునకల్లుడు. మూడుకన్నులుగల వాడు అనిభావము. ఇట గిరిజా మాతా యనియు గిరి జామాతా యనియు పదవిభాగము. ఇది సుందరము.

## చూడాల

జ్ఞానవాశిష్ఠమాధారముగా సాగిన నాటకమిది.

"ఉన్మజ్జన్తి నిమజ్జన్తి ప్రస్ఫురన్తి పతన్తిచ

తరంగా ఇవతోయానామిమాః ప్రతిదినం ప్రజాః" అనుమహత్తరా ధ్యాత్మిక భావపరంపరలుగల గ్రంథముజ్ఞానవాసిష్టము. అందలియంతర్గతాధ్యాత్మిక భావసుందరమగు గాధయే చూడాల నాటకముగ నవతరించినది.

రాజ్యతంత్రమున విరక్తుడైన శిఖిధ్వజుడనురాజు విహస్తుడను మునినుండి సొరబుర్ర. తామరపూసలదండ, కమండలములగ్రహించి యరణ్యమున మునియగును. కుంభుడనేడి పదునాఱేండ్ల మునిబాలకుడు వచ్చిశిఖిధ్వజునితో సంభాషించుచు రాజ్యమును, భార్యనుత్యజించుట యందుగొప్పదనము లేదనిశరీరమందలి యాత్మాభిమానమును వదలుటగొప్పయని పలుకును.

శిఖిధ్వజుడు కుపితుడై కమండలాదు లనగ్నియందుత్రోసి, శరీరమును గూడపరిత్యజింప సమకట్టును. కుంభుడు శరీరమును త్యజించుట

గాదు తనువునగల ప్రతిబంధకశక్తులను నివారింపవలెననును. హిమ త్పర్వత సానువులం దపమాచరించు నారదునకుగూడ వివస్త్రలై స్నా మాడు కామినులగాంచి స్ఖలితుడాయెననియు, బ్రహ్మనారు జ్ఞానోప శముజేసెననియు పలుకును. విహాసుడు దెచ్చిన ఫలాదుల భుజించు కుంభుడు శిఖిధ్వజుని హారములనపహరించి విపినాంతర సీమలదాగును ఖడ్గహస్తుడై వెంటాడు శిఖిధ్వజుని విహాస్తుడు వారించును.

శరీరమందలి యవయవములు తామేయధికమని దేనికది హించును. "సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్" "శ్రోత్రం ప్ర నమ్" అనువాదములకన్న "ప్రాణో వై జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ" యన శ్రుతిప్రామాణ్యము వలన ప్రాణమే ప్రధానమని తేలినదని విహా వృపునకు బోధించును. పిమ్మట హారములు చూరునందేగల తెలియును.

పిమ్మట కుంభుడువచ్చి దుర్వాసమహామునినిగాంచి యభివా వలెనున్నాడని పరిహాసింప నాతడు కుపితుడై పగలు పురుషుడు, రా స్త్రీగా మారమని శపించును. స్త్రీగామారిన కుంభుడు రా వివాహము చేసికొనమని యర్థించును. "శాపీనసంరక్షణార్థమయ టాటోపః" యనునట్లగునేమోనని సంశయించి చివరకు కుంభుని వి హామాడును. ఈమె పేరుమదనిక భూపాలుడు స్నానమునకు వె సమయమున మదనిక విహాస్తుని సమీపమున నుండును. రాజు రా గుర్తించిన విహాస్తుడు మదనికను వదలి పారిపోవును. రాజును మ పరవశింప జేయును.

పిమ్మట తానుస్నానమునకు వెడలినపుడు వివస్త్రలైన అప్స లాకర్షింపజూచిరనియు తానువారి యందే దైవమును జూచి పల్కును. సూర్యోదయకాలమున కుంభుడు పురుషునిగ మారును.

ఇంతలో దూరముననున్న సైన్యమును గాంచి యచటికి వెడలి వచ్చును. కుంభుడు తిరిగివచ్చి రాజ్యపాలనకై మంత్రులు వచ్చిరని చెప్పి రాజ్యపాలనకు శిఖిధ్వజుని యంగీకరింపజేయును. కుంభుడు గాడనీ తన భార్యయగు "చూడాల"యని విహాస్తుడు తన ప్రథమపత్ని కుమారుడని గుర్తించి శిఖిధ్వజుడు సంతుష్టుడగును.

శిఖిధ్వజుడు తన ప్రథమపత్నిని, యామెకుమారునీ సంహరింప జేసినపుడు యీచూడాలయే వారిని కాపాడినది. చూడాలయే ఆ బాలుని పెంచినది. జ్ఞానంలో తనను మించినదని, వంశమును నిలిపినదని రాజు చూడాలను ప్రశంసించును. మహా పతివ్రతయైన రాజు ప్రథమ పత్ని మంగళ. విహాస్తుని నిజనామము మరాళధ్వజుడు. రాజాదులందరూ సుఖింతురు.

## ఈ నాటకమందలి జ్ఞానబోధ

అందరూ ఆత్మస్వరూపులే. మానవులయందలి పరస్పర భేదము లన్నియునజ్ఞాన కల్పితములే. భూమియందరికి సంబంధించును గాని యొకరిదేగాదు. పరస్పరానుభూతివలన నభేదభావము సిద్ధించును జ్ఞానార్జనమునకెటువంటి ప్రతిబంధకములుండరాదు.

"అహంవైశ్వా నరోభూత్వా ప్రాణినాం దేహమాశ్రితః"యని భగవానుడే చెప్పియుండుటవలన భగవదంశయందరి యందు గలదు. "అహమన్నమహమన్నమహమన్నాదః" యనెడి శ్రుతి సర్వవిధములా సార్థకమే. అన్నమయ మనోమయ ప్రాణమయ విజ్ఞానమయానందమ యములనెడి పంచకోశములయందలి ప్రథమకోశమగు నన్నమయ కోశము వృద్ధినొందిన యన్నికోశములు ప్రబలములగును. అందుకే

"శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్" యని కుమారసంభవమునం జెప్ప బడినది. అన్నకోశమును వృద్ధిజేయుట కందరు ప్రయత్నించవలెను

## కథ యందలి వైచిత్రి

జ్ఞానిబుభూషువు అగు శిఖిధ్వజుని పరీక్షింప నెంచి యాతనితో స్త్రీరూపమున సరసమాడినది. క్రోధ మాత్సర్యముల నాతడు జయించెనాయని పరీక్షించుచు విహస్తునితో కలసి నాటకమాడినది. రాజు అహంకారమును మమతను జయించెనాయని కుంభుడు హారముల నపహరించినట్లు నటించెను. సంసారమందున్నను ఇంద్రియముల జయించి యోగి కావచ్చునని చూడాల బోధించెను.

"నివృత్త రాగస్య గృహం తపోవనమ్"

## దక్షిణ (నాటకమ్)

శ్రీమన్మహాభారతమందలి యాదియశ్వమేధపర్వములలో గల యుదంకుని గురుభక్తి నిరూపకమగు గాథయే "దక్షిణ" యనునాటకముగా రచింపబడినది. అశ్వమేధపర్వ మందలి గాథ యీనాటకమునకు మూలము. 108 పేజీలుగల యీనాటకం 1943 లో ముద్రింపబడి నేకమారులు ప్రదర్శింపబడినది.

యుదంకుడు గురుపత్న్యాజ్ఞాబద్ధుడై రాణిధ
ృ గుర్వాజ్ఞను నిర్వర్తించి కృతకృత్యు

## యందలి క్రొత్త యంశములు

ఉదంకుని గురుతనూజ ప్రేమించును. గురుతనూజాతయు నేడి భావముతోనే యుదంకుడాకెను జూచును. ఉదంకుడు గానకళాకోవిదు డనుట క్రొంగ్రొత్త విషయము. ఆతని గుండెలనిండిన కళావాహిని

పొంగి యెదదస్పందించిననే గీతమాలపించును. అందులకే రాజెంత కోరి నను హృదయస్పందనలేని సమయమున గీతమాలపింపలేకుండును. కళాకారుడాతని డెందముబ్బి తలూగిన సమయమున పారవశ్యముతో కళను వెలార్చును గాని తదితర సమయములందు కళను ప్రదర్శింపలే డను సత్యమును సహజకళాకారులగు శ్రీ అంబటిపూడి వెకంటరత్నకవి గారు యీనాటకమున పాత్రముఖమున ప్రతిపాదించిరి.

కవితాకళావిశారదుడగు వాల్మీకి సహచరీవిరహాకాతరమైన క్రౌంచముచేసిన యాక్రందనమును వినికరుణావశంవదుడయి కవిత వెలార్చెను. హృదయము పరవశింప నాతని వదనమునుండి యప్రయత్నముగా కవిత వెడలినదని చెప్పు ధ్వన్యాలోకమిట ప్రమాణము.

ప్రేమ వృత్తాంతమున కీగ్రంథమున కొంత ప్రాముఖ్యము కన్పట్టుచున్నది. ఉదంకుడు నాగలోకమునకు వెడలుట యిందు పరిహరింపబడినది.

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః.

గురుస్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీగురవేనమః" యని భారతీయతత్త్వమున గురువునకత్యంత ప్రాధాన్యమొసంగబడినది. సహజముగ నాచార్యులయందత్యంత భక్తిప్రపత్తులుగల కవిగారికి యుదంకుని గాథనచ్చుట, దానిని వీరు నాటకముగ చిత్రీకరించుట సహజములు. ఈనాటకమున నాటకీయత పుష్కలముగా గలదు. వాక్యముల యందలి కర్త కర్మక్రియలు శక్తివంతములు గానిందు ప్రయుక్తములైనవి దీనిని అధునాతన నాటకగుణమని చెప్పవచ్చును.

ఈనాటకమును శ్రీ వేంకటరత్నకవి గారు. తమతండ్రిగారికి సంకితమునిచ్చి తమపితృభక్తిని నిరూపించుకొనిరి. ఇందలి సూర్యోద

యవర్ణన మత్యంతరమణీయము. గురువును సూర్యతుల్యునిగ తీర్చిదిద్దుట కడుంగడు రమణీయం "అంధకార వినాశిత్వాద్గురు రిత్యభి ధీయతే" అని గురుమహిమను సంప్రదాయా భిజ్ఞులు కీర్తించిరి. తమోనాశకత్వ మిరువురకు సమానం. జయబాలసౌదాసుల ప్రణయం అమూలకం. ఇందు ఉదంకున కహల్యాగౌతములు గురువులు. తృతీయాంకములోని యీక్రింది సందేశం మనోజ్ఞం.

"మణిగణ ఖచితాభరణాలంకృతి
వెలుగజేయునది బహిరంగమునే
గుణగణ భరమృదులాత్మాలంకృతి
వెలికి లోనికిని వెలుగిచ్చునదే"

స్వప్నాలు కొన్నిజరుగుతాయి. "సర్వేంద్రియాణాంవిరతౌ మనోఽను పరతంయది విషయేభ్య స్తదాస్వప్నంనానారూపంప్రపశ్యతి" అనియు "ఇంద్రియేశేవ మనసా స్వప్నాన్పశ్యత్యనేకధా" అనియుస్వప్నముల గూర్చి స్వప్నప్రకాశికయందు చెప్పబడినది. దృష్టశ్రుతాదులు వ్యర్థములైనను తదితరములు జరుగును. స్వప్నాలవలన సత్యము తెలియుననెడి అంశము యీగ్రంథమున నిరూపితము.

## ఇందిరా విజయమ్

బాంగ్లాదేశ పౌరులు భారతదేశమును జేర మన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ఆదుకొనుట యిందలిగాథ. ఈ గాథ సంస్కృతమున సరసమైన నాటకముగ చిత్రింపబడినది. "సాహితీమేఖల" ద్వారా యీ నాటకము 1972 లో ముద్రింపబడినది. ఈ గ్రంథము సరళసుందరముగ సంస్కృతమున వ్యావహారిక భాషలో వ్రాయబడినదని 1773 మే శనివారమునాటి ఇండియన్ ఎక్స్ప్రెస్ దినపత్రికలో సమీక్షింపబడినది. సంస్కృతమందలి ఈ నాటకమును గూర్చి ఇండియన్ ఎక్స్ప్రెస్ లోని యభిప్రాయము —

"The author also had the opportunity to present a copy of the book to Mrs Gandhi during the world Sanskrit convention in March 1972.

The events are well planned. The dialogus maintain tempo and the drama is stage worthy also a rare feature in Sanskrit dramas''

20-8-1972 నాటి ఆంధ్రప్రభలో—

"రచయిత ఐదుగంటలలో దీనిని రచించిరి. నల్గొండజిల్లాలోని గణతంత్రదినోత్సవంలో యిందులోని శ్లోకాలు చదివారు. అతిసరళమైన పద్ధతిలో సులభంగా అర్థమయ్యేపదాలతో సున్నితంగా రచింపబడినందున సంస్కృతంలో కొంచది ప్రవేశం గలవారు గూడా అర్థంచేసుకోవచ్చు. వేంకటరత్నంగారి రచనాశక్తి పాండితీగరిమ గణనీయాలు."

గౌతమీవిద్యాపీఠం ప్రాచార్యులైన శ్రీ రేమెళ్ళ సూర్యప్రకాశ శాస్త్రి గారిట్లనిరి—

"అధునాతనలోక వ్యవహారవిషయః అతీవ సరళయా శైల్యా పాఠకానాం అభిరుచి మనుసృత్య నాటకరూపేణ రచయామాసుః కవిపుంగవాః యశోభూషణాః వేంకటరత్న శాస్త్రి మహోదయాః ఇతి అమందానందః సమజని."

గోరంట్ల వెంకన్న సంస్కృతకళాశాల యందలి ప్రాచార్యులైన శ్రీ నల్లాన్ చక్రవర్తుల వెంకటాచార్యులు గారియభిప్రాయము.

"అస్మిన్ నాటకే సుమధురాచ భాషా వైదర్భీ రీతిః సమాదృతా."

(శ్రీ) శ్రీధర భాస్కరవర్ణేకర్ గారు (నాగపూర్ యూనివర్సిటీ) ఇట్లనిరి— "వాఙ్మయసేవాకార్యం కుర్వాణేషు కేషుచిన్మహానుభావేషు భవన్తో హి పరమమాననీయాః"

శ్రీ కేశిరాజు వెంకట నృసింహ అప్పారావుగారు—

"ఇందిరావిజయం దృష్ట్వా తథా మోదేఽధునా కవేః"

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు – రీతిర్వైదర్భీ, శైలీసరలా, భాషాసుగమా. మనోజ్ఞశ్చ కథాసందర్భః"

పాకిస్థాన్ సైనికులు బంగ్లాదేశవాసులను నిరాధారులను జేయుట వారిని పీడించి ముస్లిములుగా మార్చ యత్నించుట. ధనమానాపహారణంవంటి సంఘటనలు జరిగినవి. ఆసమయమున ముజిబుర్ రెహమాను అనునతడు మానవతావాదియై పీడితజనాళికి యండగా నిలబడతాడు. ఘట్టోయాహ్యాఖాన్ రెహమానుని చెఱసాలలో బంధింతురు. అనాధలైనప్రజలు ఢాగానగరం ప్రవేశించి భారతీయులను శరణువేడిరి. భారతదేశమునకు, పాకిస్థాన్‌కు యుద్ధం జరిగినది. రష్యాస్నేహసంబంధాలనుబొంది భారతదేశము బంగ్లాదేశవిముక్తికై పోరాడసాగినది. యుద్ధమందు జయమంది బంగ్లాదేశమును స్వతంత్రదేశముగా ప్రపంచరాజ్యములచే నొప్పించి కాందిశీకులను స్వదేశముః బంపించుటలో శ్రీమతి గాంధీ కృతకృత్యురాలైనది.

ఎట్టిసూచనయులేక శ్రీమతి గాంధీ కలకత్తాలో ప్రసంగించు సమయమున అర్ధరాత్రి పాకిస్థాన్ దేశము ఇండియాపై దండెత్తుట దానికుతంత్రమునకు నిదర్శనము. వంగదేశాంతర్భాగమున "ముక్తివాహిని" యనుసైన్యముఃపోరాడుచుండ బహిర్భాగమున భారతదేశసైన్యముగలదు. ఈ రెంటినడుమ పాకిస్థానీయుఃలస్థితి క్రకచద్వయాంతర్గతదారువువలెనయినది. కరాచీలో పాకిస్థాన్ నౌకలను విశాఖపట్టణమున నమెరికా వారందజేసిన జలాంతర్గాములను విధ్వంసనము జేయుటకు భారతనౌకాదళము దృఢముగ ప్రయత్నించినది.

సప్తమనావికాదళమునకు నమెరికాసహాయము చేయగలదని యాహ్యాఖాను భావించియుండెను. కానియమెరికా ఏవిధముగను సహాయపడలేదు. నయాజీప్రభృతులు ఆయుధములనువిడచి భారతీయులకు లొంగిరి. ప్రపంచదేశములకు వంగదేశాధ్యక్షుడు ముజిబుర్ రెహామానే నని భారతీయులు నిరూపించిరి. శత్రువులు వంగదేశమును జయించుటకే భారతీయులు పోరాడుచుండిరని ప్రచారము చేయసాగిరి. కాని వంగదేశవిముక్తికే పోరాడిరనెడి సత్యము క్రమముగా ప్రపంచదేశములకు తెలిసినది ముజిబుర్ రెహామానుని వంగదేశీయులు "వంగపిత" యని శ్లాఘించిరి. ఇందిరాగాంధీ సాధించిన యీవిజయమును రత్నకవి గారు ఇందిరావిజయమను సంస్కృతనాటకముగా చిత్రీకరించిరి.

## ఇందిరా విజయగ్రంథ సమీక్ష

ఇందైదంకములుగలవు. గద్యభాగమధికముగను, పద్యములు తక్కువగనుగలవు. సంస్కృతభాషను ప్రచారముచేయుటకై యిట్టిసరళగద్యప్రాచుర్యముగల నాటకముల యావశ్యకత యెంతేనిగలదు. చారిత్రకగ్రంథములు గైర్వాణీ వాణియందల్పములని యొకయధిక్షేపము లోకమందుగలదు. కాని నిజమారసిన చారిత్రకగ్రంథములు లేకపోలేదు. పురాణముల వలన కొన్నిచారిత్రక విషయములవగతమగును. కల్హణుని రాజతరంగిణి ఉత్తమచారిత్రక గ్రంథమని యెల్లరెరిగిన విషయమే. ఈశతాబ్దమున వెలసిన "జయపురరాజ వంశావళి" యు ప్రసిద్ధచారిత్రక గ్రంథమే. కల్హణుడు రాజతరంగిణిలో చారిత్రకవిషయములఁ జెప్పునప్పుడు సత్యముబలుకవలెనని యిట్లనును—

"భూతార్థకథనే యస్య స్థేయసీవ సరస్వతీ" సత్యములనే తమచారిత్రకగ్రంథమున వక్కాణించిన రత్నకవిగారుయశస్విలని చెప్పవచ్చును.

ఈగ్రంథమున సరసభాష ప్రయోగింపబడినదనుటకీ క్రిందిపంక్తు

"అష్టమాసాః యాపితాః కథంచిత్ బధిరఇవఅంధఇవ పంగురివనిరక్షరకుక్షిరివ జీవామి కోఽపిశ్రావయితుం నాగచ్ఛతి. కామపివార్తాంనశ్రుణోమి. పఠితుమేకోఽపిగ్రంథః నలభ్యతే లిఖితుమేకమపి లేఖం నానుమతోఽస్మి అస్తు"

ఈమాటలు కారాగారబద్ధుడైన ముజిబుర్ రెహమానువి. ఎంత మృదులరచనయో విజ్ఞులు గమనింతురుగాక. ఇట్టిసరళ గ్రంధముల వలన సంస్కృతభాష యత్యంత సులభమని జనులకు తెలియును.

కావ్యరీతి ననుసరించి రమణీయవర్ణనలు నాతిదీర్ఘములై యిందుజేర్పబడినవి. ఈక్రిందియస్తమయవర్ణనము మనోజ్ఞము.

"అరుణారుణరాగరంజితో రవిరస్తంగమనాయ సజ్జతి
పునరర్కసమాగమేప్సితాన్యరవిందాని విశన్తి బంభరాః"

కవితాశైలిని గోచరింపజేయు నీక్రింది శ్లోకమున నానార్థసూచనము గలదు.

"సృష్టిస్థితిలయాతీతా పరాశక్తిః కృపామయీ
దుష్టసంహారనిపుణా త్రాయతాం విజయేందిరా"

విజయేందిర రక్షింపవలెననుటచే ఇందిరాగాంధీ గూడ సూచింపబడు చున్నది.

శ్రుతులయందలి వైదికభావము శీవిధముగా ప్రకటితములు.

"ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్"
"తేనత్యక్తేన భుంజీథాః మాగృధః కస్యస్విద్ధనమ్"
"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతంసమాః"

భారతీయసంస్కృతీ పరమైన యీచిన్నిపొత్తమునందు స్మృతి తుల్యమగు గీతనుండి ఈక్రింది శ్లోకము లుదాహృతములు—

"ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ"
"తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్"
"ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ"
"మమ మాయా దురత్యయా"

కవి స్వతంత్రముగ సరసమైన సూక్తుల కూర్చెను. కాల గర్భమందేమి గలదో యెవ్వడెరుంగ గలడు? యనెడి భావము గల ఈ సూక్తిని గాంచుడు. "కాలగర్భే కిమస్తీతి కోవేత్తి మనుజోభువి"

భరత వాక్యమందలి యీక్రింది శ్లోకమత్యంతరమణీయము.

"ప్రజా వత్సా ధేనుర్భవతి జగతీ పాలకమతిః
తయోర్మైత్రీ బంధాద్గలతి చపయః ప్రేమ మధురమ్
తదస్తర్వాసోఽయం సతత పరమానంద జనకః
దృఢం భూయాద్భావో విజయమయ ధర్మస్థితికరః"

ప్రజలు దూడల వంటివారు. రాజుల బుద్ధి ధేనువు వంటిది. వారిరువుర మైత్రీబంధమునుండి మధురమైన ప్రేమయనెడి పాలు స్రవించును. సౌమనస్య భావము పొందిన వారిరువురి వడుమ జీవించుట పరమానందమును కలిగించును. ధర్మ విజయము నొసంగునట్టి సుహృద్భావము దృఢముగనుండుగాక.

ఇలా ఈకావ్యం పరమ రమణీయంగా చిత్రింపబడినది.

## కౌవోదకి

ఈ గ్రంథం ఎనిమిది నాటికల సంకలనం. ఈనాటికలలోకొన్ని ఉపనిషత్తులాధారంగా వ్రాయబడినవి. మరికొన్ని ఆంగ్లభాషనుండి అనూదితాలు. కొన్ని స్వతంత్ర కల్పనాసమేతములు. శ్రీ అక్కిపల్లి

వెంకటేశ్వరరావుగారు. బెర్నార్డ్‌షా, హెచ్. జి. వెల్సుల రచనలు చదువ కవిగారిని ప్రేరేపించినవి వారి ప్రేరణాల ఫలితమే ఈనాటికలు. ఇందులోని కొన్ని నాటికలు ప్రజామిత్ర, గోలకొండ సుజాతశోభ పత్రికలలో ప్రచురించబడినవి మేలిముసుగు, కుమ్మున్నిసా, స్వర్ణ కారుడు, అహోరాత్రులు, విద్యాసాధక, నరుడికంటే మృగంనయం, ఎవరుతక్కువ, అజ్ఞారాధన యనేవి యిందులోని నాటికలు. సంస్కృతమునందలి పురుషపరీక్షయే అజ్ఞారాధన.

## మేలిముసుగు

Clifford Bae యను దానికియనువాదమే మేలిముసుగు అమర, అజాత, సద్యోమృత యనెడిమూడు పాత్రలతో యీనాటిక సాగును. అజాత మర్త్యలోకానికి బయలుదేరుతుంది. భూలోకంలో మధురానుభూతు లున్నాయని భావించడమే మర్త్యలోక ప్రయాణానికి కారణం. అమర అజాతకు భూలోకాన్నిచూపించి యందలి వేదనా భరితమైన జీవనాన్ని తెలియజేస్తుంది. అజాతప్రేమ సమారాధననే లక్ష్యంగా పెట్టుకొని జీవిస్తానని తెలియజేస్తుంది. భూమినుండి వచ్చే వారు స్వలాభం, స్వార్థం అనే ముసుగులో ఉంటారని, దాన్ని భూలోకంలో విడచి పెట్టరని, దాన్నివదలిన పిమ్మటే స్వర్గప్రవేశం అని చెప్ప డానికే తానున్నట్లు తెలియజేస్తుంది అమర.

సద్యోమృత అప్పుడే మరణించి స్వర్గోన్ముఖురాలవుతుంది. ఆమెకు గల భూలోక వాంఛలనే ముసుగు తొలగించడానికి ప్రయత్ని స్తుంది అజాత ఎంతప్రయత్నించినా సద్యోమృతచే మేలిముసుగు తొల గింపజేయలేకపోతుంది. అమర చెప్పిన పిమ్మట సద్యోమృత మేలిముసు గును తొలగిస్తుంది. అమర సద్యోమృతలు సాగిపోయిన పిదప మానవుల మధ్య బ్రతకడానికి మేలిముసుగవసరమని భావించిన అజాతబురఖాను ధరించును.

## కావ్యమందలిబోధ

భూలోకంలోని మానవులు కేవలం స్వార్థంకోసం వంచించుకుంటారు. ప్రేమయనేది మానవులలో కరువౌతుంది స్వర్గం నుండి వచ్చేజీవులు ప్రేమతో జీవించాలని భావించినా భూలోకాన్ని చేరేసరికి స్వార్థమనే ముసుగునే ధరిస్తారు. రవ్వంతబంగారంకోసం పరస్పరం కలహించుకొంటారు. స్వార్థంలేని వారలకే స్వర్గసౌఖ్యం గోచరిస్తుంది. స్వార్థ మనే కవచాన్ని ధరించిన మానవులు పాలించాలేగాని పాలింపబడకూడదనే భావం మిగులుతుంది. భూలోకంలో సౌఖ్యంగలదని భావించుటయే భ్రమ. స్వార్థమును వదలుటకు ప్రాణులంగీకరింపవు.

గంభీరభావములతో కూడియుండుటవలన యీ నాటికలు సామాన్యులకర్థంగావు.

## కుమున్నిసా

కుమున్నిసాయనెడి కాంతను వివాహమాడుటకు యీరుగురు యువకులు పోటీపడుటయే యిందలి గాథ. ఒక అందమైన కావ్యమునురచించి, దానితో పదిరూప్యకములబంపిన కుమ్మున్నిసా వివాహమాడును.

హల్లాజ్ పదిరూకలను సంపాదించుటకు ప్రయత్నించును. పిల్ల పేరుతో పాదాంతం ఒకటి, మిగిలిన పాదాంతాలలో తత్తుల్యంగా అంత్యప్రాసలు కుదర్చడం నియమం. హల్లాజ్, నెజీహాల్, అల్లాదీన్ మొదలైన వారలకు కుమ్మున్నిసాకు నచ్చేపద్యాలు వ్రాస్తానని చెప్పి వారినుండి ధనమును సంపాదించి కుమున్నిసాకు నచ్చే పద్యాన్ని తానే వ్రాసిమెప్పించి వివాహమాడును.

అజ్ఞానమునశించి, జ్ఞానమొదవిన భూమియే స్వర్గమని చెప్పబడిన క్రిందిది యెంత మనోహరమొ గాంచుడు....

"నీలిమబ్బుల మసక వన్నెలునశించు
చంద్రుడుదయించు చున్నట్లుజ్ఞానమొదవు
అకట భువిలోని మానవులందరిట్టి
ముదము సగపాలు బడసిన పుడమిదివమె"

ముదము సగపాలు మెప్పించుచు, "మధుర రాత్రి హిమగణము సాగ వసంత చంద్రకిరణ సారమువోలె యాపె పలుకులని స్వర్గమునకు రాణి" యనిచెప్పిన కవిత కవితాపిపాసువుల డెందముల యమందానందముతో నింపును.

"మధురయామిని రసా
వళులహిమగణముసా
గిన మాధవ ప్రసా
ధనచంద్రకిరణసా
రములామెనుడులుసా
ర్థకభావములుపిసా
శించుత్రిదివాధిసా
మ్రాజ్ఞికు ర్మున్నిసా"

"అరసికేషు కవిత్వనివేదనం శిరసిమాలిఖ మాలిఖ మాలిఖ" యని కాళిదాసు మూర్ఖునకు కవిత వినిపించేస్తితి వద్దన్నాడు. "కావ్య రసాస్వాదముచేయ జాలని మొరకుకు నమస్కారమని" "తస్మైనమః స్వాదుపరాఙ్ముఖాయ" యని దశరూపకకర్త ధనంజయుడుసూచించెను. ఇక్లేకవిగారును కావ్యరసాస్వాదము చేయజాలని మందుని నిందించుచు యీనాటకమందు పొదిగిన యీక్రింది పద్యము సహృదయుల నలరించును. అద్దానిని యాస్వాదింపుడు.

"సకల జీవన సౌగంధ్య వికసనముల
నిలయమగు కావ్యమెల్లని నిరభిమాని
తల్లి గర్భమ్ము వెడలుట తప్పు తప్పు
అట్టి మూర్ఖుని నరుడని యనను నేను"

"తస్యా జననిరేవాస్తు జననీ క్లేశకారిణః" యన్న మాఘుని భావము, "విద్యావిహీనః పశుః" "సాహిత్య సంగీత కలా విహీనః సాక్షాత్పశుః పుచ్ఛ విషాణ హీనః" యన్న భర్తృహరి భావము పై పద్యమున గాన్పించుచున్నది. ఏతాదృశ బహు భావ బంధురమగు పై పద్యమొక యాణిముత్తెమనవచ్చును.

## స్వప్నకారుడు

బదరి, సాగర్, కార్మికుడు యనెడి మూడు పాత్రలతో పాశ్చాత్య పద్ధతులతో నడచిన నాటికయిది. ఇందు కథ గణనీయం గాదు. బదరిసాగర్ల యనురాగము గోచరించును. "జీవితమ్మొక చిక్కు దారపు బంతి" యనెడి పంక్తి వాస్తవ జీవితమునెట్లు వివరించు చున్నదో విజ్ఞులెరుక. ఈ క్రింది పద్యము మంజులము—

"కాలగర్భమ్మునుండి ఒక్కడు తదాత్మ
నూది రగిలింపగల యాతడుట్టిపడెను
చెలిమి గోనెగాని రమణికి జిక్కదకట
హృదయగతమైన ప్రేమ బహిర్ముఖాన"

## అహోరాత్రాలు

నాలుగైదు సన్నివేశములతో కూర్చబడిన యీ చిన్ని నాటిక భావ కావ్యంవలె సాగిందని చెప్పవచ్చు. ఇందులో వైదిక బౌద్ధ

భావాలు కూర్చబడినవి. భావకావ్యమువలె భావప్రధాన నాటికలును ఉండవచ్చును. "అవిస్పష్ట భావాంకూరము, అంతర్నిగూఢతాపము గలిగినది భావకావ్యము" అని విశ్వనాథ సత్యనారాయణగారి వచనం. ఇందు కుతూహలము (Anxiety) నిశ్చితి (Decision) గలవు.

ఒకానొకకొండ నదులతో గూడిన ప్రకృతి సన్నివేశము చిత్రింప బడినది. "ఓవారివాహా, ఈశైలకన్యకా, హృదయమ్ములోపాట,వచ్చి వినుమీచోట" యనే పల్లవి యిందులో యనేకమారులు కన్పించును. "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" యనెడి భావము కవితారూప మునవెట్లవతరించినదో చూడుడు—

"ఒంటిగామనలేక, జంటగోరిన బ్రహ్మ
ఈ సమస్త కుటుంబమెత్తుకున్నాడురా"

శ్రుత్యర్థములనైతము పామరులకర్థమగు భావగీతముల నిముడ్చగల కవిగారి స్పందన మధురాతిమధురము. బౌద్ధ సిద్ధాంత భావగీతిక—

"యజ్ఞయాగముల హింసకలదురా
పూవులు త్రుంచే పూజలెందుకర"

"బ్రహ్మసత్యం జగన్మిథ్యేత్యేవంరూపో వినిర్ణయః" అనెడి అద్వైతసిద్ధాంతమిాక్రింది గీతమున గలదు.

"సంసారంబిది, స్వప్నమురా, జగము మిధ్యరా, బ్రహ్మ సత్యమురా"
"కలియుగమున హరి నామకీర్తనమె భవతారకమౌ పరమపథమురా"

యను పంక్తి ద్వారా, భక్తిప్రధానవైష్ణవ సిద్ధాంతమభివ్యక్తమగుచున్నది.

"పరమేశునిపై భక్తిప్రధానం, పసు పేరుతో దోసము చేయకు" యనెడి క్రైస్తవుల భావము గలదు. సిద్ధాంతములను చెప్పువారేకాని

యాచరించువారు లేరనియు సూచింపబడినది. ఆంగ్ల పదములతో గూడిన కవితయు నిందు గోచరించును.

## విద్యాసాధన

ఈ నాటిక ఛాందోగ్యోపనిషత్తు ఆధారంగా రచింపబడినది. ఆరుణి తన కుమారుడైన శ్వేతకేతువునకన్ని విద్యలను బోధించి, వేద్యమగు విద్యలేదని, దేశాటనం చేసి జ్ఞానార్జన చేయుమని పంపును. శ్వేతకేతువు పాంచాలదేశ ప్రభువగు ప్రవహణునితో విద్యాచర్చ సేయును. అందు ప్రవహణుడు యీ క్రింది ప్రశ్నలనడుగును. 1) ఈ లోకమును వీడి ప్రజలు ఎచ్చటకు వెళ్లుదురు? వారేమార్గమున తిరిగి వత్తురు? దేవయాన పితృయానముల వ్యావర్తనము ఏమి? అనేకులు పితృ లోకమును చేరినను ఆ లోకము నిండకుండుటకు హేతువేది? పంచాహుతులయందు సాధనములైన యుదకములు హూయమానములై పురుష శబ్ద వాచ్యములెట్లగును?

ఈ ప్రశ్నలకుత్తరములొసంగనేరక జితుడైన శ్వేతకేతువు తండ్రినిజేరి యీ పంచాగ్ని విద్యనేల బోధింపరని ప్రశ్నించును. ఆరుణి తనకే యీ విద్య తెలియదని రాజునకు శిష్యుడనై నేర్వుమనును. సభలో తనను జయించిన వానికి శిష్యుడను కాలేనని శ్వేతకేతువు పల్కును. ఆరుణియే రాజునకు సంతెవాసియగును. సంవత్సర కాలమైనను అట గడుప నిశ్చయించుకొనును. రాజు ఆరుణికి పంచాగ్ని విద్య నిట్లు బోధించును.

లోకరూపాగ్నికి నాదిత్యుడు సమిధ. కిరణములు ధూమము. అహస్సు అర్చి. చంద్రుడంగారము. నక్షత్రములు విస్ఫులింగములు. పర్జన్య రూపాగ్నికి వాయువు సమిధ. అభ్రము ధూమము. విద్యుత్తు అర్చి. అశని అంగారం. మెఱుపులు విస్ఫులింగాలు. పృథివీ రూపాగ్నికి

సంవత్సరమే సమిధ ఆకాశమే ధూమము. రాత్రి అర్చి. దిక్కులంగారములు. అవాంతర దిశలు విస్ఫులింగాలు. పురుష రూపాగ్నికి వాక్కు సమిధ ప్రాణం ధూమము. జిహ్వ అర్చి. చక్షుస్సు అంగారము శ్రోత్రములు విస్ఫులింగాలు. యోషిద్రూపాగ్నికి ఉపస్థయే సమిధ. ఉపమంత్రణం ధూమం. యోని అర్చి. అంతకర్మ అంగారము. అభినందనములు విస్ఫులింగాలు. రమణీయ చరణులుత్తమ యోనిని. కపూయ చరణులు నీచ యోనిని పొందుదురు. పంచాగ్ని విద్య నేర్చి శుద్ధుడైనవాడు బ్రహ్మలోకమును జేరి సుఖించును.

ఈ విద్యను గ్రహించిన ఆరుణి తన కుటీరమును జేరి కుమారుడైన శ్వేతకేతువునకు బోధించును. భారతీయ సంప్రదాయ బద్ధమగు యీ నాటిక కడుంగడు రమణీయము.

## నరుడికంటె మృగం నయం

ఒకరాజు నగరమున సంచరించుచుండ నొకానొక సౌధమ్ముపై గల యువతి చేతిలోని బిడ్డ చొంగకార్చును అది నృపునిపై పడును. రాజు ఆ తల్లిని సభలోనికి పిలిచి ప్రభువు నిట్లవమానించుట నేరమని బాలుని లాగికొనును. ఆ బాలుని సింహమున కాహారముగ వేయును. సభికులందరు విచారించుచుందురు. బోనుయందలి సింహము శిశువును నాకును. శిశువు సింహము మీసములుబట్టి యాడుచుండును. సింహం ఆకలిగొన్న దేవని సేనాని రాజునకు విన్నవించును. పరీక్షింపదలచి సేనాని బోనులో మాంస ఖండముల వేయ సింహము ఆవురావురు మనుచు తినును. రాజు సభ చాలించును. గృహములకు బోవు ప్రజలంగరు "నరునికంటె మృగం నయం" అనుకొనుచూ వెళ్ళుదురు. సరసమగు సంభాషణలతో వ్రాయబడిన యీ నాటికయందలి సన్నివేశములు హృదయములకు హత్తుకొనును.

## ఎవరు తక్కువ

అవ్యక్తుడైన పరమాత్మ త్రిమూర్తులకు సృష్టిస్థితి లయముల నొసంగును. వింధ్యారణ్యమున తపమాచరించిన బ్రాహ్మణునకు బ్రహ్మ ప్రత్యక్షమై మరల వత్తునని బలికి యదృశ్యుడగును. హరిహరులును భక్తులకు అట్లే చేయుదురు. మేరు పర్వతమును జేరిన త్రిమూర్తులు తమలో తామే యధికులమని కలహింతురు. పిమ్మట శివునకు బ్రహ్మకు జన్యమారంభగును. విష్ణువు బ్రహ్మ హరుల స్థానమున నిద్దరిని నేర్పరచి సృష్టిస్థితి లయాలకు తానే కర్తనని నిర్ణయమును తీసికొనును. చక్రమును ధరించి విష్ణువు రణరంగమునకు వచ్చును. ప్రతి దేవుని పక్షమునను సైనికులు మరణించిరి. విష్ణువు తన చక్రములోనికి "ఆటమిక్ పవర్"ను శూలంలోకి శివుడు "కాస్మిక్ పవర్"ను బ్రహ్మ పాశంలోనికి "హైడ్రోజన్ పవర్"ను నింపి యుద్ధమునకు సన్నద్ధులగుదురు. పరమాత్మ వీరిని గాంచి "యిది ప్రళయము"ని తలచును.

యీ గాథయందలి పాత్రలు పౌరాణికములయ్యును నవీనతను సంతరించుకొన్నవి. పరస్పరము కలహించుకొనుచున్న నేటి ప్రపంచమందలి ప్రబల దేశముల చర్యలిందు వ్యంగ్యముగ భాసించుచున్నవి. ప్రపంచమున యధికముగాగల జనులను ప్రళయరూపమున నియమించుటకే భగవంతుడు దేశాధినేతలనిట్లు పురికొల్పుచున్నాడని కవి చమత్కారముగ సూచించెను.

## అజ్ఞారాధన

"పురుషపరీక్ష" యనెడి సంస్కృతనాటకమునకిదియనువాదము. ఒకానొక దరిద్రకవి మూర్ఖుడైన భూపాలుని జూడదలచి మంత్రితో సంప్రపించును. మంత్రి రాజు అజ్ఞుడని తెలియజేయును. తనకవితచే తృప్తినొందని మందమతిని చూడ సమకట్టును. కవి భూపాలుని ప్రశం

సించును. ఆ ప్రశంసనే గుర్తించలేని నృపుడు కుపితుడగును. మంత్రి "కవి మీపై కావ్యమును వ్రాసిన కీర్తి కలుగున"ని వివరించినను అజ్ఞుడగు రాజు కవిని నిరాకరించును.

నిరాశోపహతుడైన కవి విద్యనేర్చుట వ్యర్థమని కవితను త్యజించును మంత్రి, "అజ్ఞులు గుర్తింపకున్నను బుధులు గుర్తింతురని కవితా త్యాగము గూడ"దని బోధించును. కవి "విరసులకు కవిత చెప్పనను ప్రేరేపింపకుమ"ని సరస్వతిని ప్రార్థించును.

కవుల ప్రయోజనములను వర్ణించు నీ పద్యమును గాంచుడు—

"ఆది నుండియు వాక్కళా స్వాద మెఱిగి
కవుల బూజించి చనిన భూధవుల పేర్లు
పద్యములనేటికిని బాడబడుచు కవులు
బ్రతికియుండియు జగతికి మృతులు కలరు"

"ఆదిరాజ యశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయమ్
తేషా మసన్నిధానేపి నస్వయం పశ్య నశ్యతి" అనెడి కావ్యాదర్శమందలి దండ్యాచార్యుని భావము పై పద్యమున గోచరించుచున్నది.

"నిద్దురమాని దేశికుల నెమ్మది గొల్చుచు శబ్ద శాస్త్రమున్
విద్దెలనింక నెన్నియొ గణించుటయెల్ల వృథా ప్రయాసమే
ముద్దులలచ్చి నీ చజన మోహినియైన ధరాధినేతయున్
మొద్దుయొయైన! భారతి నినున్ గన దుర్గతియే తొలంగిపో"

కవి తనను నిందించుకొనుచు చెప్పిన పై పద్యమందలి తృతీయ పాదమున 'నీచాశ్రయత్వం భో లక్ష్మి జలజాయా స్తవోచితమ్' యనెడి చంద్రాలోక భావము గోచరించును. ఇట్లే,

"లక్షలన్ గూర్చుకొన్న నిరక్షరులను
గని విసర్జింతువే విద్య కవివరేణ్య
పసిడినగల భోగము సాని మిసిమి జూచి
లంజలగుదురె యిల్లాండ్రు మంజు హృదయ"

యనెడి మంత్రి బోధ యందు "విముక్తలజ్జాం గణికాం నిరీక్ష్య కులాంగనాః కింకులటాః భవన్తి" యనెడి సమయోచిత పద్యమాలిక యందలి సుభాషితార్థము కన్పట్టుచున్నది.



1. తను జెప్పు ధర్మమునకే
తను దప్పుట ధర్మమగునె! (మురానుకన్య)

2. ఆర్ద్రహృదయము ప్రాక్తనాహ్లాదకమె (వత్సలుడు)

3. మలుపులెఱిగిన కఠినమే మార్గమందు
పయనమయ్యెను తప్పుత్రోవలకుఁబోదు (వత్సలుడు)

## Chapter - V

# ఆధ్యాత్మిక గద్య గ్రంథములు

## కృష్ణబోధ

శ్రీ అంబటిపూడి వేంకటరత్నకవిగారు శ్రీకృష్ణభక్తులు. శ్రీ కృష్ణుని వర్ణించుచు గద్యముల వ్రాయుటయేగాక కృష్ణప్రభూ యనెడి మకుటముతోనే బ్రహ్మసూత్రములను, సంధ్యావందన మంత్రములను యనువదించుట జరిగినది. కృష్ణ సంబద్ధములైన వన్నియు వీరికానంద మును గూర్చును. పరబ్రహ్మ స్వరూపుడగు శ్రీకృష్ణుని తత్త్వము నుప దేశించునది శ్రీమద్భాగవతమే. భాగవతము రసాలయమని మూల మున నిట్లుగ్గడింపబడినది.—

"నిగమకల్పతరోర్గళితం ఫలం శుకముఖాదమృతద్రవ సమ్మితమ్
పిబత భాగవతం రసమాలయం ముహురహోరసికా భువిభావుకాః"

"భాగవతమ్ము తెలిసి బలుకుట చిత్రంబు
శూలికైన తమ్మి చూలికైన" అని పోతన తన యభిప్రాయ మును దెలిపెను. "విద్యావతాం భాగవతేపరీక్షా" యని శ్రీమద్భాగ వతము పండితుల మేధాశక్తికి నికషోపలమని పేర్కొనబడినది.

ఇట్టి శ్రీమద్భాగవతము నందలి ఏకాదశస్కంధమును "కృష్ణ బోధ" యనుపేర ననువదించిరి. భాగవతమందలి యేకాదశస్కంధమున సప్తదశాధ్యాయము నందు గృహస్థధర్మములిట్లు ప్రతిపాదింపబడినవి.

"వేదాధ్యాయనస్వధాస్వాహాబల్యన్నాద్యైర్యథోదయమ్
దేవర్షిపితృభూతాని మద్రూపాణ్యన్వహం యజేత్

యదృచ్ఛయోపపన్నేన శుక్లేనోపార్జితేనవా
ధనేనాపీడయన్ భృత్యాన్న్యాయేనైవాహరేత్క్రతూన్
కుటుంబేషు నసజ్జేత నప్రమాద్యేత్కుటుంబ్యపి
విపశ్చిన్నశ్వరం పశ్యేదదృష్టమపి దృష్టవత్
పుత్రదారాప్తబంధూనాం సంగమః పాంథసంగమః
అనుదేహం వియన్త్యేతే స్వప్నో నిద్రానుగో యథా
ఇత్థంపరిమృశన్ ముక్తో గృహేష్వతిథివద్వసన్
నగృహైరనుబధ్యేత నిర్మమో నిరహంకృతిః
కర్మభిర్గృహమేధీయై రిష్ట్వామామేవ భక్తిమాన్
తిష్ఠేద్వనం వాప్రవిశేత్ప్రజావాన్ వా పరివ్రజేత్
యస్త్వాసక్తమతిర్గేహే పుత్రవిత్తైషణాతురః
స్త్రైణః కృపణధీర్మూఢో మమాహమితి బధ్యతే.
అహోమే పితరౌవృద్ధౌ భార్యా బాలాత్మజాః ప్రజాః
అనాథాః మామృతే దీనాః కథం జీవన్తి దుఃఖితాః
ఏవం గృహాశయాక్షిప్త హృదయో మూఢ ధీరయమ్
అతృప్తస్తాననుధ్యాయన్ మృతోఽంధంవిశతే తమః"

పై గృహస్థధర్మవివరణ పరభాగవతమునకు రత్నాకవిగారి సరళ గద్యామవాదమును గాంచుడు —

"గృహస్థుడు ప్రతిదినము వేదాధ్యయనము చేయుచు స్వాహా స్వధానామపదోచ్చారణచేతను బల్యన్నాదులచేతను దేవర్షిపితృభూతమ్ములను నా స్వరూపులనుగా భావించి సమర్పింపవలయును. యాదృచ్ఛికముగా ప్రాప్తమైనదిగాని పిత్రార్జితముగాని స్వార్జితముగాని అయిన ధనముతో శక్తినిబట్టి తనవారిని ఇబ్బందిపాలుసేయక న్యాయమార్గమున క్రతువులు జరపవలెను. కుటుంబమున సక్తుడు కారాదు. కుటుంబియైనను

భగవంతుని మఱువరాదు. వివేకియైనవాడు స్వర్గసుఖము కూడా నైహిక సుఖమువలె నశించునని గ్రహింపవలెను. భవిష్యత్తున కలుగు సుఖము వర్తమానసుఖమువలె నశ్వరమని భావింపవలెను. పుత్ర దారాప్తబంధుజనసంగము బాటసారులకు కలుగునట్టి సంబంధము వంటిది. నిద్రకును స్వప్నమునకును గలసంబంధమును పోలినది. నిద్రపోగా స్వప్నము పోవును దేహముపోగా సంబంధము పోవును. ఈప్రకారము విమర్శించి చూచి గృహమునందు నతిథివలె వసింపవలెను. అట్లున్నచో అహంకార మమకారములంటవు. గృహము గృహస్థునకు బంధముకాక మోక్షమునిచ్చును. నాయందలి భక్తితో కర్మలాచరించు చున్నచో గృహస్థుగా నుండవచ్చును. సంతానవంతుడయినచో వాన ప్రస్థుడు గావచ్చును. లేదా సన్యసించవచ్చును. కాని గృహమున బంధింపబడి పుత్రవిత్తవాంఛలతో స్త్రీకి లోబడి యామె మాట వినుచున్నచో అట్టి లుబ్ధుడు మూఢుడు అహంమమాభిమానముచే కట్టబడియుండును. నాతల్లి దండ్రులు వృద్ధులు. నా భార్యా బిడ్డలు చిన్నవారు, అమాయకులు. నేను లేకున్న వారు దిక్కులేనివారగుదురు. ఎట్లు బ్రతుకుదురు? ఈవిధముగా గృహభావబద్ధుడైన మూఢబుద్ధి తృప్తిలేనివాడై అనే భావములను అనుక్షణము ధ్యానించుచు తుదకు మరణించి అంధతమస్సును ప్రవేశించి తిర్యగాది యోనులందు జన్మింపగలడు."

యథామూలము గ్రంథకర్త్రభిప్రాయముఁ దెలియజేయుచు పామరులకు సైతము సరళగద్యమున కృష్ణబోధనందించిన రత్నకవిగారు సఫలీకృతయత్నులనవచ్చును. ఇట్లే గ్రంథమంతయు సరళసుందరముగ సాగినది. ఇట్లు మూలముతో పోల్చి యీ గ్రంథము స్థాలీపులాక న్యాయముగ సమీక్షింపబడినది.

## సంధ్యావిద్య

సంధ్యావందనం అర్థంలేని యాచారంగాకూడదనే యభిప్రాయముతో కవిగారీ గ్రంథమును రచించిరి. భక్తికర్మజ్ఞానమార్గాలలో దేని ప్రాశస్త్యం దానికుంది.

రవీంద్రనాథటాగూరు రచించిన personality అను గ్రంథమునందలి Meditation అను అధ్యాయమే కవిగారి సంధ్యావిద్యయను గ్రంథము రచింపబడుటకు కారణము. పాశ్చాత్యులు సైతము సంధ్యావందనమాచరించి వైజ్ఞానికదృక్పథముతో పరిశీలించి బుద్ధిదీప్తి నొసగుటనుగాంచి విస్మయమందిరి. ఈ గ్రంథము శుభకృన్నామ సంవత్సర వైశాఖమాసమున ముద్రింపబడినది. ఈగ్రంథమందు ఉపాసనాప్రక్రియనూర్చి వేంకటేశ్వరదీక్షితులు ఐ. కె, తాయెమ్మా యిచ్చిన అభిప్రాయములు గలవు.

గ్రంథమందలి యీమంత్రమును దాని వివరణమును అవలోకింపుడు.

"భూమిరంతరిక్షం ద్యౌరిత్యష్టావక్షరాణి హ్యష్టాక్షరగ్ం హవాఏకంగాయత్రై పదన్"

"భూమియు ఆకాశము. స్వర్గమును గాయత్రియొక్క ఎనిమిది అక్షరములుగల మొదటిపాదము. భూమిః అను పదమునందలి భూ అను అక్షరము మొదలు ద్యౌః అనుపదమునందలి ద కారయకారముతో ఈఎనిమిది యక్షరములగుచున్నవి. ఈఎనిమిది యక్షరములు గాయత్రి ప్రథమపాదమునందలి ఎనిమిదియక్షరములు. మొదటిపాదమేమి? అది త్రిలోకస్వరూపము, గాయత్రియందలి తొలిమూడు వ్యాహృతులు ఏలోకములను చెప్పుచున్నవో ఆమూడులోకములు ఈప్రథమపాదము వలన తెలియవచ్చుచున్నవి. ఈవిషయమునే వేదము "ఏతదుహైవా అస్యాః ఏతత్" అని చెప్పుచున్నది. ఈత్రిలోకస్వరూపము గాయత్రియందలి ఎనిమిది అక్షరములుగల మొదటిపాదము."

ఇట్లే సంధ్యావందన రహస్యము లన్నియు సవివరముగా నీగ్రంథ మున ప్రతిపాదింపబడినవి ఇందు భస్మధారణము, సంధ్యాకాలనిర్ణయము, మార్జనము, యజ్ఞోపవీతధారణవిధి మొదలగు బహువిషయములు నిరూపింపబడినవి. సంధ్యావందన మవశ్యకరణీయమని మనుస్మృతియందిట్లు గలదు.

"నతిష్ఠతితుయఃపూర్వాం నోపాస్తేయశ్చ పశ్చిమామ్
సశూద్రవద్బహిష్కార్యః సర్వస్మాద్ద్విజకర్మణః"

సంధ్యావిద్యను గూర్చి సమగ్రముగనిట్టి గ్రంథమును వ్రాయుట సమంజసము

## ప్రస్థానత్రయోపోద్ఘాతము

విశ్వసంస్కృతికి మతం చాలా అవసరం. what is relegion అన్న దానికి Relegion is that which makes brute aman and man aGod. అవి వివేకానందుడు సమాధానము కొసంగెను. ప్రత్యేకజ్ఞానము చే యథార్థజ్ఞానము కలుగునని గ్రహింపవలెను. ఉపనిషత్తులను హిందూ మతగ్రంథములనవచ్చును. బాదరాయణుడు వ్రాసిన బ్రహ్మసూత్రములు ఉపనిషత్తులు, భగవద్గీతకు ప్రస్థానత్రయమని పేరు. శంకరమధ్వరామానుజాదులీ ప్రస్థానత్రయమునకు స్వసిద్ధాంతానుగుణముగ భాష్యములను రచించియుండిరి.

ఈ ప్రస్థానత్రయమును గూర్చి వెంకటరత్న కవిగారు ప్రస్థానత్రయోపోద్ఘాతమును రచించిరి. ఉపనిషద్వాక్యములను ప్రమాణముగ గొని చర్చింపబడు శాస్త్రము వేదాంతము. సూత్రములలో విషయములు సూక్ష్మముగ నుండును. గమనార్హములైన యిరువదినాలుగు విషయముల నిందుదాహరించియున్నారు. లోకమున సమవాయి కారణాసమవాయి కారణ నిమిత్తకారణములని ప్రతి వస్తువునకుమూడు కారణములుండును. ఇందులకు కారికావళియందు.

"సమవాయికారణత్వం జ్ఞేయమథాప్యసమవాయిహేతుత్వమ్
ఏవం న్యాయనయజ్ఞైః తృతీయముక్తంనిమిత్త హేతుత్వమ్" యని

గలదు. లోకమందువలె నిమిత్తోపాదాన కారణములు భిన్నములుగా వలెననెడి నియమము వేదాంతశాస్త్రమునందు లేదు. కావున బ్రహ్మమే నిమిత్త కారణము, యుపాదానకారణమునగును. బ్రహ్మము సాకారము, నిరాకారమునగును. జీవులు బ్రహ్మముయొక్క పరాప్రకృతి స్వరూపులు జీవులు నిష్కామ కర్మచెయ్యాలి.

భగవద్గీత బహుభాషలయందనూదితము. అరవిందుడు, రాధాకృష్ణుడు మొ॥ వారు నవీన వ్యాఖ్యానముల జేసిరి. జీవప్రవృత్తిని దాటుటకిది తెప్ప. త్రిషట్కములయందు త్వం, తత్, అసి అనువానిన వ్యాయింతురు. ఇందు కర్మ భక్తి జ్ఞాన విభాగములుగలవు. గీతలోని యీ క్రింది శ్లోకములకు వీరి యనువాదము.

"అక్షరం బ్రహ్మపరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః"

"అర్జునా! వినాశములేనిది మూలకారణమగునది పరమ బ్రహ్మమునది ప్రతి దేహమున ప్రత్యగాత్మభావము నొందుట అధ్యాత్మము. జీవుల సృష్టిస్థితులకు కారణమగు ద్రవ్య త్యాగ రూపమగు యజ్ఞమే కర్మ యనబడుచున్నది.

"ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్
ఛందాంసియస్య పర్ణాని యస్తంవేద సవేదవిత్" (15అ. 1శ్లో)

"ఈ సంసారవృక్షమునకు మూలమూర్ధ్వముగ మున్నది. దీని శాఖలు క్రిందుగనున్నవి. కర్మకాండకు మూలములగు వేదములు దీనికి పత్రములు. అనాది తఃశీకమునగు యీ సంసారమును వేదశాస్త్రి

పురాణములు వ్రతముతో పోల్చినవి. దీనిని తెలిసికొనినవాడే వేదజ్ఞుడు." ఈ రీతిగా కవిగారి యనువాదము సాగినది

ఉపనిషత్తులకును వీరు సరళానువాదము జేసిరి. మూలము, వీరి యనువాదమిట నుదహరింపబడుచున్నది.

"హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్
తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే"
(ఈశావాస్యోపనిషత్ 15)

"ఆదిత్యమండలస్థుడైన బ్రహ్మయొక్క ముఖము జ్యోతిర్మయపాత్రచే గప్పబడి యున్నది. ఓ పూషా! సత్యధర్మముల కొఱకు యనగా ఆత్మోపలబ్ధి కొఱకు దానిని తొలగించుము."

"శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో య
ద్వాచో హ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః
చక్షుషశ్చక్షు రతిముచ్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి" (కేనోపనిషత్ - 2)

"శ్రోత్రమునకు శ్రోత్రమై మనసును మనస్సై వాక్కునకు వాక్కై ప్రాణమునకు ప్రాణమై చక్షువునకు చక్షువై ధీరులైన పురుషులు యీ లోకము నుండి ముక్తులై అమృతులగుచున్నారు." ఇట్లు ప్రస్థానత్రయోపోద్ఘాతము సరళముగ సాగినది.

శ్రీమద్భాగవతముయొక్క మాహాత్మ్యము పద్మపురాణోత్తర ఖండమందు వర్ణింపబడినది. భాగవతరసపానమత్తులైన రత్నకవి గారు సరళముగ ననువదించి యుండిరి. ఇది అముద్రిత గ్రంథము.

శ్రుతి గీతలు బ్రహ్మవిద్యా ప్రతిపాదకములు. అట్టి శ్రుతిగీతలు కవిగారిచే సరళ గద్య రూపముననను వదింపబడినవి. ఇవి అసంపూర్ణ ములు, అముద్రితములు. గ్రంథమును పూర్తిచేయకనే కవిగారు దివంగతులగుట మన దురదృష్టమని చెప్పవచ్చు.

వాల్మీకి రామాయణమునందలి యుత్తరకాండమునననేకరహస్య ములిమిడియున్నవని విజ్ఞులందురు. అట్టి వాల్మీకి రామాయణోత్తర కాండమును శ్రీ అంబటిపూడి వెంకటరత్న కవిగారు సరళ రూపమున ననువదించిరి. ఈ ఉత్తరకాండానువాదము రాతన సంవత్సరమున (1976) సాగినది. సాధారణులకును పురాణములవగతమగుటకిట్టి గ్రంథము అవసరము.

## షడ్దర్శనములు

ఇదియొక గ్రంథమునకనువాదము. అముద్రితము. న్యాయ వైశేషిక సాంఖ్యయోగకర్మబ్రహ్మమీమాంసలనెడివి షడ్దర్శనములని వ్యవహరింపబడుచున్నవి. షడ్దర్శనములకు ఋషులు సూత్ర గ్రంథము లను నిర్మించిరి. అనంతర విద్వాంసులు వానికి భాష్యములను గూడ రచించిరి. సాధక భేదములబట్టి దర్శనములుండుటచే పరస్పరము భేదమున్నట్లు గాన్పించును. ఈ విషయమే వ్యాసులవారిచే—

"సప్తానాం జ్ఞాన భూమీనాం సాధకస్యైకలస్యచ
భేదాద్విరోధ ఇత్యేవం దర్శనేషు ప్రతీయతే"

అని చెప్పబడినది.

గౌతమ మహర్షికృత న్యాయదర్శన ప్రథమ సూత్రమిట్లున్నది. "దుఃఖ జన్మప్రవృత్తిదోషమిథ్యాజ్ఞానానాముత్తరాపాయే తదనన్తరా పాయాదపవర్గః" వైశేషికదర్శన కర్త కణాదమహర్షి నిశ్శ్రేయససిద్ధి

నిచ్చు ధర్మమును వాఖ్యానింతునని నాడు. "అథాఽతో ధర్మం వ్యాఖ్యా స్యామః యతోఽభ్యుదయ నిశ్శ్రేయస సిద్ధిస్సధర్మః" (వై. సూ.). పతంజలి యోగదర్శనకర్త. "క్లేశకర్మవిపాకాశయై రపరామృష్టః పురుష విశేష ఈశ్వరః" అని ఈశ్వరుని నిరూపించియున్నాడు. ప్రకృతి పురుష వివేకము వలన ముక్తి కలుగునని సాంఖ్యము చెప్పును. త్రివిధ దుఃఖ రాహిత్యమే మోక్షమని కపిలముని సాంఖ్య దర్శనమునని ట్లనిరి. "అథ త్రివిధ దుఃఖాత్యన్తనివృత్తి రత్యన్త పురుషార్థః" కర్మ మీమాంసా దర్శన కర్త జైమిని కర్మబోధకత్వమే వేదములకు గలదని అందుకే వేదములు ప్రమాణములని యిట్లనిరి. "ఆమ్నాయస్య క్రియార్థత్వా దానర్థక్య మతదంగానామ్". కర్మాచరణమే మానవులకు ముఖ్యమని యీ దర్శనము బోధించును. కర్మాచరణ గూర్చి మహాభారతమునం దిట్లున్నది. "కర్మణామీ భాన్తి దేవాః పరత్ర కర్మణైవేహ ప్లవతే మాతరిశ్వా" బ్రహ్మజ్ఞాన ప్రతిపాదకము బ్రహ్మ మీమాంసాదర్శనం. "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" యని యారంభించి బాదరాయణులు సూత్రముల రచించిరి. బ్రహ్మమే కోశోపాధులవలన జీవుడగును. ఈ విషయము "కోశోపాధి వివక్షాయాం యాతి బ్రహ్మైవ జీవతాం" అని పంచదశిలో గలదు. జీవుడు బ్రహ్మయగుటయే మోక్షము.

షడ్దర్శనముల గూర్చి సరసముగ వ్రాయబడిన గ్రంథమిది. ఇతర గ్రంథములనుండి సందర్భానుసారముగ ప్రమాణములిందుదాహృతములు. ఇందు మహర్షుల వచనమిట్లు నిర్దేశింపబడినది. "ఆగమేనాను మానేన ధ్యానాభ్యాస బలేనచ తథా ప్రకల్పయన్ ప్రజ్ఞాం లభతే యోగముత్తమమ్" (వ్రాత ప్రతిలో 105వ పుట) నాశమును గూర్చి మూల గ్రంథం నుండి "అదావపేక్షా బుధ్యాహి నశ్యేదేకత్వ జాతిభిః, ద్విత్వాదయస్సమంపశ్చాత్ సాచతజ్ఞాతి బుద్ధితః" (వ్రా. ప్ర. 48) అనుకారిక లెస్సగా వ్యాఖ్యాతమైనది. సంశయ జ్ఞానముత్తరోత్తర కార్యముచే నశ్వరమని చెప్పబడినది. కారికావళియందలి "స్వర్గా

దయోఽష్టౌ—" యను కారిక వ్యాఖ్యానింపబడింది. ద్రవ్యములగుణ భావ చక్రము వేయబడుట యిందలి విశేషము.

నూట పదునాల్గవ పుటయందు శారదాతిలకమను గ్రంథము నుండి షట్కర్మనిరూపణపరమగు శ్లోకముదహరింపబడినది. ప్రస్తావ వశమున నిపాతోపసర్గల స్వరూపము వివరింపబడినది. సాంఖ్యదర్శన సమయమున ఈశకృష్ణప్రోక్తమగు కారిక లుదహరింపబడినవి. ఈ గ్రంథముముద్రింపబడి ముముక్షుజనులనలరించు గాక.

## భారతీయ తత్త్వసమీక్ష

భారతదేశమందావిర్భవించిన దర్శనములు, వానియందలి పర స్పర భేదములు, సర్వవిధముల సమంజసమగు పక్షమేది? యనెడి యంశములిందు మేధాసంపన్నులైన రత్నకవిగారిచే సమీక్షింపబడినవి. సుఖమననేది? దుఃఖమననేమి? యని చర్చింపబడినది. "ముముక్షుత్వం విరాగిత్వం తీవ్రం యస్యతువిద్యతే, తస్మిన్నే వార్థవ న్తస్స్యుః ఫలవ న్త శ్శమాదయః" యని వివేక చూడామణి వాక్యానుసారము ముము క్షుతా విరాగితలు గలవానికి వస్తువు వలన సుఖముండదని నఖ క్షతాదులవలనను అతనికి సుఖము లేదని కారికనుదహరించి వ్యాఖ్యా నించిరి.

"వస్తుత స్తదనిర్దేశ్యం నహివస్తువ్యవస్థితమ్
కామినీనవకేభ్యోఽపి నసుఖం శాంతచేతసామ్" (22 వపుట)

ఇన్లైనలుబదియవ పుటయందు భామతీగ్రంథ పంక్తియుదహ రింపబడి నది. ఉదయనాచార్యుని కారికయు నిరూపింపబడినది. "శంకా చేదను మాఽస్త్యేవనచేచ్ఛంకా తత స్తరామ్" (59 పు). కూర్మపురాణ ముందలి,

"శ్రుతిసాహాయ్య రహితమనుమానం నకుత్రచిత్
నిశ్చయాత్సాధయేదర్థం ప్రమాణాంతరమేవతత్" యనెడి

శ్లోకము వేదోపోద్బలకమగుననుమానమునే వాడవలయుననుసత్యము ఉట్టంకింపబడినది. (60వ పుట). కేవలానుమానముచే ధర్మము సిద్ధింపదని వేదమే ధర్మమూలమని, ఋషులకును వేదమూలముగనే జ్ఞానము కలిగినదని చెప్పు యీక్రింది భర్తృహరి వాక్యపదీయమందలి కారికసమీక్షింపబడినది.

"నచాగమాదృతేధర్మః తర్కేణావ్యవతిష్ఠతే
ఋషీణామపి యద్జ్ఞానం తదప్యాగమహేతుకమ్"(107వపుట)

సర్వజ్ఞాత్మ మహాముని చెప్పిన "ఆరంభవాదః కణభక్షపక్షః——— వేదాన్త పక్షస్తు వివర్తవాదః" అను సిద్ధాంతముద్ధృతము. [ 64వపుట [వాతప్రతి] వ్యాకరణశాస్త్రముగూడ బ్రహ్మజ్ఞానమును గలిగించును. వైయాకరణులు పరబ్రహ్మ సాక్షాత్కారమునకు ముందు శబ్దబ్రహ్మ సాక్షాత్కృతిగావలయునని పల్కుదురు. "శబ్దబ్రహ్మణినిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి" యని సర్వదర్శన సంగ్రహమున వ్యాకరణ దర్శనాంతమున చెప్పబడినది. ఇట్టివ్యాకరణమును గూర్చిన భర్తృహరి ప్రశంసావాక్యమిందీ విధముగ స్థాపింపబడినది.

"ఆపః పవిత్రం పరమం పృథివ్యాం అపాంపవిత్రం పరమం చమంత్రాః
తేషాం చసామర్గ్యజుషాం పవిత్రం మహర్షయో వ్యాకరణం
నిరాహుః"[269 వపుట]

వ్యాకరణ పరమోద్దేశము పదార్థ మీమాంసయే. ఇట్లన్ని దర్శనములను సమీక్షించి గుఱ్ఱపు పందెములలో గెలిచిన గుఱ్ఱమువలె శాంకరదర్శన మన్నిటిని గెలిచినదని సిద్ధాంతీకరింపబడి గ్రంథము పూర్తిచేయబడినది.

## వేదాన్తసారము

సంస్కృతసాహిత్య ప్రపంచమున సదానందమునిచే రచింపబడిన వేదాన్తసార మనెడియాధ్యాత్మిక గ్రంథమున కత్యంత ప్రాచుర్యము గలదు. ఈవేదాన్తసారమునకు ముందు హిందీయాముఖము గలదు. హిందీలోగల యీ ఉపోద్ఘాతమున గణనీయములగు విషయములుండు టచే యీఉపోద్ఘాతముతో కలసి వేదాన్త సారమును రత్నకవిగారు "దార్శనికపరిచయము"ను పేరననువదించిరి. 1958 వసంవత్సరమున ఆంధ్రపత్రికయందిది ముద్రింపబడినది. ఇందలి ప్రతివాక్యమునుగొని సమగ్రముగా కవిగారనువదించిరి. మూలమందలి కొన్నివాక్యములను వానికి కవిగారొనరించిన యనువాదమును గొనియిట పరిశీలింతము.

## మూలము

"ఆత్మనః సంసారకారణత్వమ్. శక్తిద్వయజ్ఞానోపహితం చైతన్యం స్వప్రధానతయా నిమిత్తం స్వోపాధిప్రధానత యోపాదానం భవతి. యథాలూతా తంతుకార్యంప్రతి స్వప్రధానతయా నిమిత్తం స్వశరీర ప్రధానతయో పాదానంచ భవతి"

## అనువాదము

"ఏప్రకారము సాలెపురుగు తంతుకార్యమున స్వప్రధానతచేత నిమిత్తకారణమును స్వశరీరప్రధానతచేత ఉపాదానకారణమగు చున్నదో ఆప్రకారమే శక్తిద్వయముగల అజ్ఞానముచేత నిమిత్తకారణమును స్వోపాధిప్రధానతచేత యుపాదాన కారణము అగుచున్నది."

"అల్పాక్షరమ సందిగ్ధం సారవద్విశ్వతోముఖమ్" అనునట్లు సదానందయోగి వేదాన్తశాస్త్రములయందలి సారాంశము నంతను దెచ్చి యీలఘుగ్రంథమును రచించినాడు. ధర్మరాజాధ్వరీంద్ర కృత

ముగు అద్వైతవేదాన్త పరిభాషయను గ్రంథమున వేదాన్త విషయ మంతయు ప్రతిపాదింపబడినను యందలి రచనాశైలియత్యంత కాఠి న్యము గలది. వేదాన్తసారమందలి శైలి మృదులము దృగ్దృశ్యవివే కము, హస్తామలకస్తోత్రము, వేదాన్తపంచదశి. శ్రుతులు మొ॥ ప్రామా ణిక గ్రంథములయందలి ప్రమాణములతో మూలకర్త యీగ్రంథమును రచించెను. కవిగారనువదించుట ఎంతేని ప్రశస్యము.

## తాత్త్విక తరంగాలు

John Dewey వ్రాసిన 'Reconstruction in Philosophy' అనే ఆంగ్ల గ్రంథం "తాత్త్విక తరంగాలు" అనే నామధేయంతో రత్నకవి గారిచే 1960లో అనువదింపబడినది. ఆంగ్ల గ్రంథంలో ఎనిమిది భాగ ములు గలవు. ఆ భాగాల పేర్లు ఇలా వున్నాయి.

1) Changing conceptions of Philosophy 2) Some historical factors 3) The Scientific factor in Reconstruction of Philosophy 4) Changed conceptions of experience and reason 5) Changed conceptions of the ideal and real 6) The significance of logical reconstruction 7) Reconstruction in moral conceptions 8) Reconstruction as effecting social Philosophy.

ఈ ఆంగ్ల గ్రంథమునగల మూలకారుని పరిశోధితాంశములను ఆంబటిపూడివారు పాఠకులను ప్రభావితము చేయురీతి తాత్త్విక తరం గములలో నిరూపించిరి. ఇందలి అతి ముఖ్యమైన కొన్ని విషయముల నీ క్రింద పొందుపరచుచుంటిని.

తర్కము ప్రయోగ విషయమున నిరూపితము గాకున్న నైరు ధ్యములనంతములై సమన్వయము లేనిదై పరిహాసాస్పదమగును. జ్ఞాన మనగా శుద్ధధ్యానాత్మకము. అరిస్టాటిల్ "చరమాదర్శ సత్యమును

శుద్ధ మనస్సు పొందినపుడు పరమోన్నత పదవి లభించును.” అని నుడివినాడు. Plato, Aristotil, Platinus, Marcus, Arivious, Saint Thomos మొదలగు వారందరూ పరమ సత్యము, పరిపూర్ణాదర్శము, జ్ఞాన పూర్ణము అనియో, ఆదర్శ జ్ఞానములు దానికుండవలసిన ప్రధాన గుణములనియో చెప్పిరి. గ్రంథకర్త చివరి యధ్యాయములో “వ్యక్తి లోబడియుండుట యెందుకనగా అనుభవముయొక్క ఆదానప్రదానము ఇతరులతో చేయకున్నయెడల అతడు మూగగా పశువుగా నిలచిపో గలడు” అనెను. ప్రజాస్వామ్యము రాజకీయముగా విఫలమగుట యెందు కనగా పూర్వమునుండి వచ్చుచున్న వ్యక్తి సంఘములు సిద్ధములని దేనికదే లక్ష్యమని తలచుటయే కారణము. ఇంకను “కవిత్వము, కళ మతము” మిక్కిలి విలువ గలవని సహేతుకముగా నిరూపింపబడినది.

ఋషుల వేదాన్త సిద్ధాంతములనర్థము జేసికొనలేక శ్రమపడు చుండ వివేక విజ్ఞాన సహితముగా వానిని విశ్లేషించిన మహత్తరాంగ్ల గ్రంథమును మాతృభాషయందనువదించి మనకు విజ్ఞాన జ్యోతినొసంగిన రత్నకవిగారు వంద్యులు.

## భారతీయసంస్కృతి

ఆంగ్లమున శశికుమారమిత్రరచించిన “The cultural empire of India” అను వ్యాసమునాధారముగాగొని “భారతీయసంస్కృతి” యను గ్రంథమును రచించిరి. ఈగ్రంథము 1957 ఆదివారం పత్రిక లలో వరుసగా ప్రచురితమైనది. పిమ్మటయీగ్రంథము 1974లో “సాహితీసమితి” ద్వారాగ్రంథరూపమున వెలువడినది. గ్రంథరూప ముగా వెలుగులోకి వచ్చుటకు శ్రీ మిట్టపల్లివిశ్వనాథం గారార్థికముగా తోడ్పడిరి. ఈగ్రంథమును గూర్చి యభిప్రాయములు.

“రచయిత ఉభయభాషాకోవిదులు” —భారతి 74. అక్టో. అంగీరస.

"ఆనేతవిజ్ఞాన విషయములతో గొప్పగానున్నది." —ఆంధ్రప్రభ 23-10-1974.

"గ్రంథం చాలావిలువైనది." —వారపత్రిక — శర్మ.

నల్గొండలోని నాగార్జున కళాశాలాంధ్ర శాఖాధిపతియగు శ్రీ భూళిపాళ శ్రీరామమూర్తిగారు గ్రంథమున కాముఖమును వ్రాయుచు గ్రంథమందలి విషయము లద్భుతములని శిష్యవాత్సల్యమునకు, గురుభక్తికి రత్నకవిగారే యుదాహరణ భూతులనినుడివిరి.

బైబిలునందలి ఆదామ ఈవులగాధ శ్వేతాశ్వతరోపనిషత్తు నందలి "ద్వాసుపర్ణాసయుజౌసఖాయా" అను మంత్రమందలి గాధయే ఆత్మ ఆదాము, జీవుడు ఈవు అశ్వత్థము యాపిల్ చెట్టుగా మారినవి. కృణ్వన్తో విశ్వమార్యమ్" అనునది భూమియంతయు నార్యావర్తము గావలయునని చెప్పను. క్రీ.పూ. 10 వశాతాబ్దినుండి ఆర్యావర్తమునకు ఐరోపాతో సంబంధము గలదు. లిథూనియాలో హిందువుల ఆలయములు, యాదవ, కురు, పురు నామములుండుటచేత భారతీయ సంస్కృతియట వ్యాపించినదని తెలియుచున్నది. తేల్స్, అవాక్సి మాండల్ మొదలగు గ్రీకుతత్త్వవేత్తలు జలమునుండి, యాకాశము నుండి భూతములుద్భవించినవని చేసిన సిద్ధాంతములు వైదికసిద్ధాంతములే. గ్రీకుదేశమునకు వెడలిన పృధ్వీగురు పండితుడే పైథాగరస్ గా (1550 బి సి) మారినాడు. పైథాగరస్ సిద్ధాంతాలకు సాంఖ్యమునకు దగ్గర సంబంధంగలదు. ఆర్మీనియాలో క్రీ. పూ 2,3 శతాబ్దులలో కృష్ణపూజలుండెడి వనుటకు చారిత్రకాధారములు గలవు. రాయల్ పండితుడు, పాశ్చాత్యవైద్యశాస్త్రజ్ఞుడు మెటీరియా మెడికా గ్రంథమందలి విషయములను భారతదేశమునుండే గ్రహించెనని నిరూపించెను.

ఇస్లాంమతము ప్రభవించుటకు పూర్వము అరేబియాలోని హిందువులు మక్కేశ్వరుని పూజించెడివారనుటకు చారిత్రకాధారములున్నవి. కంబోడియాలోని ప్రజలు హిందువుల వర్ణవిభజనను పాటించెడివారు. నాల్గవశతాబ్దము నందలి సంస్కృతశాసనము మంగ్ సిటీవ్ వద్ద లభించినది. చంపానగరమున నూటికిపైగా సంస్కృతశాసనములు లభించినవి.

ఫ్రెంచి మత ప్రచారకులైన ఐర్మధజీ సూట్ లు వేదములను సంస్కృత గ్రంథములను అనువదించిరి. విల్కిన్స్ భగవద్గీతననువదించెను. షోపెన్ హావర్ యుపనిషత్తులవంటి గ్రంథములు ప్రపంచ సాహిత్యమందు లేవనెను. మెసాచుసెట్స్‌లో ఎమర్సన్ గీతనభినందించెను. క్రాకో యూనివర్సిటీ నుండి శాంతినికేతనమునకు వచ్చిన స్టాసియాన్ క్ పండితుడు 1936లో అనర్గళముగా గైర్వాణీ భాషను మాట్లాడెను. జ్యోతిశ్శాస్త్రవీధి యను పేరుగల యస్. చంద్రశేఖర్ ను 1949లో రస్సెల్ ఉపన్యాసమునకు అమెరికా ఆహ్వానించినది. ఈతడు స్టెల్లర్ డైనమిక్స్ విషయంలో రచనను పురస్కరించుకొని అంతర్జాతీయ శాస్త్రజ్ఞుడైనాడు. ఇట్లు అనేక విషయములిందు సూచింపబడినవి. ప్రతి వాక్యమునందును విశేషమున్నదని పెద్దలు కొనియాడి యుండిరి.

---

1\. పల్లెలబాగుకై సభలబల్కుదురో ప్రతిప్రతికాముకుం
బల్లనిలుంగ వ్యాసముల నొప్ప గజేతురొ; అంతెగానిషౌ
పిల్లుచు గంజికై ఋణపు శృంఖలన్ నిలువెల్ల నిరుగా
గుల్లెడి రైతునాదుకొన కోరెడిసోదరుడేడి పుట్టెనే! (రైతుచెలి)

# Chapter - VI

## ఆంగ్ల గ్రంథసమీక్ష

### REFLECTIONS

రత్నకవిగారు స్వతంత్రముగా రచించిన యీ యాంగ్ల గ్రంథము నందు ఇరువదియేడు పద్యములు గలవు. ఆంగ్లమునందును కవిగారు కవిత చెప్పగలరనుటకు యీ గ్రంథమే తార్కాణము.

ఒకానొక మేఘము కీర్తిప్రకాశములనందుటకు చంద్రబింబ సమీప మునకొచ్చినది. మేఘమనెడి జవనిక తొలగగా చంద్రబింబమే మోముగాగల రాణి కనుపించినదనెడి ఈ పద్యమును గాంచుడు—

How vain is your trouble O! Cloud .
You come before the moon to shine
and win fame
But indeed the Queen is more
Curiously seen through the screen" 3rd Poem

ప్రకృతి కాంత క్రీడించు సమయమే రాత్రి. ఆమె నేకాంతముగా కలువ గల ధైర్యశాలి యెవడు? కాని ధీరుడైన నాయకుడు మాత్రమా పాణి నందుకొనును. ఈ భావముగల పద్యమును ఆస్వాదింపుడు—

"Night is the play time nature
Who is brave then to meet alone
The hero is sure to wind her hand" 6th Poem

ఇట్లు మృదుమధుర భావసంయుత మగు నీకావ్యమును ఆంగ్లాభిమానులు ఆస్వాదింతురుగాక.

---

1) తల్లియొసగెడిపాలు తెలుగే
తండ్రిగరపెడి పలుకు తెలుగే
తరుణిచూపెడి వలపు తెలుగే తెలియరా
మన బ్రతుకు బ్రతుకే తెలుగురా. (తెలుగు బ్రతుకు)



చందూరు ఆంధ్రరత్న విజ్ఞాన నిలయ వార్షికోత్సవ సందర్భంలో
సాహితీ మేఖల సభ్యులు



శిష్యబృందం, కుమారులతో రత్నకవిగారు



నాగార్జునసాగర్ వద్ద శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీగారి ఆధ్వర్యంలో జరిగిన కవిసమ్మేళనంలోని కవులు : 1) కృష్ణారావు 2) ధవళా 3) పులిజాల 4) అంబటిపూడి 5) సిరిప్రెగడ



మేనల్లుళ్ళతో కవిగారు

# Chapter - VII

# గద్యానువాదములు

నూఱు పద్యములున్నదానిని శతకమందురు. కవులీ నియమ మును పాటింపక 108, 120 మొ॥ సంఖ్యలలో పద్యముల వ్రాసినను యవి శతకములేయగును. నన్నయ భారతమున "మాకు ప్రసన్ను డయ్యెడున్" అను మకుటముతో నాలుగు పద్యములు గలవు. ఇవి శతకమునకు పూర్వస్థితియనవచ్చును. అమరుకుడను కవి శృంగార శతకమును సంస్కృతమున రచించెను. ఇందలి పద్యములేకార్థప్రవణ ములు గావు. కావుననే ఇవి ముక్తములైనవి. ముక్తక రచనచే మహా కవియయినవాడమరుకుడే. "ప్రాయ స్తేహి ముక్తకేష్వపి ప్రబంధా భినివేశినః కవయః" అని ప్రబంధమువలె ముక్తకములను రచించిన కవులు గలరని ధ్వనికారుడనినాడు. "అమరుక కవేరేకః శ్లోకః ప్రబంధ శతాయతే" యని నానుడిగలదు అనగా అమరుకుని యొక్క శ్లోకము నూఱు కబ్బములపెట్టని భావము. గైర్వాణియందు ఐదారు ఖండ కావ్యములు మాత్రమే యనంత కీర్తినొందినవి. వానియందమరుకశతక మొకటి. ఇందు ప్రతి పద్యమునను శృఙ్గారరసము ధ్వనించుచుండును. ఇట్టి మహత్తరమైన అమరుశతకమును రత్నకవిగారు సరళగద్య రూప మున ననువదించిరి. స్థాలీపులాకన్యాయముగ శ్లోకమును యనువాద మును పరీక్షింతము. అమరుకము నందలి —

"క్షిప్తోహస్తావలగ్నః ప్రసభమభిహతోప్యాదదానోఽంశుకాంతమ్
గృహ్ణన్ కేశేష్వపాస్తః చరణనిపతితో నేక్షితః సంభ్రమేణ
ఆలింగన్యోవధూతః త్రిపురయువతిభిః సాశ్రునేత్రోత్పలాభిః
కామీవార్ద్రాపరాధః సదహతు దురితం శాంభవోవః శరాగ్నిః"

"త్రిపుర యువతులచే త్రోయబడినను చేతిని పట్టుకొనును. బలాత్కారముగా నెట్టబడినను చెంగుపట్టుకొనును. కేశములను స్పృశిం

చినను త్రోసివేయబడును. పాదములంటుకొనినను విభ్రాంతితో చూడ బడకుండును. కన్నీరుకార్చు కలువకంటులచేత, యాలింగనము చేసి కొనియు తిరస్కరింపబడిన శివశరీరాగ్ని క్రొత్తగా తప్పుచేసిన కాముకు నివలె సంచరించునదియై మీ పాపములను కాల్చివేయుగాక."

"దంపత్యోర్నిశిజల్పతోః గృహశుకేనాకర్ణితం యద్వచః
తత్ప్రాతర్గురుసన్నిధౌ నిగదతః శ్రుత్వైవతారం వధూః
కర్ణాలంబిత పద్మరాగశకలం విన్యస్య చంచ్వాః పురో
వ్రీడార్తా ప్రకరోతి దాడిమఫలవ్యాజేన వాగ్బంధనమ్"

"రాతిరి మాటలాడుకొన్న దంపతుల మాటలనువినిన పెంపుడు చిలుక ప్రొద్దుట పెద్దవారిచెంత యా పలుకులు తిరిగి పలుకుచుండగా సిగ్గంది పిల్లదాని ముక్కునందు ఉపహారముగా ఎఱ్ఱనిరాళ్ళకమ్మయుంచి దానిమ్మగింజయను భ్రాంతినిగొలిపి దానిని పలుకకుండజేసినది.

ఇట్లు మూలాతిక్రమణములేక సరసముగా ననువాదముసాగినది

## భా మి నీ వి లా స ము

మునుగోండ నివాసియైన పండితరాజు జగన్నాథుడు ఆంధ్రావనికేగాక యావద్భారతమునకే కీర్తిదెచ్చిన కవిశ్వరుడు. ఈతడు చిత్రమీమాంసారసగంగాధరాద్యనేకాలంకార గ్రంథములను రచించి శ్రీమదప్పయ్యదీక్షితార్యుల సిద్ధాంతములను పూర్వపక్షమొనర్చినాడు ప్రౌఢమనోరమాకుచమర్దనమును వ్రాసి భట్టోజీదీక్షితుల గ్రంథమును నిర్వీర్యమొనర్చిన ధురంధరుడు. హిందూ ముస్లింల సామనస్యమును సాధించి ప్రతిభాధురంధరులచే కీర్తింపబడి షాజహాన్ ఆస్థానమున కనకాభిషేక సన్మానమందిన పండితరాజు. ఈతడు భామినీవిలాసమను పేర శృంగారపద్యముల రచించెను. లక్షణగ్రంథములయందు అన్యో

దాహరణముల గ్రహింపక స్వీయోదాహరణములనే కూర్చుచు "కింసేవ్యతే సుమనసాం మనసాపిగంధః, కస్తూరికా జననశక్తి భృతా మృగేణ" అని వచించిన కవీశ్వరుడు. ఈతడు రచించిన భామినీవిలాస పద్యములను రత్నకవిగారెటుల సరసముగా ననువదించిరో పరిశీలించు టయే ప్రకృత వ్యాసోద్దేశము. శృఙ్గారోల్లాసమందలిది.

"స్వేదాంబుసాంద్ర కణశాలి కపోలపాలీ
దోలాయితశ్రవణకుండల మండనాయాః
ఆనందమంకురయతి స్మరణేన కాపి
రమ్యాదశామనసిమే మదిరేక్షణాయాః" (శివ. ప)

యౌవనముచే నెలుపెక్కిన కన్నులుగల పడతియొక్క చెమ్మట నీటియొక్క చిక్కనిబొట్లతో నిండిన చెక్కిళ్ళు కలిగినటువంటిన్ని వ్రేలాడుచున్న చెవులజూకాలతో నమస్కరింపదగినట్లున్నొకానొక సుందరస్థితి నాకు మనస్సులో స్మరింపబడుటచే సంతోషమును కలిగించుచున్నది.

"కస్తూరికాతిలకమాలి విధాయ ఫాలే
సాయంతనే సపది శీలయ సౌధమౌళిమ్
ప్రౌఢిం భజన్తు కుముదాని ముదాముదారా
ముల్లాసయన్తు పరితో హరితో ముఖాని"

"సాయంకాలము కస్తూరికాతిలకమును ధరించిన నగుమోము గలదానివై మేడను పరిశీలించుము. నల్లగలువలు సంతోషమును ఔదార్యమును నేర్చుకొనుగాక. దిక్కులయొక్క ముఖములు యెల్ల యెడల యుల్లాసముతో నుండుగాక."

పండితరాయల కవిత్వము ద్రాక్షాపేశలమని జగత్ప్రసిద్ధము. అట్టి సరసకవితను గద్యాత్మకముగా రత్నకవిగారనువదించుట ప్రశంసార్హము.

భర్తృహరి నీతి శృంగార వైరాగ్య శతకములను రచించెను. సంస్కృత సాహిత్యమునందీ త్రిశతికత్యంత ప్రాచుర్యము గలదు. ఇందలి పద్యములు రత్నకవిచే నెట్లనూదితములో పరిశీలింతము.

"సతిప్రదీపే సత్యగ్నౌ సత్సు తారారవీందుషు
వినామే మృగశాబాక్ష్యా తమోభూతమిదం జగత్"

పెద్ద దీపము వెలుగుచున్నను, అగ్ని జ్వలించుచున్నను, నక్షత్రములు, చంద్రుడు ప్రకాశించుచున్నను ఆ మృగాక్షి లేకున్నచో ఈ జగత్తంతయు నాకు చీకటియగును.

"ఉద్వృత్తః స్తనభారఏష తరళేనేత్రే చలే భ్రూలతే
రాగాధిష్ఠితమోష్ఠపల్లవమిదం కుర్వన్తునామ వ్యథామ్
సౌభాగ్యాక్షర పంక్తికేవ లిఖితా పుష్పాయుధేన స్వయమ్
మధ్యస్థాపి కరోతి తాపమధికం రోమావళిః కేనసా"

"పెరిగిన బరువైన కుచమండలములు, చంచలములైన నేత్రములు, భ్రమించు కనుబొమలు, ఎఱుపెక్కిన చిగురాకు మోవి యివన్నియు నాకు వ్యథను కలిగించుగాక. కాని యెవడో కుసుమాయుధునిచేత వ్రాయబడిన సౌభాగ్యాక్షర పంక్తివలె మధ్యనున్న యీనూగారు మిక్కిలి వ్యథను కలిగించుచున్నది."

## హితోపదేశానువాదము

నారాయణ పండితుడు వివిధ గ్రంథములనుండి సంగ్రహించిన పద్య ముత్యములతో హితోపదేశమును రచించినాడు. పాశ్చాత్యులను సైతమీగ్రంథమాకర్షించినదని చెప్పనగును. కాక మృగాదులంగొని రచింపబడిన నీతి గాథలిందు గలవు. మిత్రలాభము, సుహృద్భేదము,

విగ్రహము, సంధియను నాల్గు గాథలిందు గలవు. వీనిని గూడ సరళ ముగ అంబటిపూడివారనువదించిరి.

మూలము : "యస్యమిత్రేణ సంభాషా యస్యమిత్రేణ సంస్థితిః
మిత్రేణ సహ యో భుంక్తే తతోనాస్తీహ పుణ్యవాన్"
(మిత్రలాభము)

అనువాదము : ఎవనికి మిత్రునితో సంభాషణమబ్బునో, ఎవనికి మిత్రునితో నుండుట సమకూడునో, ఎవనికి మిత్రునితో సంలాపము సంభవించునో యాతనిని మించిన పుణ్యవంతుడీలోకమున లేడు.

మూలము : "అన్యదా భూషణంపుంసః క్షమాలజ్జేవ యోషితాం
పరాక్రమః పరిభవే వైయాత్యం సురతేష్వివ"
(విగ్రహము)

అనువాదము : స్త్రీలకులజ్జవలే పురుషులకోర్పు పెఱతావులవలంకారము. పరాభవము కలుగుచో పౌరుషము, స్త్రీలకు సురతమున దిట్టతనము వంటిది.

"అనాగతవతీం చిన్తాం కృత్వాయస్తు ప్రహృష్యతి
స తిరస్కారమాప్నోతి భగ్నభాండో ద్విజోయథా" (సంధి)
"రానిదానిని గూర్చి చింతించి యెవడు సంతోషమందునో

వాడు పగులగొట్టుకొనిన కుండగల పాపనివలె తిరస్కారమును పొందగలడు" పాఠశాలలయందలి విద్యార్థులకిట్టి యనువాద గ్రంథము విజ్ఞాన మొసంగునుం

## కృష్ణకథ (వచనం)

శ్రీకృష్ణునిగూర్చి "సర్వో నిషదో గావః దోగ్ధా గోపాలనందనః" యని యాతడు యుపనిషదంతరర్థములచే ఉత్కృష్టుడని విజ్ఞులు చెప్పియుండిరి. జన్మాంతర సంస్కారపరిణతబుద్ధులు, సహజ కృష్ణభక్తి వశంవదులునగు శ్రీ వేంకటరత్నంగారు శ్రీకృష్ణుని జీవితమును 'కృష్ణకథ' యనుపేర వచనముగ నాంధ్రీకరించి యుండిరి. నూటపది పుటలుగల యీ గ్రంథము 1958 లో ముద్రింపబడినది.

శ్రీరామకృష్ణపరమహంస శిష్యులగు శ్రీరామకృష్ణానందస్వామి యాంగ్లమున రచించిన గ్రంథమునకిదియనువాదము. ఆంధ్రపత్రిక యందిది ధారావాహికముగ వెలువడిన పిమ్మట గ్రంథరూపమును నొందినది. రత్నకవిగారి శిష్యులైన పెదఅమ్మయ్యగారీ గ్రంథము ముద్రింపబడుటకు కారణభూతులు. ఇందు గోకులము, బృందావనము, మధుర, ద్వారక యనెడి భాగములు గలవు. ఇందు కేవలము శ్రీకృష్ణుని కథమాత్రమేగాక రహస్యార్థములును గలవు. ఏతద్గ్రంథ మాహాత్మ్యమును తెలియజేయుటకు యీ క్రింది కథాభాగమును నిరూపించుచుంటిని.

"నివురుగప్పిన నిప్పును మన నోటితో నూదితిమేని అనేకము లగు నిప్పురవ్వలు బయలుదేరును. అటులనే ఒక యోగి ఆత్మాహంకారమును ప్రబలవాంఛోచ్ఛ్వాసమున గట్టిగ నూదితిమేని ఆ అహంత నుండి యనేకములగు చిత్తములుత్పత్తిల్లును. యోగి ఈ శక్తిని సాధించుకొని ఒకదానిచెంత నొకటిగ ననేక భోగముల ననుభవింపదలచినచో తననుండియే ననేక శక్తులను సృజించి వివిధ భోగానుభవములందును. అట్టి వ్యక్తులతనికంటె వేరుగాక పూర్ణముగా అతనిపైనే యాధారపడి యుందురు. "నిర్మలచిత్తాన్యస్మితామాత్రాత్, ప్రవృత్తిభేదే ప్రయోజనమ్ చిత్తమేకమనేకేషామ్" అని పతంజలి యోగసూత్రము"

శ్రీకృష్ణుడనేక గోవులను, గోపాలురను ఒకే సమయమున సృష్టించెనను సందర్భమునందలిది పై నుదహరింపబడిన ఘట్టము.

శ్రీకృష్ణుడు గోపికలతో క్రీడించెనను సందర్భమున "యాన్యస్మాకం సుచరితాని తాని సేవ్యాని, నో ఇతరాణి" యనెడు తైత్తిరీయోపనిషత్తునందలి ప్రమాణముదహరింపబడినది. రహస్యార్థములతో గూడిన యీ గ్రంథము ఆధ్యాత్మిక జీవనాసక్తిగల సజ్జనులచే నవశ్యము పఠింపవగినది.

## తర్కభాష

తర్కశాస్త్రమునకే ఆన్వీక్షికియని: న్యాయశాస్త్రమని నామాంతరములు గలవు "ప్రత్యక్షానుమానాభ్యాం ఈక్షితస్య అన్వీక్షణమన్వీక్షా తయా ప్రవర్తత ఇత్యాన్వీక్షికీ, న్యాయవిద్యా న్యాయశాస్త్రమ్." అను వాత్స్యాయమని వాక్యమిట ప్రమాణము న్యాయమనగా ప్రమాణములచే నర్థమును పరీక్షించుట. "ప్రమాణైరర్థ పరీక్షణం న్యాయః" ఇట్టి న్యాయశాస్త్రకర్త గౌతముడు. నవద్వీపము న్యాయశాస్త్రమునకు ప్రసిద్ధినందినది. ప్రాచీన న్యాయము నవ్య న్యాయమని న్యాయశాస్త్రమును రెండుగా విభజింపవచ్చును. వాత్స్యాయనుడు, ఉద్యోతకరుడు, వాచస్పతిమిశ్రుడు, ఉదయనాచార్యుడు ప్రాఙ్న్యాయమునందలి ప్రసిద్ధులు. దిఙ్నాగుడు, సిద్ధసేన దివాకరుడు మధ్యన్యాయమున ప్రసిద్ధులు. వరదరాజు, కేశవమిశ్రుడు, గంగేశోపాధ్యాయుడు, విశ్వనాథుడు, అన్నంభట్టు మొ॥ వారు సుప్రసిద్ధ తార్కికులు.

క్రీ. శ. 1275 ప్రాంతమున కేశవమిశ్రుడు తర్కభాషయను గ్రంథమును రచించెను. తర్కశాస్త్ర విషయములను సంగ్రహముగా దెలుపునీగ్రంథము ఆంగ్ల భాషయందు 1949లో అనువదింపబడినది. దానిని శ్రీ వెంకటరత్నకవిగారు ఆంధ్రమున పరివర్తించిరి. శుభకృత్

సంవత్సరమున ప్రకటింపబడిన ఈ గ్రంథమును శ్రీపోచంపల్లి మురళీధర రావు బి.ఏ., తహశీల్దారుగారు శ్రీ ప్రగడ శ్రీధరరావుగారు, శ్రీ పులిజాల రాఘవరంగారావుగారు వెలుగులోనికి దెచ్చిరి. విశ్వేశ్వర సిద్ధాంత శిరోమణివ్రాసిన బృహదుపోద్ఘాతమును గ్రంథాదియందుంచడం విశేషం

ఇందు ప్రమాణచర్చగలదు. ప్రమ, కరణ, కారణములు సవిస్తరముగా ప్రశ్నోత్తర రూపమున నిరూపింపబడినవి. ఇందు ప్రసంగాను ప్రసంగముగ సమవాయాసమవాయనిమిత్త కారణములు,అయుతసిద్ధ లక్షణము,"అనధిగతార్థ గన్తృ ప్రమాణమ్" అనెడి మీమాంసక బౌద్ధుల నిరసనముగలదు. అనుమాన ప్రమాణమున యుపాధి, అనుమాన ద్వైవిధ్యము, హేతువైవిద్యము, పంచరూపములు, త్రివిధాసిద్ధములు, పంచవిధహేత్వాభాసము, వ్యాప్తి ద్వివిధత్వములు సోదాహరణముగా ప్రపంచితములు. ఉపమానశబ్దార్థాపత్తులు, ప్రామాణ్యవాదము నిరూపింపబడినవి. ఇదియంతయు ప్రమాణ ప్రకరణము.

ప్రమేయ ప్రకరణమున ఆత్మశరీరేంద్రియాదులు సోదాహరణముగ నిరూపింపబడినవి. ప్రసంగానుప్రసక్తముగా పరమాణుసిద్ధి వాద జల్ప వితండ నిగ్రహ స్థానాదులు స్ఫుటీకరింపబడినవి. కేశవమిశ్రుడీ తర్కభాషను బాలవ్యుత్పత్తి కొఱకు రచించెను. బాలుడనగా 'గ్రహణ ధారణ పటుర్బాలః" యను లక్షణముచె లక్షితుడు. సర్వదర్శనసంగ్రహమందు 'కాణాదం పాణినీయమ్ చ సర్వశాస్త్రోపకారకమ్' అని చెప్పబడినది. కావున తర్కశాస్త్రము సర్వశాస్త్రములకుపయోగించును. అంతియేగాక తర్కశాస్త్రజ్ఞాన విహీనుడే శాస్త్రమందలి లక్షణములను సమన్వయపరచుకొనలేడు. ఈ తర్కభాషననువదించుట కవిగారుచేసిన మహోపకారమనవచ్చును. ఇంటింటా ఉండదగిన గ్రంథరత్నము.

## శాంతితీరాలకు

'శాంతితీరాలకు' అనే యీ గ్రంథం ఆనందాచార్యులవారి శక్రసఖయనే ఆంగ్ల గ్రంథం ఆధారంగా నడిచింది. సాహితీమేఖల ద్వారా ప్రచురితమైన యీ కవితాఖండికల సంపుటి ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా విడుదలైంది. భారతీయ సంస్కృతిని ప్రతిబింబించే గ్రంథమిది. ఇందులో నూటయెనిమిది కవితలున్నాయి.

ఈ గ్రంథాన్ని గూర్చి 28-3-1976 నాటి ఆంధ్రప్రభ దిన పత్రికలో శ్రీ కుందుర్తి సత్యనారాయణమూర్తిగారు "శాంతితీరాలకు అనే గ్రంథం ధర్మభావాలతో కూడిన మణిమాల. ఇందులో తాత్త్విక మర్మాలు బాగా చిత్రింపబడినవి" అని యభిప్రాయపడిరి.

1976 మార్చి భారతిలో శ్రీ అంగీరస యీ గ్రంథాన్ని సమీక్షిస్తూ "గద్యంతో కవి పాఠకులను మెప్పించారు. భావగాంభీర్యం ఉంది. సంస్కృతీజనకవాసనలున్నాయి." అని ప్రశంసించిరి. ముందుగా అనువాదం ఎలాసాగిందో పరిశీలిద్దాం.

మూలం : And through the pearly door of the beyond gleans bright eternity 37వ కవిత

అనువాదం : ఆవల రత్నద్వారంగుండా

సత్యజ్యోతిప్రకాశిస్తూ

తొంగిచూచింది.

మూలం Filled with the love of earth filled with the love of sky life cares not to free herself from her own shadow. (49)

అనువాదం : జీవితం భూమిమీది ప్రేమనూ

ఆకాశంమీది ప్రేమనూ నింపుకొని

తననీడనుండి తాను విడివడాలని జాగ్రత్తపడదు.

మూలం : Love is the language of life
అనువాదం : జీవితభాష ప్రేమ.

మూలం :Life shall die but love shall stand and wait seeing still life's flickering

అనువాదం : ప్రేమసర్వదాజీవిస్తుంది
కానిజీవితందానిసమృద్ధిలోనే మరణిస్తుంది
శక్రసఖ అనేఆంగ్ల గ్రంధంలో ఆనందం అనేగీతం ఈవిధంగా ఉంది

It is the soul's autumn season,
The leaves have fallen from the tree of dream
The fungers of mirage no longer weave the web,
of spyace writh throads of time, spun from thethistle
down of nought.
Liberty, Devine daughter sings no more as she
flies on the wings of creation
Heaven with fixed gaze seams the depth of being.
Undivided by thought the one alone lives,
Permeated with bless."

అనువాద కవిత :-

ఆనందం

ఆత్మకది శిశిరఋతువు
స్వప్నవృక్షం నుండి ఆకులు రాలినవి
శూన్యమనే ముళ్ళ ఎడారిలో
కాలసూత్రాలతో
ఆకాశమనే వలను
ఎండమావులనే చేతులు
ఇక ఏమాత్రం అల్లవు.

ఆమరకుమారియైన స్వేచ్ఛ
జన్మలనే ఱెక్కలతో ఎగురుతూ
ఇక ఏమాత్రం గానం చెయ్యదు
స్వర్గం ఏకాగ్రతతో
సత్యాగాధ పద్యానికి
గణవిభజన చేస్తున్నది.
భావంచేత భేదింపబడక
ఏకమే ఆనందంతో పూజింపబడి
జీవిస్తున్నది.

పై గేయంలో రమణీయ రూపక సన్నివేశాలతో ఊగులాడే మనోజ్ఞ భావమే గోచరిస్తుంది. మూలంతో తీసిపోని రచన.

నవ్యయుగంలో భావకవిత Dadaism, symbolism, Pessimism imagism, saddism, Anarchism మొదలైన అనేకరూపాలతో గోచరిస్తుంది. ఛందోనియమాలులేక కేవలం భావానికి మాత్రమే ప్రాముఖ్యం యిస్తూ రచింపబడిన గేయాలకు భావకవితలని ప్రప్రథమంగా నామకరణం చేసినవారు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు. ఈ గ్రంథంలో మానవులకు కలిగే ఘర్షణలు, భావనలు, అభిలషణీయాంశాలు చిత్రింపబడ్డాయి. మకరందాన్ని పూలపాలనడం, పువ్వులను బాలింతలనడం చేసారు నవకవులు. అట్టి నవ్యకవితాధోరణులు యీ కావ్యంలో గోచరిస్తాయి. ఈ కావ్యం చదివే సమయంలో భావుకతగల రసజ్ఞుడు అజ్ఞాతదివ్యానుభూతులకు లోనవడం జరుగుతుంది. ఈ కావ్యంలో కవితాశిల్పం అడుగడుగునా ప్రస్ఫుటమవుతూంది.

ఈ కావ్యంలోగల రసగుళికల నుండి కొన్నిటిని సహృదయోల్లాసం కొఱకు ఉదహరిస్తాను. అన్నిటినీ వివరించడం యీ చిఱు పొత్తంలో సాధ్యం కాదు.

"సహనమనే స్తంభానికి చుట్టిన ఆశ యనే తెఱచాప్పు
స్వయంప్రకాశమైన శాంతి అనే ఓడరేవుకు
నిన్ను మహాసముద్రంలో నుండి
మెల్లగా చేర్చడానికి
మందమారుతాలను వదలి పెట్టండని
దిగ్దేవతలను ప్రార్థించు"

"శాంతితీరాలకు" అనే గేయంలోనిదే యీ భాగం. ఈ గేయనామమే కావ్యనామమైంది.

"ఆత్మైకత్వంలో" — ఆత్మైకత్వమేఆహారపానీయాలుగా
దానికోసమే క్షుత్పిపాసలను
అందరూ కలిగిఉండేటట్టుగా చేయ్

సర్వక్షేమ భవనంలో
ప్రతి జీవితాన్ని ఒక దీపంగా వెలిగించు"

మూసిన తలుపులులో "ఆదిత్యునికి ఆవల ఒక స్థానం ఉంది
ఆ ఆనందధామాన్ని చేరినవాళ్ళు జ్యోతిరూపులవుతారు"
అనే వర్ణనలో "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" అనే మహాద్భావం నిక్షిప్తమైనది. "భరతపుత్రుల ప్రార్థన" లో గుండెలు ద్రవింపజేసే మానవత్వం ఉంది.

"అంగీకరింపబడే అవమానత యొక్క
శిరస్సులపైన న్యాయము నిప్పుగుండ్లను

కురిపించాలని మనం ప్రార్థిద్దాం"
కులానికీ కులానికీ మధ్య
విభేదకుడ్యాలు నిర్మించేవాళ్ళ
విధ్వంసం కోసం మనం ప్రార్థిద్దాం"
"పురుషోత్తముడిని గీతలో బైబిలులో ఖురానులో
త్రిపిటకంలో వెదకి వ్యర్థులైన పూజారులారా
ఆయన్ను మీ హృదయాల్లో
మీ ప్రక్కనున్నవారి హృదయాల్లో
వెతికితే కనబడతాడు"
"కనబడని మానుష్యకమే దేవుడు
కనబడే దేవుడే మానుష్యకమ్"

భగవంతుని మానవ హృదయాలలోచూడాలనే భావం అమోఘం. రసధునిలా ప్రవహించిన యీ కావ్యం నుండి కొన్ని మధుర శీకరాలను మాత్రమే సమీక్షించాం. ఎంతో రాయాలనిఉన్నా నిగ్రహించుకోక తప్పదు.

---

## వివేకశిఖరాలు

ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానఖనియైన హిమాలయముల తపమొనరించి, వారి స్వీయానుభవాలను ఆంగ్లంలో రచించారు ఆనందాచార్యులవారు. వారి ఆంగ్ల కృతికి వేంకటరత్నంగారి తెలుగుసేతయే "వివేకశిఖరాలు." 1919 వ సంవత్సరము డిసెంబరు 23 వ తేదీన The Birmingham Post వ్యక్తం చేసిన యభిప్రాయం —

"Both Acharya and Tagore in their thoughts come into lime with Wordsworth Shelley Byron Tennyson and carlyle in

their most excited idea'' ఇలా ఆనందాచార్యులవారిగూర్చి బహు విపశ్చితులు వివిధాభిప్రాయముల వెలార్చిరి.

హైదరాబాద్‌లో శ్రీ పులిజాల హనుమంతరావుగారితో కలసి వేంకటరత్నకవిగారు నడచుచు మార్గమధ్యమున పై యాంగ్లగ్రంథమును గాంచి దానిని చదివి తన్మయులై యనువదించిరి ఇట్టిగ్రంథము ముద్రింపబడుటకు శ్రీ పతంగి వెంకటేశ్వరరావుగారు కారణభూతులు. వారు ప్రశంస్యులు. సాహితీమేఖలద్వారా యీ గ్రంథము ప్లవనామ వత్సరమున వెలువడినది. ఇందు అన్వేషణ విధ్యుక్తము, సమైక్యత, ధ్యానము, స్మృతి, స్వప్నము, భావన, సందేశము, త్యాగము, శాంతి, శక్తి, ఆశ, ప్రవర్తన, క్రమాభివృద్ధి, అర్పణము, సూర్యోపాసన, అమృతరహస్యము, సాక్షాత్కారమనెడి పదునెనిమిది వ్యాసములు గలవు. ఇందలి ప్రతి వాక్యమునను భారతీయత గోచరించును.

అన్వేషణయందు ''భౌతికనాగరకత, ఆధ్యాత్మిక నాగరికతలు గలవని మొదటిది భౌతికలాలసతను పెంచునని, రెండవది శాంతినిచ్చునని బహిర్జ్ఞానవుడు భిక్షుకుడని, అంతర్జ్ఞానవుడు సంపన్నుడని'' తేల్చబడినది. ''కొందరు హిమాలయములయందలి పాఠశాలలోజేరి యనేక హాయనములు శ్రమించి విద్యనేర్తురు. గురు శుశ్రూషవలన నేర్పుట రెండవపద్ధతి. ఇవి సులభము. విశ్వాసమే యన్నివిద్యలకుమూలము'' అని విధ్యుక్తమందలి విషయము. భక్తియుతముగా పనిచేసిన ఆత్మశక్తి కలుగునని మంచి తలపులనే కలిగియుండుమని యన్వేషణమున బోధింపబడినది.

ఏకత్వమే ప్రపంచమున సర్వాంగీణముగ వ్యాపించినదని యు ఏకత్వసాధనకే కృషియొనర్చవలయునని సమైక్యతయందలిసారాంశము. 'ధ్యానము'నందు యోగులు ఆత్మయొక్క ప్రత్యక్షవాణి, ఆత్మయొక్క పరోక్షవాణి, స్వప్నావిర్భూతియనెడి మిత్రత్రయలబ్ధిచే ప్రపంచ

క్షేమమును కూర్చగలడని, యోగులకు సమ్యగ్ధ్యాన, సమ్యగ్ధారణ, సమ్యక్సమాధులావశ్యకములని నిరూపింపబడినది. జీవుడు చేతనామయ స్వరూపుడని, మానవులకు సుఖశాంతులనిచ్చు శక్తుల నాత్మలో పెంచు కొనుట యెట్లో యోగము బోధించునని, యోగి కావలయునని 'స్మృతి'యందు వక్కాణించబడినది. మనస్సు బహుభ్రాంతులగూర్చు నని, ప్రకృతి యోగి వశవర్తినియని, యోగులు నడచినబాటలో నడువ వలయునని స్వప్నమందు స్థిరీకరింపబడినది. ఆత్మయందలి యనంతై శ్వర్యమును విప్పిచూపు విజ్ఞానమే విజ్ఞానమని, స్వయమాత్మార్పణము చేతనే విశ్వమందలి యమృతత్వమును పొందగలమని "భావన"మనచే భావింపజేయుచున్నది. వ్యాపకశక్తిచే నాకాశమున నేమున్నదో తెలియ వచ్చునని దూరప్రయాణశక్తిచే భవిష్యత్తును గుర్తింపవచ్చునని, కేంద్రీకరణశక్తి వస్తుబోధకమని "సందేశము" ద్వారా ఆచార్యుల వారు సందేశమొసంగిరి.

ఓంకారమందలి ప్రేమను ఓంకారముద్వారా అర్థము చేసికొన వచ్చును. ఆత్మసూర్యుడు, ఓంకారములనుండి ప్రభవించిన ధృతినొం దినవాడు విశ్వమును బాగుచేయగలుగునని 'త్యాగము'నెడి యుపన్యా సము నందలి అంతరర్థము. మూలాధారము నుండి కుండలిని సహ స్రారమును జేరుసరికి హీనుడుత్తముడగునని అందులకు యత్నింప వలె నని "శాంతి" యను వ్యాసము బోధించుచున్నది. "నిజమైన తాత్త్వి కుడు సర్వపదార్థములయందు సత్యమును జ్ఞానమును గాంచును నేనాత్మనుగాని, శరీరమునుగాను, కాంతినిగాని చీకటినిగానని భావము చేయవలె" నని శక్తి పతితలను తేజితులను చేయుచున్నది. "గురు వాక్యమును విశ్వసించి కొండలలో తపస్సు చేసి యోగి సత్యమును గుర్తించును. ఈ విశాల విశ్వమున సాధింపవలసినవి దైవభక్తి, ఆత్మజ్ఞానము మాత్రమేననెడి సిద్ధాంతము "ఆశ" యను వ్యాసమున ప్రతిబింబించినది.

"బాహ్యవస్తువుల నుపయోగించుకొనుట, తద్విషయమునందు మనస్సును ప్రసరింపజేయుటను నిగ్రహించి తనకు తానే యదృశ్యుడైన యోగికి నైశ్చల్య జ్ఞానముదయించున" నెడి సిద్ధాంతమును "ప్రవర్తన" ద్వారా రచయిత మనకందించెను. "ఓర్పు, తాత్త్విక ప్రశాంతి, త్యాగము, నిరంతరతమల సాధించి దానితో సన్మార్గమున పయనింపవలెననెడి భావము "క్రమాభివృద్ధి" యందు ప్రతిఫలించినది "అర్పణ" మనెడి వ్యాసమున ప్రాణశక్తి ప్రాముఖ్యము, భగవంతునకు నరుడు చేయవలసిన యాత్మార్పణము" సహృదయుల కందింపబడినది.

సూర్యకాంతి ధూళిని ధ్యానించుటచే నైతికగుణములలవడునని "సూర్యోపాసన" యనెడి వ్యాసమును నిమిత్తముగా గొని తెలియజేసిరి. యోగులను విశ్వసింపవలెనని వైరాగ్యమువలన వస్తుయాథార్థ్య జ్ఞానము కలుగునసెడి రెండంశములు "అమృతరహస్యము" న గలవు. యోగి సర్వమతములను గౌరవించునని, దేవుని విన్యాసములు పలు రీతులని, భక్తి కర్మ, జ్ఞానమార్గములలో దేనిచేనైనను మోక్షమునందవచ్చునని "సాక్షాత్కారము" న బోధించుచూ వివేకశిఖరములను ముగించిరి.

కాళిదాసు రమణీయగాథలసేరి కావ్యముల రచించినట్లు కవిగారు పరమ సుందర గ్రంథముల ననువదించి కీర్తి నందిరి.





కవిగారి దంపతులు కుమారుడు, కోడలుతో



నల్లగొండకు శ్రీ కంచి చంద్రశేఖరస్వామివారు వేంచేసిన సందర్భంగా
గీతావిజ్ఞానాంధ్ర కళాశాల, నల్లగొండ తరఫున ప్రిన్సిపాల్ గా
వెంకటరత్నంగారు సన్మానపత్రం చదువుచున్న దృశ్యం



గీతావిజ్ఞానాంధ్ర కళాశాల విద్యార్థులు, ఉపన్యాసకులతో రత్నకవిగారు

## Chapter - VIII

## కథావళీ సమీక్ష

శ్రీ అంబటిపూడి వేంకటరత్నంగారు అప్పుడప్పుడు వ్రాసిన కథలన్నీ "కథావళి" అనే పుస్తక రూపంలో వెలువడ్డాయి. ఇవన్నీ వివిధ పత్రికలలో ప్రకటింపబడినవే. ప్రతి కథలోను ఒక్కొక్క నీతిని బోధించడం సంఘంలోని దురవస్థను మన కండ్ల ఎదుటకు తీసుకురావడం జరుగుతూంది. చాలామంది కథారచయితలు తమ నిశ్చితాభిప్రాయాల వ్యక్తం చెయ్యకపోవడం జరుగుతూఉంటుంది. కాని రత్నకవిగారు ప్రతి కథలోను తమ నిర్ణయాన్ని తెలియజేస్తారు. వీరి కథలలో భారతీయ సంస్కృతి సర్వత్ర అనుస్యూతంగా గోచరిస్తుంది. పియారో అనే సుప్రసిద్ధ చిత్రకారుడు తన అసంపూర్ణ చిత్రాలకు కారణం ప్రపంచంలో దేనిలోను సమగ్రత లేకపోవడం అంటాడు. అట్టి జీవితంలోని అసమగ్రతను తొలగించి సమగ్రతను ఆపాదించడానికి వీరు కథానికలను చేపట్టారు. కథానిక ఆంగ్లసాహిత్యం నుండి వచ్చిన ప్రక్రియే. కథకుడు తన అంతరంగాన్ని పాత్రలద్వారా తెలియజేస్తాడు. కథాసాహిత్యంలోగూడ వీరికి హస్తలాఘవంగలదనడానికి యీ పుస్తకము తార్కాణము.

ఇందులోని మొదటి కథ కాళింగమర్దనం. శ్రీకృష్ణుడు కాళీయమర్దనం చెయ్యడం తనకు వచ్చిన స్వప్నంగా వర్ణిస్తాడు కవి. అయితే మూలంలో ఉన్నట్లుగాక కొన్నిమార్పులతో యీ కథ నడిచింది. "అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణమ్. ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా" అనే ధ్వనికర్త యభిప్రాయం ప్రకారం కావ్యంలోగాని, కథలలోగాని అనౌచిత్యం ఉండరాదు. అప్పుడే పాఠకులు రసానందాన్ని పొందుతారు. కథలోని మార్పులు స్వప్నవృత్తాంతం

రాలు గడిచినా అతని భార్య సువర్చల పతివ్రతగా జీవిస్తుంది. పన్రెండు సంవత్సరాలు గడిచినా భర్త రాలేదు గాన ఆమెను వితంతువు చేయ సంకల్పిస్తారు విద్వాంసులు. ఒక్క వత్సరంలోగా వస్తాడని రాకుంటే మీ శాస్త్రం పాటిస్తానంటుంది సువర్చల. తండ్రిలేని సమయంలో విద్యార్థులకు వేదపాఠం చెప్పే సువర్చలను గాంచి ఒక జడధారి ఆశ్చర్యపడి ఆయింట ఆతిథ్యం స్వీకరిస్తాడు. భర్త వస్తాడనే దృఢవిశ్వాసంగల సువర్చలను గాంచి సర్వశాస్త్రవేత్త అయిన జడధారి విస్మితుడవుతాడు. ఆ జడధారి ఆమె భర్త వాచస్పతి. కధ సుఖాంతమగును.

ఈ కధ కవిగారి అన్ని కధలలోను ఆణిముత్తెమనదగి యున్నది ఇందులో ఆనందరోమాంచాలనిచ్చే భారతీయ జీవన విధానం చెప్పబడింది. గగుర్పాటు కలిగించే రెండు సన్నివేశాలు చూడండి —

1) సువర్చల యజుర్వేదంలోని యీ క్రింది పనస చెప్పడం. అది స్వచ్ఛమైన యనురాగాన్ని జీవనాన్ని చెప్పేది కావడం మరో విశేషం. ప్రాచీన కాలంలో వనితలు ఇంట్లో ఉన్నా విజ్ఞానవంతులని తెలియజెయ్యడం ముఖ్యమైన చిత్రీ.

"సమితగం సంకల్పేదాగ్ం సంప్రయారోచిష్ణూ
సుమనస్యమానో ఇషమూర్జమభిసంవసానో"

(వివాహితులైన స్త్రీ పురుషులు పరస్పరమైత్రితో వైమనస్యాలు లేకుండా తేజోవంతులై న్యాయమార్గాన సంచరించాలి.)

2) భర్తవస్తాడనే విశ్వాసం నీకింకా ఉందా? అన్న జడధారి ప్రశ్నకు సువర్చల తోటలోని రెండు పతులను చూపిస్తుంది. అవి ఒకదాని మెడపై నొకటి మెడపెట్టి నిద్రిస్తుంటాయి. పాఠకులారా! ఇందులోని అంతరర్థం ఏమిటి? "యోభర్తాసాస్మృతాంగనా" అనే ప్రమాణంవల్ల

గనుక కథ ఔచిత్యవంతంగా నడిచింది. స్వప్నంలోని సంఘటనలకు పొందికలేకపోయినా బాధలేదు. ఇందుకు "అదృష్టమప్యర్థ విశేష వైభవం కరోతి సుప్తిర్జనదర్శనాతిథిమ్", అనే నైషధశ్లోకంప్రమాణం. రాధాకృష్ణుల చిత్రవృత్తాంతం కథలో కూర్చబడింది.

ఒకస్త్రీ పరపురుషుడిని విశ్వసించి మోసపోతుంది. ఆపై నిరాదృతయై ఆత్మహత్యాభిలాషిణియై నదిలోపడి రక్షింపబడుతుంది. అట్టి స్త్రీని సంఘం ఆదరించాలిగాని పరిహసింపరాదు. ఈ కథలోని సారాంశానికి "గచ్ఛతఃస్ఖలనం క్వాపి భవత్యేవ ప్రమాదతః, హసన్తి దుర్జనాస్తత్ర సమాదధతి సజ్జనాః" అనేసుభాషితరత్నభాండాగారమందలిశ్లోకం ప్రమాణం "సానుభూతి" యనే కథలోని యీ క్రింది పంక్తులు యెదలు జలదరింపజేస్తాయి. "పరిస్థితుల ప్రాతికూల్యం వల్ల మోసపోయినస్త్రీని ఎవరయినా మన్నిస్తారా? సంఘం ఏం సలహాయిస్తుంది? అమ్మాయిద్దుమాలో తప్పులు లేవా? తెలుసుకున్న పిదప దోషాంతం అయింది. ఉండు అటుందా? లేక మాదంతా అచ్ఛస్ఫటికాచ్ఛమైన వృత్తి. శీఘ్రంగాపో, నీకు మాలో స్థానంలేదు అంటుందా?

'విభ్రాంతి' యనే కథలో అజ్ఞాతపితృకుడు నాయకుడు. ఈతని తల్లి స్వైరిణి. ఇతడు తండ్రియని భావించే వ్యక్తిపోతే కర్మచేయనివ్వరు. అమ్మమ్మ ఇతడిని కంటికి రెప్పలా కాపాడుతుంది. ఇతడుతల్లి గురించివిని విభ్రాంతుడౌతాడు. గృహంవిడచి వెళ్ళాలనుకొని అమ్మమ్మ చూపే అభిమానానికి కట్టుబడి ఉండిపోతాడు. అమ్మమ్మ కూతురిచే వీలునామా వ్రాయించి మనుమనికిచ్చి చనిపోతుంది. కర్మచేసి విభ్రాంతుడౌతాడు. చిత్తవిభ్రాంతి యిందులో రమణీయంగా చిత్రింపబడింది.

'ప్రాయశ్చిత్తం' అనే కథలో స్వచ్ఛమైన యనురాగం, పతివ్రతాత్వం నిరూపింపబడ్డాయి. విద్యాహీనుడని మామగారిచే నిందింపబడి గృహం విడచి కాశీ చేరుకుంటాడు వాచస్పతి. పన్నెండు సంవత్స

భార్యాభర్తల శరీరాలు, ఆత్మలు ఒకటే. తన మనస్సు భర్త మనస్సు ఒకటే గనుక తనుజీవించి ఉందిగనుక భర్తగూడా జీవించే ఉంటాడు. తను రావాలనుకుంటూంది గాన భర్తకూడా రావాలనుకునే వస్తాడు. సువర్చలకు ఎంత ఆత్మప్రత్యయమో చూడండి. "సతాంహి సందేహ పదేషువస్తుషు ప్రమాణమంతఃకరణ ప్రవృత్తయః" అనే కాళిదాసుని మాట గుర్తుకొస్తూంది. రత్నకవి సన్నివేశకల్పనాచాతురికి నా జోహార్లు.

కింగ్‌లీర్ నాటకంలోని పితృభక్తి ప్రశంస, ఉన్మాది, మూర్ఛ రోగియైన పెద్దన్న జీవితం, దర్జీవాడైన రాముడులు మరణిస్తే ఆ కుటుంబాన్ని యెవరూ ఆదుకోకపోవడం "అదేమిరోజో-అబ్బ" అనే కథలో గోచరిస్తాయి. ఈ సన్నివేశాలనుచూచి కవిగారు మానవతా హృదయంతో చలించిపోయారట. ఈ కథలోని యీ క్రింది పంక్తులు కథకునిబోధను తెలియజేస్తాయి.

"తీవ్రవిరక్తితో అదృష్టవంతుడు సదవకాశాన్ని పొందుతాడు. ఈ జాగ్రత్తనే Ruskin sensation అంటాడు. ఇది మృదువుగా శరీరాత్మలపై పనిచేయాలి Mimosa అనే మొక్క తాకితే ముడుచు కుంటుంది. అటువంటి స్పర్శజ్ఞానం శరీరాత్మలలోకి వస్తే మనము మానవులం"

నిద్రించే ఒక వ్యక్తి తనను వనిత ప్రేమించినా, రౌడీలు చంప బోయినా తెలుసుకోలేకపోవడం "భాగ్యరేఖలు" కథలోని సంఘటన. మన భాగ్యరేఖ వృత్తాంతం తెలిస్తే ఆశతోనో, భయంతోనో, దుఃఖం ఆనందంతోనో మన జీవితం గడుస్తుంది. పరమాత్మని ఆజ్ఞానుసారం అజ్ఞాత సంఘటనలు వస్తాయి." ఇది ఇందులోని బోధ.

"భాగ్యత్రిపుటి" లో ఒక వ్యక్తి తనను అందగత్తె వరిస్తుందనీ గొప్ప ఉద్యోగం, ధనం లభిస్తాయనే విశ్వాసంతో ప్రపంచం అంతా

తిరిగి విఫలుడై తన యూరిలోనే వాటిని సాధిస్తాడు. "విధి స్థాపించిన దో టే మనం పరిశీలిస్తే మన విధి అర్థమవుతుంది" అనేది అతని బోధ.

ఒక వ్యాపారి, రాజకీయవేత్త, అమ్మాళ్ అనే స్త్రీ వృద్ధులై ఒక డాక్టర్ కనిపెట్టిన యౌవనం యిచ్చే మందు త్రాగి యువకులై ముసలి డాక్టర్‌ను హేళన చేస్తారు. కొంతసేపటికి మరల వృద్ధులౌతారు. ఇది చూసి యీ మందు త్రాగనే త్రాగనంటాడు డాక్టరు. యౌవనం వస్తే మరల అవే బుద్ధులు తప్ప సద్బుద్ధులు రావనేది 'డాక్టర్ చేసిన తమాషా' లోని బోధ

ఆదిశేషు భార్యయైన కల్యాణిని ఆమె బావ మోహన్ మోసగించి రామబ్రహ్మానికి అమ్మివేస్తాడు. ఆమె ప్రేమించినట్లు నటించి అతని నుండి తప్పుకోవటం "ధర్మోజయతి" లోని గాథ. "వ్రజన్తితే మూఢధియః పరాభవం భవన్తి మాయా విషు యేనమాయినః" అనే భారవి సూక్తి నిరూపించబడినది.

'ప్రేమసత్త' యనే కథ ఆంగ్లంనుండి యనువదింపబడినది. భద్ర. అనే యువతి ప్రసాద్‌ను ప్రేమిస్తుంది. భద్ర తల్లి విశాలాక్షి తన కూతురిని ధనవంతుడైన చలపతి కివ్వాలని తలుస్తుంది. భద్ర ప్రసాద్‌ను తప్ప యింకెవరినీ వివాహమాడనని ఎదురుతిరుగుతుంది. దుర్మార్గుడైన చలపతి వారి వివాహానికి అంగీకరించినట్లే అంగీకరిస్తాడు. ఒంటరిగా చదువుకుంటున్న భద్ర వద్దకువచ్చి కుష్ఠురోగి చలపతి తన పుండ్ల చేతులతో ఆమె ముఖాన్ని రుద్ది యామెను వికృతను జేస్తాడు. తనకు దక్కని అందం ఇంకెవరికీ దక్కరాదని చలపతి దురాలోచన. ధనం తేవడానికి వెళ్ళిన ప్రసాద్ ఆమెనుచూచి నిశ్చేష్టుడవుతాడు. ఆమె ముఖం వికృతంగాఉన్నా హృదయాన్ని ప్రేమించిన ప్రసాద్ భద్రనే వివాహమాడతాడు. "ఆమెను సంతోషపెట్టడమే అతని లక్ష్యం" ఇలా ప్రసాద్ పాత్ర చిత్రిస్తాడు కవి.

'తపస్సు' అనేది కవి పూర్వవంశీయులచరిత్ర. ఇద్దరు బ్రాహ్మ ణులు వర్షాలు కురిపింపగా అలంఘీర్ పాదుషా మెచ్చి "మంకెన" "ఏదుబాడు" అనే అగ్రహారాలు బహూకరించడం ఇందులోని యితి వృత్తం. ఈ గాథ కవిగారి వంశచరిత్ర సందర్భంలో వివరించడం జరి గింది. బ్రాహ్మణులు చదివిన వేదమంత్రాలలోని భాగం ఇలా ఉంది. "యావతీర్వై దేవతాస్తాస్సర్వా వేదవిది బ్రాహ్మణే వసన్తి,తస్మాద్బ్రా హ్మణేభ్యోవేదవిద్భ్యో నమస్కుర్యాన్నాశ్లీలంకీర్తయేత్ .... ........" ఈ గాథ ఇలా బోధిస్తూంది. "అన్నమయాది కోశాలలో ఒకదాని కంటె నొకటి క్రమంగా గొప్పది. ప్రత్యగాత్మ అనుభూతి పరంపరచే సృష్టిగత సాధనద్వారా సమష్టిగా పర్యవసించి ఆరోహణక్రమమున సర్వశక్తిమంతుడై జీవి అవరోహణక్రమంలో ఆశక్తిని లోకకల్యా ణానికి ఉపయోగించవచ్చు. ఈ విషయాన్నే "అహంబ్రహ్మాస్మి" అనే వాక్యం సూత్రప్రాయంగా చెప్పింది.

కుంటివాళ్ళైన దంపతుల జీవన్నాన్ని చూచి జిజ్ఞాసువై కవివారి వద్దకు వెళ్ళి వారి జీవితం తెలుసుకుంటాడు. లోగడ తమమాట ప్రజ లెలా గౌరవించారో ఇప్పుడూ అలాగే గౌరవిస్తున్నారని తనుప్రభువే నని విధినియోగం వలన కుంటివాళ్ళం అయ్యామనీ చెబుతారు. "ప్రభువు" అనే శీర్షికతో ఈ గాథ చెప్పి, "ఎవడు ప్రభువు? ఎక్కడుంది ప్రభుత? అని ప్రశ్నిస్తూ ముగింపు పాఠకులకే వదలివేస్తారు రత్నకవి. తృప్తి గలవాడే సుఖవంతుడని భావం.

ముల్కిరాజ్ఆనంద్‌గారి కథ "నేతినేతి" అనే కథగా అవత రించింది. పితరులతో కూడినపుడు సంతలో మల్లెదండ, సర్పంబొమ్మ, చాక్‌లేట్లు, రంగుదారాలు కావాలని యేడ్చిన బాలుడు తల్లికి దూర మయ్యాక అవన్నీ వద్దనీ తల్లే కావాలని తల్లిని చేరడం దీనిలోని గాథ. పరమాత్మకు దూరుడై జీవి ప్రపంచం వదలి అతనినే చేరడం అంతరర్థం. ఇలా మనోజ్ఞగాథలతో కథావళిని కూర్చారు.

# Chapter - IX

## విమర్శనా గ్రంథ సమీక్ష

## తెనాలి రామకృష్ణకవి

ఆంధ్రకవులయందు తెనాలిరామకృష్ణుడు దిగ్దంతి వంటివాడని చెప్పవచ్చును. ఈతడు తన ప్రౌఢప్రబంధమగు 'పాండురంగమాహాత్మ్య'మును విరూరివేదాద్రిమంత్రి కంకితమిచ్చెను. ఈతడు శైవుడైన కాలమున రామలింగడను పేరు ప్రసిద్ధినొందినది. ఏలేశ్వరగురునారాధించెనని శివమాహాత్మ్య సూచకమగు ఉద్భటారాధ్య చరిత్రమును రచించెనని చెప్పనగును. పిమ్మట చిక్కాచార్యుల నారాధించి వైష్ణవదీక్షనొంది రామకృష్ణుడై పాండురంగమాహాత్మ్యమును రచించెను. శైవుడైన సమయమున "కుమారభారతి" యను బిరుదుండెడిది. పాండురంగ మాహాత్మ్యకృతిభర్త "శారదనీరూపమ" ని యితనిని ప్రశంసించెను. ఈతడు కౌండిన్యగోత్రుడు. శుక్లయజుర్వేది లక్ష్మమ రామయ నీతని జననీ జనకులు.

ఇందుమతీ పరిణయకర్తయగు రామభద్రుడీతని సోదరుడే. ఈతడు తనగూర్చి పాండురంగమాహాత్మ్యమున శైవవైష్ణవ పురాణావళీ నానార్థ రచనాపటిష్టైకమతి" నని వాకొనెను. వీరి గృహనామము గార్లపాటి, పిమ్మట తెనాలి యయినది. ఉద్భటారాధ్య చరిత్రము చేచమంత్రి కొసంగబడినది. ఇతడు "కామందక" మను గ్రంథమును రచించి వెంకటాద్రి కొసంగెను. ఈతని కాలము 1505 నుండి 1580 వరకని నిశ్చితము. ఘటికాచలమాహాత్మ్యము, కేతువిలాసము, హరిలీలావిలాస మీతని యనుపలబ్ధకృతులు. పాండురంగమాహాత్మ్యమందలి నిగమశర్మ అక్కపాత్ర నద్భుతముగా చిత్రించెను. ప్రౌఢముగా

చమత్కృతితో నిటుల కవితల్లగలవారు ద్విత్రులు లేక పంచషులు. "మందప్రోయాంధ్రకసూరిమి ప్రమానిపండు" వంటి పదాలు వాడడంలో నేర్పరి.

శ్రీ అంబటిపూడి వేంకటరత్నకవిగారు రామకృష్ణుని వంటి యుద్దండపండితుడిని గూర్చి విశేషముగ పరిశ్రమయొనర్చి "తెనాలి రామకృష్ణకవి" యనుపేర నొక విమర్శనా గ్రంథమును రచించిరి. ఇందు రామకృష్ణుని కాలము, కృతులు, వైశిష్ట్యము, పద్యకావ్య మందలి సొగసులు, ఇతర కావ్యములకు దీనికి గల సారూప్యవిచారణము, పాత్రచిత్రణము, భాషాస్వాతంత్ర్యము ఈతని గూర్చి యనేకుల యభిప్రాయములు గలవు. కవిగారి యీ గ్రంథముముద్రితము. వీరి గ్రంథముపై శ్రీ పి. టి. రాజుగారు, టి రాజగోపాలరావుగారు, ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, వేలూరి శివరామశాస్త్రిగారు అభిప్రాయముల నొసంగిరి. కందర్పకేతువిలాసము, హరిలీలావిలాసమీతని కృతులేయని నిరూపితము. కవిగారి యీ పరిశోధనాగ్రంథమును ముద్రించుట యెంతేని ముఖ్యము.

---

"శ్యామలాకాశపుష్పితారామమందు
పూచివిలసిల్లు నక్షత్రపుష్పరాజి
ప్రణయరసమయ హిమకణపటలిఁ గురియు
స్నేహావతికయి పూజాభిషేకమేమొ!"

— ప్రణయవాహిని



గీతావిజ్ఞానాంధ్ర కళాశాల ప్రథమ B.O.L., విద్యార్థులతో, ఉపన్యాసకులతో రత్నకవిగారు

# Chapter - X

## కావ్య సమీక్ష

## చంద్రశాలా (సంస్కృతం)

వీరి సంస్కృత కావ్యం చంద్రశాల రమణీయం. "కవి కర్మ స్మృతం కావ్యమ్" "కమనీయం కావ్యమ్" అని భట్ట గోపా లుడు, లోచనకర్త చెప్పియుండిరి. "లోకోత్తర వర్ణనానిపుణకవికర్మ కావ్యమ్" అని కావ్యమును మమ్మటుడు నిర్వచించెను. కవికర్మ కావ్యమనగా కవియననేమో తెలియదగియున్నది. "నానృషిఃకురుతే కావ్యమ్" అను నానుడి ప్రకారం కవి ఋషిసదృశుడననగును. 'కవ యతీతి కవిః' యని విద్యాధరుడనును. 'కౌతి శబ్దాయతే విమృశతి రసభావానితి కవిః' అని కవియన రసభావవిమర్శకుడని భట్టగోపాలు డనుచున్నాడు. ప్రతిభానుప్రాణనమునొంది వర్ణనా నిపుణుడైనవాడు కవియని భామహుడిట్లనుచున్నాడు.

"ప్రజ్ఞా నవనవోన్మేష శాలినీ ప్రతిభామతా
తదనుప్రాణనాజ్జీవేద్వర్ణనా నిపుణః కవిః"

ఆంధ్రాలంకారికులలో వాగనుశాసనుడగు నన్నయ "విశ్వ శ్రేయః కావ్యమ్" అని కావ్యమును నిరూపించినాడు.

నవనవోన్మేష ప్రతిభా సమన్వితులైన రత్నకవిగారు పై లక్షణ ములతో కూడిన విశ్వశ్రేయః ప్రదములైన కావ్యములనేకముల రచించియుండిరి. "కావ్యంతు జాతు జాయేత కస్య చిత్ప్రతిభావతః" అని కావ్యము ఒకానొక ప్రతిభావంతునినుండియే నిష్పన్నమగునని వృద్ధులు తెలిపియుండిరి. చంద్రశాలయను వీరి సంస్కృత కావ్యమిట సమీక్షింపబడుచున్నది. ఈ కావ్యము 1972వ సం॥న ముద్రింపబడినది.

1972-10-25 నాటి ఆంధ్రప్రభ వారపత్రిక ఇది సత్కావ్యమని ప్రశం సించెను. 1972 ఏప్రిల్ నెలలో 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' అను ఆంగ్ల పత్రికనందు A little bizarre అను పేర శ్రీ జి. కె యం గారు సరస భాషయందు వ్రాయబడినదనిరి. పాశ్చాత్య భావాలతో కూర్చబడిన కావ్యమని చెబుతూ శ్రీ జి. కె. యం. గారిట్లనిరి. "A distinctor is drama between passion and love and the poet mentions that the bliss of Atman is superior to that of sex. A book of this type would look a little bizarre"

శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారియభిప్రాయం—"చంద్రశాలా నామకమిదం నవభావ సముజ్జ్వలమ్. రసపిచ్ఛిలమ్. సుఖదుఃఖయోః తారతమ్యం సూక్ష్మదృష్ట్యా వివేచితమ్"

మనోహరమైన ఈ కావ్యంలో ప్రవేశకాండమ్, జాగరకాండమ్ స్వప్నకాండం | జాగరభావ్యకాండం, స్వప్నభావకాండం, పరిణామ కాండం అని ఆరు భాగాలున్నాయి. "చంద్రశాలా శిరోగృహమ్" అని అమరము. చంద్రశాలయనగా సౌధోపరిభాగం. అటగల యువతీ యువకులకు జరిగినగాధే యీ కావ్యం. అందుకే కావ్యం చంద్రశాల అయినది.

నూతన వివాహితయైన ఒక వనిత తన భర్తను తాకవలదని కన్నీటితో పలుకును ప్రకృతి విరుద్ధముగా పల్కుటకు కారణమేమని భర్త లాలించును. ఆమె మౌనవతి కాగా ఆతడు మంచముపై ముసు గిడి నిద్రించును. ఆమె నేలపై ముగ్గులనడుమ కూర్చొని దీర్ఘాలోచన యందుండును. ఆమెయెదుటనొక ఛాయామూర్తి వాయురూపమును ధరించి కనబడి యామెతో భాషించును. బాల్యమువనీమెతో ప్రేమ కలాపమునను౦డిన వ్యక్తియే ఆతడు. దుర్దైవవశమున నాతడు మృతి నొందెను ఆతనిగాంచి తనను స్వీకరింపుమని కోరును. ఆతడు నీకు

సుతునిగా జన్మింపగోరుచుంటినని జననివి కమ్మని కోరును. ఆమె మౌనముగా విచారించుచుండును. నిద్రించిన ఈమె భర్తకు స్వప్నము వచ్చును. స్వప్నమందాతడు పులిని గాంచి పర్వతమునధిరోహించును. వ్యాఘ్రి యాతనిని సమీపించి వివాహమాడుమనును. ఈతని సందేహమును గాంచి వ్యాఘ్రమనరాకారములుగల యువతిగా మారును. చంద్రుడిరువురనుకూర్చి సంతసించిననుజంతువునకు నరునకుసంబంధ మెట్లనును. స్వప్నము చెదరును. ఇతడు ముసుగులోనే యుండును. ఆత్మస్వామి. ఉపకరణములకు ఏకత్వము సాధింపబడవలయును. ఆకారము లోకస్థైనంత మాత్రమున స్వభావములోకటిగాకుండుటచే వారి స్వప్నమందు వ్యాఘ్రి నరులకు చర్చసాగును. యువకుడు మేల్కాంచగా యువతి యాతని సమీపించును. అతడు సౌమనస్యముతో వెడలిపోవును. ఆమె అడ్డగించి ఛాయామూర్తి విషయము వివరించుచుకోడికూయును. పాన్పుపైనున్నవారు లక్ష్మీనారాయణుల వలె ప్రకాశింతురు.

## సమీక్ష

సంస్కృతంలో భావ కవితాధారను వెలయించిన కవిచంద్రుడీతడు. షెల్లీ, కీట్సు వంటి పాశ్చాత్య కవులచే ప్రభావితుడైన రత్నకవిగారు ఈ భావ కావ్యాన్ని రచించారు. సంభాషణతో కావ్యము నారంభించుట ఇందలి క్రొత్తదనము. ఈ కావ్యంలో ద్రుతవిలంబితము. మందాక్రాన్త, ఉపజాతులు, శిఖరిణి, శార్దూల విక్రీడితము, మొదలగు వృత్తాలు ప్రయోగింపబడినవి. ఇవిగాక భావ కవిత్వం చాలాచోట్ల ప్రదర్శింపబడింది. వీరి సరస కవిత్వానికి యీ క్రింది పంక్తులుదాహరణాలు.

“స్రవతి కజ్జల బాష్పకణావలిర్వివృత పక్ష్మలకోణ వినిర్గతా”
“అపి తు కంటకఘోర తమోవృతా సుమలతాగతిరాత్మవినోహితా
“శమసమాకుల భీషణభాషిణీః ముఖ సమావృత బాష్పజలాకులామ్”
“సమవలోక్య ససంభ్రమ ఉత్థితః దశనదష్టరసజ్ఞ ఉపావిశత్”

ఛందోవ్యాకరణాదినియమాలులేక భావప్రధానమైన వ్యావహారిక భాషలో వచనం వలె సాగే రచనయే భావకవిత. భావకవితకు చక్కని యుదాహరణమిది —

"నిబిడాంధతిమిరనిభృతనిశాకాశే
అసితాభ్రపటలగర్జాసంఘుష్టే
అక్షిభ్రాంతిమత్యాం
తటిల్లతాయాం
కిం వా దృష్టమ్
కిం వా నదృష్టమ్

ఈ కావ్యంలోని చక్కని ఉపదేశాలు చూడండి —

"యత్ర హ్యాన్నతు తత్ర విషమివ తు మధు భవతి"
ఆకారం ఒకటైనంత మాత్రాన మనసులోకటవుతాయా? అంటారు రత్నకవి.

"ఆకారాతులోప్యయది అంతరంగో సమో భవతః కిమ్"
అవిస్పష్టవాంఛాకూరం, అంతర్నిగూఢతాపం గలది భావకవిత యని శ్రీ విశ్వనాథవారి యభిప్రాయం. అలాంటి భావకవితను చూడండి —

"ఇష్టజనకాంతా జాలాదనిష్టకర్మప్రతిపాదనం కరోతి చేత్
అనంగీకారత స్తాంతః కరణవశంగత శరీరస్య
కార్యనిర్వాహాణం
అనుల్లంఘనీయం భవతి యది
తర్హి ఉపక్రమణాస్య
ప్రోద్బలకవస్తుకిమ్ ? "

"సిద్ధమన్నం పరిత్యజ్య భిక్షామటతి దుర్మతిః" అనే న్యాయం ఇలా పొందగబడింది.

"హస్తగతరజ్జుం పరిత్యజ్య కూపగతపాత్రం వాంఛేత్"

పిచ్చికుదిరితేగాని పెళ్ళి కుదరదు, పెళ్ళి కుదిరితేగాని పిచ్చి కుదరదనే సామెత "ఉద్వాహనిశ్చయం వినా ఉన్మాదవారణం నభవతి ఉన్మాదవారణం వినా ఉద్వాహనిశ్చయో నభవతి" అనిగలదు.

చెట్టుముందా విత్తుముందా అనేదికూడా గలదు.

ఈ కావ్యంలో, "వినాప్రకృతిత్యాగేన నలభతే పరబ్రహ్మ, దృశ్యం గత్సర్వం తద్విలాసః", అనే పంక్తులలో ప్రపంచమంతా బ్రహ్మమయమనే శ్రుత్యర్థం కూర్చబడి "మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతానికావ్యాని భవన్తి అధ్యేతారశ్చ వృద్ధియుక్తాస్స్యుః" అనెడి భాష్యకారునిమాటకు లక్ష్యమైంది.

పవిత్రప్రేమగలవారలకెన్నటికీవిపత్తిరాదనేయీసూక్తి కమనీయం

"విమలమానసబుద్ధినమేతయోః నతుకదాపి విపత్తిరిహాత్యికాః"

భావకవితలల్లగల యీకవిగారికి ప్రాచీనవర్ణనాయుతశ్లోకాలు ప్రాసేశక్తి గూడ గలదని గుర్తించాలి. ఇందుకీపద్యముదాహరణము

"స్ఫారేతేఽసన్తి మృదులాలకజాలకాని స్వేదాంబు బిందుముకులాని చ సంభవన్తి

ఆరోపితాశ్చనిశితేక్షణ బాణజాలాః నిశ్వాసభోగసుమగంధిలరూపమస్యాః"

నాయికావస్థను వర్ణించే యీక్రింది పంక్తులెంతమధురాలో గమనించండి ............

"శీతలాచంద్రికా సిద్ధావిపంచికా మధుమయీవీచికా మంజులాగీతికా
కుసుమితా మల్లికా కూజితా శారికా రమ్యామరీచికా కామ్యాన
శాలికా"

ఏతత్కావ్యపరమార్థం కావ్యంలో ఇలా సూచితమైంది—

"ఆత్మా, ఆత్మస్వామీచ ఉపకరణప్రాణీచ
ఏత త్త్రికస్య ఏకీభావేన సాధితవ్యః పరమార్థః"
జీవబ్రహ్మజగత్తుల ఏకీభావముచే పరబ్రహ్మసిద్ధియగును.

## చంద్రశాల (ఆంగ్లకావ్యం)

శ్రీ అంబటిపూడి వెంకటరత్నంగారు ఇదే కావ్యాన్ని ఆంగ్లంలో రచించారు. మూలాన్ని, ఆంగ్లానువాదాన్ని సమీకరిస్తే సమానసమగ్రమగును. చూడండి—

Entry, watch, Dream, what of watch, Depth of dream, evolution అనేవి ఇందులో భాగాలు.

మూలం : ప్రసవతికజ్జల బాష్పకణావళిర్వివృత పక్ష్మలకోణవినిర్గతా
కిమితి కామిని దీర్ఘనిరీక్షణ ప్రణయశావక జన్మనికింవ్యథా

అనువాదం Shed you why o tears of collyrium,
To the angles of your eyes in full brim
What is the fate of the child of my love,
Which since a time I tended as a dove

ఇంకాయీకావ్యంలోని రసవత్తరఘట్టాలను చూడండి—

That a brute became a scholor
By wonders works of love,
That one was dead a bachelor

By the miracles of love,
No passion it's but love
So claims the 'art of poctic love' mythic muse above,
Who can make life a poem and how.

భావజనిత ప్రేమజనులకుండుగాక. జనులు రమణీయులక్ష్యము నొందుదురుగాక. సముత్కంఠానురాగములతో. మార్గమేర్పడుగాక. ఇట్లుండినచో జనుల జీవిత మమృతధార యగునని యీక్రిందిపద్య మెంత రమణీయ మోగాంచుడు

"Let love be the fruit of passion,
Let target be the source of beauty
Let road be anxious and crimson,
Life will be nectrous and juicy"

ఇదే కావ్యాన్ని శ్రీ అంబటిపూడివారు తెలుగులోకి అనువదించారు. ఇది సాహితీమేఖల ద్వారా వికృతినామ సంవత్సరంలో ముద్రింపబడింది. శ్రీ మారంరాజు వెంకటేశ్వరరావు గారి సాహాయ్యంతో ముద్రింపబడిన యీగ్రంథంలో శ్రీ కొండపల్లి శేషగిరిరావు గారు గిడుతూరి సూర్యనారాయణగార్ల చే గీయబడిన చిత్రాలున్నాయి. పద్యాలు, గేయాలతో సాగిన యీ గ్రంథంలోని కొన్ని మనోహర సన్నివేశాలను మనవి చేస్తాను. —

"రాలిపడినట్టి ఫలమేని ప్రసవమేని
తిరిగి తరువృంతమును జేర మరలి చనునె
విల్లువిడిచిన నారాచమే విధినిగాని
వెడలుకే తిక్క మరలుట పొడమదెచట"

"వనలోపలి పరిమళమ్ము తువిలోగల జలరయమ్ము
నిను నీవే యరసికొమ్ము నను గాంచెదవపుడు సుమ్ము"

"విమలవియత్ప్రభా తల నివిష్ట నిశాకర తారకా గణ
క్రమ పరిశీలితమ్మయిన గాధల బాధలు జాలిగొల్పె నా
హిమకరుడల్లనల్ల చదలీడి, కరంబులుజాపి ప్లావితున్
రమణి శిరశ్శకీర యుగళంబొక రూపుగనొత్తు దానినిన్"

ఈ కావ్యం గతాసువులైన వారి సోదరుని స్మరిస్తూ వ్రాయబడింది.

ఈ కావ్యంపై పాశ్చాత్య రచనల ప్రభావమెంతేని గలదు. కథలోను, ఛాయామూర్తి కోరికలో, స్వప్నంలో వ్యాఘ్రిసంభాషణలో కొంగ్రొత్త పద్ధతులే గోచరిస్తున్నాయి. ఛాయామూర్తి మాట్లాడడం, శైశవంలో ప్రేమించుకొన్న ప్రేమికులలో ఒకరు మృత్యువునొందడం, ఈమె వివాహితయై భర్తతో తన గత వృత్తాంతం వివరించడం ఇదంతా సంస్కృత కావ్యాలలో క్రొత్త పద్ధతియని చెప్పవచ్చు. సంస్కృతంలో గూడ భావ కవితను ప్రవేశ పెట్టడం కవిగారి ప్రాచీన నవీన భావ సమన్వయానికి లక్ష్యమౌతుంది. ఆంగ్లాంధ్రాలను పఠించిన రత్నకవి గారు గైర్వాణిలో గూడ నవ్యకవితోద్యమాన్ని ప్రవేశపెట్టడం అభ్యుదయం. "పురాణమిత్యేవ నసాధుకావ్యం నవీనమిత్యేవ నచానవద్యమ్" అన్న సూక్తిని కవితలో ఆచరణకు తెచ్చారనవచ్చును.

## గోపీకావ్యము

పరిస్పష్టి కథాభాగమునగల నవల, ఆకర్షణీయ కథగల నవల యని నవల రెండు విధములు. ప్రబంధములలో వర్ణనలకు ప్రాముఖ్యముండును. ప్రబంధ నవలాధోరణులతో శ్రీ వేంకట రత్నకవిగారు నూటు భిన్నభిన్న వృత్తములతో యీ కావ్యమును రచించిరి. విరహిణియైన గోపిక నదీతీరానగల తోటలో శరచ్చంద్రికలలో శ్రీకృష్ణుని వెదకుచూ విలపించును. తీగలలో తిరుగుచూ బడలిక చెంది స్పృహ తప్పును. పశులు సానుభూతితో అరచును. ఉషస్సమయంలో గొల్ల

వాండ్రు అన్నం మూటలుగట్టుకొని వెళ్ళుచుందురు. ఇంతలో మురళీ నాదం విని గోపిక పరవశిస్తుంది. శ్రీకృష్ణుడామెను స్పృశించిన పిమ్మట ఇరువురూ పొదలలో విహరించెదరు. మరల శ్రీకృష్ణుడంతర్ధానమును జెంద వివశురాలై కాననమంతయు పర్యటించును. ఒకవృద్ధు ఆమెను ఓదార్చి తన కుటీరమునందుంచి, శ్రీకృష్ణుని లక్షణముల దెలిసికొని వెదకి తెచ్చును. కాటసారి యంతర్ధానమగును. గోపీకృష్ణులనేక కుంజముల విహారింతురు గోపివంటి యనేక భామినులు కృష్ణవిరహాళి తప్తలగుదురు. వారి యందరితో కృష్ణుడు విహరించుటజూసి గోపి విస్మితురాలగును. కుటీరమును జేరిన పిదప గోపికకు శ్రీకృష్ణుని విశ్వరూపము గాన్పించును. గోపి సంసారబంధములు వీడి శ్రీకృష్ణునియందు లీనమగును. పరబ్రహ్మమగు శ్రీకృష్ణుడు మురళివాయిస్తూ సాగిపోవును. ఇది యీ కావ్యంలోని గాథ ఇది 1975-6-26న పూర్తిచేయబడిన ముద్రిత గ్రంథము.

కావ్యస్వరూపావగతికై కొన్ని రసవత్తరఘట్టాలను చూపిస్తాను.

"మనసొకట్టుండిన మానవునిన్ ద్రవమానటు మార్చెడి దృశ్యమహో" అని గోపీ విరహస్థితి వర్ణితము. "ఏమరకు నొరగిన వన మహీంళయనన్" యను సందర్భమున కవిప్రోక్తము కాకున్నను ఉత్ప్రేక్షరమణీయము. "సంభావన మథోత్ప్రేక్షా ప్రకృతస్య పరేణ యత్" అని చంద్రాలోకము. "అతడు వాత్సల్యామృతానంతము దధినైన ఆపైభక్తిధునీస్వరూపమయ్యె" అన్నచోట రూపకంద్వారా తత్త్వార్థం బోధింపబడింది. "నిర్వాణము నేమిగూర్చునో" (20) అని "మందమతినై నిదురనొందితిని" యని గోపిక ఆక్రందించుట రమణీయము. పారిజాతాపహరణాదులయందువలె కావ్యమధ్యమున 39నుండి 47 వరకు గల పద్యములు గోపిచేసిన శ్రీకృష్ణస్తుతిగలదు. "మయ్యేవ మన ఆధత్స్వమయి బుద్ధింనివేశయ" అను గీత శ్రీకృష్ణబోధగా కావ్యమందిట్లు గలదు- "మనసు నాపై లగియించి సమస్తము దీక్షతో,

కనుమూసిన మొగిడ్చిన కాంతురు నన్నటన్" "ఏక మేవాద్వితీయం బ్రహ్మ, తదైక్షత బహుస్యాంప్రజాయేయ" అను శ్రుత్యర్థము 80 వ పద్యంలో "మొదటకలడొకండనెనాతి" యని వివృతము. కావ్యమధ్యమున కవిగారు దివంగతులు కాగా వారి శిష్యులైన వంగల వెంకటచలపతిరావుగారు 91 నుండి 101 వరకు గల పద్యాలను రచించారు. ఈ రేఖాచిత్రం మనోజ్ఞం.

"కేలు బుజానలగించి గిరగ చెక్కిలిన్
సోలుచుమైపులకించి చూచిత పుల్కవన్
వ్రాలుచు నాపై మనిపట్టెను కౌగిలిన్
చాలగ ముద్దులగూర్చి సాగెను చల్లగన్"

## వత్సలుడు

అంబటిపూడి వేంకటరత్నంగారి ఐదాశ్వాసములతో కల్పింపబడిన కావ్యమే "వత్సలుడు". 102 పుటలుగల యీ కావ్యం 1941 లో ముద్రింపబడినది. ఆంధ్ర సారస్వత పరిషత్తువారి విశారదపరీక్షకు 1950 నుండి 55 వరకు పాఠ్యగ్రంథముగనున్నది. ఈ కావ్యమును శ్రీ చలమచర్ల రంగాచార్యులుగారు శ్రీ విశ్వనాథసత్యనారాయణగారు ఉత్తమ కావ్యముగ ప్రశంసించియుండిరి. ఈ గ్రంథ ప్రచురణకు శ్రీ మంత్రి వెంకటేశ్వరరావుగారు దేశపాండ్యా, ముఖేదార్, పుల్లెంల సహాయపడిరి. శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు యీ కావ్యాన్నిలాప్రశంసించారు.—"కులకుభాంగివ యోధీరకుసుమమందు మోహమధువె గవేషించెమున్ను సుకవి సాత్త్విక ప్రేమకోశపేశలములైన వత్సలామృతరుచులను వలచె నేడు."

ఈ కావ్యమునుగూర్చి పత్రిక ఇట్లువ్రాయుపడినది.

"వత్సలుడు సర్వవిధముల వీరి వస్తునిర్మాణ కౌశలమునకు తార్కాణ. తాత్త్విక జిజ్ఞాస, భక్తిని చూపిన గడుసరి కవి.

మేఖలద్వారా ప్రచురితమైన యీ కావ్యంలో రమణీయ పద విన్యాసాలు గలవు. పలుకుతునకలు, లేజిబురువ్రేళ్ళు, ముద్దుముగ్గులు అను పదములు జాను తెనుంగులోని తీయందనానికి ప్రతీకలు. వీరి గైర్వాణ్యాభిమానానికి జిహీర్ష, అపాంపతిక, కవోష్ణ పదాలు సూచకాలు. ప్రభాతసుశీలల సంభాషణలోని యీ క్రింది పద్యం రత్నకవిగారి ధారాశుద్ధికి, భావగాంభీర్యానికి, సరసకవితాకవనానికి మచ్చుతునక.

"మధురతరమగు మాధ్వీకమణికమందు
గ్రావ నిభమయ్యె ఖండశర్కరక రంగు
కరగవలెనని పుష్యరాగమున కేల
ఆర్ద్రహృదయము ప్రాక్తనాహ్లాదఫలమొ"

ఈ కావ్యంలో ప్రభాతసుశీలల హృదయావర్జక సంభాషణ సహృదయుల నలరిస్తుంది. వత్సలుడు ముసలిని రక్షించును సుశీల వత్సలుని కంఠమును కుసుమదామముతో నలంకరించును. ప్రభాత వృద్ధురాలిని ఫలాదులతో సత్కరించును. సుశీల వాక్యశ్రవణానంతరం వత్సలుడు వెనుదిరగ నచట శ్రీకృష్ణుండుండును. వృద్ధ యువతి యైనపుడు ఆమెను ఆపె సమ్మతినిగాక నన్యులకు నిశ్చయింతురు. పిమ్మట యామె గృహమును వీడి హృదయహారుని వెదకుచూ వృద్ధయైనది. సుశీలా వత్సలుల సంభాషణ చతుర్థాశ్వాసమున రమణీయముగ సాగినది. వృద్ధురాలి ప్రేమికునికి యొక మచ్చ యుండును. వృద్ధురాలు తన ప్రియుని పటమునిచ్చి యాతడు గనుపించి విలపించిన యొక కన్నీటి కొట్టునద్దు మనును. వత్సలుడు వృద్ధురాలి ప్రియుని యామెకు చూపించును. వృద్ధురాలు పరవశించి హఠాన్మరణము నొందన వృద్ధుడును యామెపై పడిపోవును. వత్సలుడు ప్రభాతను సోదరిగ గౌరవించును.

కావ్యమందలి రమణీయ భావ విన్యాసము నీ క్రింది పద్యమున గాంచుడు.

"నవనవాలోలచూతపల్లవపుకండు, జీల్చివైచెను పికమనుచింతయేల
కలకలకషాయ సురభిళకంఠమెత్తి, వేణువీణాతిశయగీతి విసరునేమొ"

అచ్చ తెనుగునుడికారంతో హృదయాలనుపులకింపజేసి ఆంధ్రుల కాంధ్రభాషాభిమానాన్ని కలిగించే కవిగారి నేర్పు నీ క్రింది పద్యంలో చూడండి —

"అనివచించిప్రభాతతానవగుచెలియ చిబుకతలమున బుడ్డికెలేజపురు వ్రేళ్ల
స్నిగ్ధమతికి సుశీల కన్నీరుచిలికి, ముద్దుముగ్గులుదీర్చె కపోలయుగళి"

ఇతరులు కుమారుని ప్రశంసించుచుండ తండ్రి మాత్రము పేతు వహించుట యాతని యసూయయా? యని కవిగారు చమత్కరిస్తారు. "ఓర్వలేడేమొ పుత్రకాభ్యుదయ మతడు" అనుట పుత్రుని తండ్రి ప్రశంసింపరాదని "పుత్రః శిష్యః కదాచన" అనెడి నియమపాలనమే నని గుర్తింపజేయుచున్నది.

శ్రీకృష్ణతత్త్వమును బహిర్గతం జేసే యీ క్రింది పద్యాలు చిత్తాకర్షకాలు —

"సుఖమో దుఃఖమొ పాలబడ్డదేదియో శోకింపకుహ్పొంగకీ
నిఖిలాజాండ సమీకరంగమువ నిర్ణింద్రుడవై పుత్రక
ర్మఖనిత్వంపు పతాక నిల్పుకొని పోరన్ జాత్రిపోరానిదే
సుఖశస్త్రంబా పరిగ్రహింపుమని నీ సూక్తుల్ ప్రబోధింపవో"

'స్వార్థమనుపంకమెఱుగదచ్ఛపుసరస్సు, నీనుజీవితకథకృష్ణనిజముసుమ్మ
కానిచో పార్థసారధిగాడవగుట కర్మమె గెలుపెల్ల నీకతన గలుగ"

హృదయములనుహ్పొంగజేయుట సత్కవికి ముఖ్యమని వ్యర్థ పదాడంబరం కూడదని శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు కవిత్వ

తత్త్వ విచారంలో నిర్వచించారు. నిత్యజీవితంలో వాడే పదాలతో నే చక్కని భావాన్ని ప్రదర్శింపగలవాడు మహాకవియని వారియభిప్రాయం తాదృశలక్షణగ్రథితమైన రత్నకవిగారి కవితాధారను గాంచుడు.—

"లేదమలపాకుతీవ శరీరమపుడు పచ్చతంగేడు పూవన్నె బరగుమేన
మొగలిపువ్వులోని నునుపులు నెగడుచుండు, కనినయువకుడు కన్నార
గనకపోడు"

"మధుకణముసుండి మాధురీమహిమ దీయ
విమలనిర్ఘ మునుండి రావమును దీయ
శీతలజ్యోత్స్నగల చల్వ సేకరింప
విఫలులైరెరో తెలుపరావిధిని నెవరు"

మలువు లెరిగిన కంఠమెన్నడును తప్పుత్రోవలకుపోదని, అవాంతర జనిత పథములగలుపుకొనుటయో, క్రొత్త పథమ్ముము కల్పించుకొనుటయో జరుగునని కవిగారనుట హృదయంగమము.

"మలుపులెరిగిన కంఠమేమార్గమందు పయనమయ్యును తప్పు
త్రోవలకు బోదు
కలిసివచ్చిన బాటలగలసికొనును బాటలేకున్నవొక క్రొత్తబాటవేయు"

కవిగారి కలం నుండి జాలువారిన యీ సంధ్యావర్ణన శీతలజలధార కావ్య రామణీయకతకు పరాకాష్ఠ.

"అదిశరత్స్వచ్ఛపూర్ణిమాహరవసానవేళ ప్రత్యగ్దింగనావేణి వెనుక
జారుచున్నాడురవితనతేరుతోడ కెంపునెమ్మోముతోనూర్పులంపువసుధ"



# వనవాటి

రత్నకవిగారి సోదరుడు శ్రీ మార్కండేయశర్మగారు స్వర్గస్థులైనపుడు విలపించినవారి స్మృతి చిహ్నంగా కవిగారీ గ్రంథాన్ని రచించారు. వనవాటి యనే యీ కావ్యంలో 1) నాటినిశీధి 2) నేటి ప్రభాతం 3) అనుభూతి 4) సాధన 5) ప్రకృతి 6) అంధభిక్షుకుడు 7) కంససంహారానంతరము 8) కావ్యఋషి 9) అంఘ్రి 10) ప్రణయిని 11) అద్వైతం 12) యౌవనజ్వాల 13) మౌగ్ధ్యం 14) అరగన్ను 15) రైతుచెలి 16) ఆకలి 17) శ్రీమతిశారద 18) తెలుగు బ్రతుకు అనే విషయాలపై కవితలల్లబడినవి. ఒక్కొక్క విషయాన్ని బహుభంగుల పరిశీలించిన కవిగారి కవితలమూలాల్యాలు Pessimistic out look ను గ్రహించి కవిత చెప్పడం భావకవుల లక్షణమే. సంకుచిత లేదా విభ్రాంత మనస్తత్వాన్నే Pessimistic outlook అంటారు. 'One who sees things at the dark side అనేది సంకుచిత భావానికి లక్షణం. న్యూనతాభావం (Inferiority) తో కలసిన ఈ భావాన్ని గూడా కృష్ణశాస్త్రి మొదలగు భావకవులు వర్ణించారు. అనుభూతి శీర్షికలో యీ భావాన్ని చూడండి —

"కాలుకదిపినపై బడుకాలకూట శీకరములు బుస్సనెడు నాశీవిషంపు
ఉలివు వినవచ్చు కనబడదురగ మెవరెయొ నరఫణుల హార్మ్యవల్మీ
కాంతరము లందు"

ఆశ్రమాదులచెంతరచించిన మునుల కావ్యాల మాహాత్మ్యాన్ని చెప్పే 'కావ్యఋషి' లోని ఈ పద్యం మధురం —

"నాకిహమే అబద్ధము సనాతనగాథలు త్రవ్వువేళనా
హాకవిమానులార భవదాశ్రమసీమలచెట్ల క్రిందనే
చీకును చింత లేక విరచించిన మీ కవనమ్ములూరు మా
ధ్వీకము గ్రోలుచున్ భవదధీనము నానకలమ్ము నాటికే"

ప్రాచీనుల కావ్యాలగాంచి నేటి కవులు లజ్జాలురవుతారని 'నీదు కృతియందు నొకింత పఠించి రేని గర్వంబు నశింప నేటి కవిబాలురు సిగ్గిలరే ఋషీశుడా' యనడం సముచితం.

పల్లెల బాగుకోసం ఉపన్యాసాలుచెప్పి వ్యాసాలు వ్రాసేవారే కాని ఒక్కడూ గ్రామాలకువచ్చి గ్రామీణుల బాగుకోసం పాటు పడేవాడు లేడని రైతుల ఇక్కట్లను వర్ణిస్తూ 'రైతుచెట' కవితలో ఇలా అంటున్నారు. —

"పల్లెలబాగుకై సభలబల్కెదురో ప్రతిపత్రికాముఖం
బుల్లసిలంగ వ్యాసములనొప్పగ జేతురొయంతెగాని ఘో
షిల్లుచు గంజికై ఋణపు శృంఖలలన్ నిలువెల్ల నీరుగా
గుళ్ళెడి రైతు నాదుకొన గోరెడి సోదరుడేడి పుట్టెనే"

"శ్రీమతి శారద" శీర్షికలో "నీవు నటివి నేను కవిని" అనడం చమత్కారజనకమేగాక కళాదృష్టి నిరూపకము.

తన రక్తంలోని అణువణువునందు నాంధ్రాభిమానంతో పరవ శించిన రత్నకవిగారు తెలుగుబ్రతుకులో —

"తల్లియొసగెడి పాలు తెలుగే
తండ్రి గరపెడి పలుకు తెలుగే
తరుణి చూపెడి వలపు తెలుగే - తెలియరా
మన బ్రతుకు బ్రతుకే - తెలుగురా" అని పఠితలను గూడా

పరవశింపజేయడం ఆంధ్రావనిజేసిన యదృష్టమగును. ఇలా 'వనవాటి' కావ్యం నైకవిధపుల్లకుసుమభాసమానమైన నందనవనంలా కవితాపిపాసువులకు గోచరిస్తోంది.

## ప్రణయవాహిని

అవ్యాజానురాగప్రదర్శకమైన "ప్రణయవాహిని" యనే కావ్యం 1936 లో ముద్రింపబడింది. 145 పద్యాలతో సాగిన యీ కావ్యం సంఘసంస్కరణ ప్రధానం. ప్రణయవాహిని కావ్యంలో భావకవితాచ్ఛాయలెక్కువ. ఈ కావ్యాన్నిగూర్చి శ్రీ విశ్వనాథసత్య నారాయణగారి మాటలాలకించండి —

"ఇందులో ధారాశుద్ధి, పాకం గలవు. కవితాత్మ గల శబ్దా లున్నాయి. అకుటోడలు మొదలైన శబ్దాలు శోభావహాలు. భావ ప్రౌఢి గలదు కథ నవనాగరకతా విషయం. చివరి పద్యంలో వ్యంగ్యా ర్థాలున్నాయి. కావ్యపరమార్థం గలదు".

భావకవులు భావనవ్యత, నూతనపదప్రయోగం, శైలీనవ్యతను సాధించిరని "ఆధునికాంధ్ర కవిత్వము"న డాక్టర్ శ్రీ సి. నారాయణ రెడ్డి గారు నిరూపించి రాయప్రోలు మొదలగువారి కావ్యాలను సోదాహర ణముగా సమీక్షించారు. ఇదీ చక్కని భావకావ్యమే గనుక దీనినుండి పై విషయాలను నిరూపిస్తాను.

కపోలపుష్పముల్, అకుటోడలు అనుట భావనవ్యతకుదాహరణం కృష్ణశాస్త్రి రాయప్రోలు మొదలగు భావకవులు మకరందాన్ని పూల పాలని, సుమములను బాలింతరాండ్రని వర్ణించిరి. రత్నకవిగారు "వలపుపుప్పొడి" యని వాడిరి. తెలుగువారినలరింపజేసే అచ్చ తెనుగు సమాసాలు - "చలువరాతికట్టడము. ముత్తెపుకోన".

డెందముల జల్లుమనిపించే పదవిన్యాసాలు - "పింజలుపింజలై నిగారించు కొమరు, లేజివుళ్ళపస." "ఒక్కకీర్తనకే వేయు కరకముడి వేయ నేర్పరి." అను స్థలమున భావప్రౌఢి గలదు. ఏబదియైదవ పద్యంలోని ఉత్ప్రేక్ష హృదయాహ్లాదిని. 18, 19 పద్యాలు వీరు సరస

రచనలో సిద్ధహస్తులని నిరూపిస్తున్నాయి. మనసు, పాదాలు రెండు తత్తరపడుచున్నవని "తప్పటడుగుల మనసు తత్తరపడంగ" అనడం సముచితం. 43, 60 పద్యాలలో సందేశాలిమిడియున్నవి. వృసాధిప శతకంలో "బలుపొడతోలుసీరయును పాపసరుల్ గిలుపారుకన్ను....అని" అచ్చ తెనుగు పద్యాన్ని రచించి దానికి జాను తెనుగని నామకరణం జేశాడు పాల్కురికిసోమన. అట్లే కవిగారు 47 వ పద్యంలో అచ్చ తెనుగు వాడి తెనుగునుడిలో కూడ తాము ప్రవీణులమని నిరూపించారు ఇందులోని "ఎవరివిత్తంబువారికీ ఘనమౌ" అనేటిపద్యంలో లోకోక్త్య లంకారం ప్రయుక్తము. "సహాస్వకతిచిన్మాత్రసాన్ మిాలయి త్వావిలో చనే" అనేది జయదేవుడిచ్చిన యుదాహారణము. సానుభూతి సుహృ ద్భావాల మాహాత్మ్యాన్ని చెప్పే యీ పద్యం ఎంత గొప్పదో సహృ దయులే గమనిస్తారు.

"జీవికి జీవి కష్టసుఖ చింత వహించుట తప్పుగాదు శో
కావిలలోకమందు సుఖమంద పరస్పర సానుభూతియే
పావనమైన సాధనము వాయ భయంబనురక్తతె సుహృ
ద్భావముతోడనో చెలియపల్కు కటంచును గూరుచుండినన్"

ప్రణయం గొప్పదని, ప్రణయస్పందనలేని వ్యక్తిజీవనము వ్యర్థ మని తెలిపే యీ క్రింది పంక్తులు చిరస్మరణీయాలు.

"ప్రకృతి సౌందర్యసుమమ్ముతో ప్రణయరసమౌ
జీవనంబది లేక నిర్జీవము విడ
జంగమస్థావరాత్మక సంభవంబు"

"మిత్రేణ సహాత్యాంతం క్తే తతో నాస్తీహ పుణ్యవాన్" అని తో వదేశంలో స్నేహంయొక్క గొప్పదనం చెప్పబడింది. అలాగ స్నేహాన్ని వివరించే కవిగారి యీ పల్కు హృదయాలలో నిల చుంది.

"ఏనాడుద్భవమయ్యె జీవకులమందే స్నేహభావంబిలన్
జ్ఞానాజ్ఞానవిభేద వస్తుగత సంజ్ఞల్లేక తత్స్నేహామే
నానాశక్తి దమై యగోచరమహానందంబు లూరించుచున్
ప్రాణిశ్రేణి పరస్పరంబు విడిపోవన్రాక బంధింపదే"

"బాలపల్లవగ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిన్"
వచ్చినదని నంది తిమ్మన పారిజాతాపహరణంలో వర్ణిస్తాడు. భట్టు
మూర్తి బావురుమని యేడ్చినదని వర్ణించెను. కవులకు రమణుల
రోదనాన్ని వర్ణించడం సరదా. రత్నకవిగారుగూడా రోదనాన్ని వర్ణిస్తు
న్నారు చూడండి. —

"అని కవి పల్కుచుండగ నెయంగన కన్నులబుట్టి కాల్వలై
నునుపు కపోలపాళుల వనూనరయంబున జారి బాష్పముల్
దనదన దొర్లెడున్ చిబుకలగ్నములై గిరిసానువంచుకున్
జనియొకచో భువింబడగ జయ్యనజొచ్చు ఝరద్వయంబవన్"

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మిత తయోపదేశయుజే"

అని కావ్యప్రకాశలో మమ్మటుడు కావ్యం సదుపదేశాన్ని
గూడ యిస్తుందని చెబుతాడు. "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అనేది
కుకావ్యాలకు వర్తిస్తుంది. ఈ కావ్యంలో రత్నాలవంటి సదుపదేశా
లున్నాయి. సంఘసంస్కరణాభిలాషులైన రత్నకవిగారు సంఘసంస్క
రణనే యిట ప్రతిఫలింపజేసిరి. రాజారామమోహనరాయలు బాల్య
వివాహాన్ని మాన్పించిన మనీషి. ధనం తీసుకొని కన్యలను వృద్ధుల
కిచ్చి వివాహం చెయ్యడాన్ని నిరసిస్తున్నారు. భారత కన్యలనుగూడ
భావస్వాతంత్ర్యాన్ని పొందమంటున్నారు. నరకం వస్తుందనే భయం

లేక ప్రవర్తిస్తున్నారని మందలిస్తున్నారు. తండ్రులు ఇలాచేస్తే దండనార్హులంటున్నారు. కావ్యపరమార్థాన్ని చెప్పే యీ పద్యాలు అవశ్యోదాహరణీయాలు.

"ఈడునుజోడులేక తమ యిచ్ఛకువచ్చిన రీతి నక్కటా
పాడుధనమ్ముకాసపడి బంగరుబొమ్మలబోలు బిడ్డలన్
వాడు ముసళ్ళవాత బడవైవగనే విధవాపదంబు చే
వాడగ నర్హులౌదురనివార్యము లౌనిక చూచుచుండినన్"

"లెండో భారతకన్యలార యిచటన్ లేశంబు మీ దోసమె
వ్వండున్ బట్టగ నోరురాదు సుఖభావమ్ముల్ మనోవీథిలో
నిండన్ తాళగలేరు కాన భగవన్నిర్దిష్ట సౌఖ్యాననిన్
గుండెల్ వ్రచ్చెడి శోకమాపి వరులన్ గోవాళ్ళఁ బెండ్లాడుడీ"

"స్వర్గముదూరమై నరకవార్నిధి గూలుదు మన్న శంకయా
స్వర్గము గిర్గ మేడనది వచ్చిన వచ్చుకొ లేదో తెల్పదీ
వర్గము నమ్మదానుడి ప్రపంచసుమాసవపాత్ర హస్తసం
స్వర్గముగాగ వీడి పయి స్వర్గము నమ్మిన దేహిదక్కునే"

"వ్యర్థవాదులు విలాసమునకైనడపించు రిత్తకేరడలముబెచిక్కిపోమమధురాజ్యమాట యుక్తమే" "స్వకీయ లాభచింతాకమనీయతన్ దనియు తండ్రులు పొందుదురట్టి దండనల్" "ప్రణయముచ్చాగనైమొ లోనబరగకున్న, జ్ఞానివిశ్వాసమూహింప జనునె చెలియ" అనే వక్కాణి సుభాషితములు.

మనోజ్ఞవర్ణనలగూడ నీ కావ్యముకు నెలవే.మనోజ్ఞ వర్ణగాంచుడు.—

"శ్యామలాకాశపుష్పితారామమును

పూచి విలసిల్లు నక్షత్రపుష్పరాజి

ప్రణయరసమయ హిమకణావలి గురియు

స్నేహావతికయి పూజాభిషేకమేమొ"

నింగి కుసుమితోద్యానం. అందుండు చుక్కలు పువ్వులు. మంచుచుక్కలు ప్రేమను చుక్కలు. నింగి పూజాభిషేకం చేస్తోంది. భావుకుల నలరింపజేసే చక్కని పద్యము.

## వీ రాం జ లి

యాభదిమూడు పేజీల యీ కావ్యం 1934 లో ముద్రింపబడింది. ఇందులో ప్రధానరసం వీరం. శృంగారాది నవరసాలలో వీరరసానికి స్థాయీభావం ఉత్సాహమని సాహిత్యదర్పణ కారాద్యాలంకారికుల నిర్ణయం. స్థాయిభావం పరిపుష్టమై రసమవుతుందని 'విభావాను భావ సాత్త్వికవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః' అని భరతముని సూత్రంలో ఉంది. "శతేషు జాయతేశూరః" అని నూయనుంబెలో. ఒక్కడు మాత్రమే శూరుడని నీతిశాస్త్రం చెబుతూంది. "యదృచ్ఛాశబ్దవత్పుంసః సంజ్ఞాయై జన్మకేవలమ్" అన్న మాఘుకవి వాక్యం ప్రకారం వీరుడు లక్ష్యం సాధింపకున్న వాని జన్మ వ్యర్థం. అట్టి మహోన్నత లక్ష్యాన్నికై పాటుబడ్డ వీరులను కవితాసుమాలతో పూజించడం కవిగారు చేసిన మహోన్నతకార్యం. "గుణాః పూజాస్థానం గుణిషు నచలింగం నచవయః" అని భవభూతి మహాకవి స్త్రీపుంసవయో వివక్షలేక గుణాలను పూజించాలని చెబుతాడు. అట్టి గుణవంతులైన పురుషులకు, స్త్రీలకు, బాలురకు పండితులకు, పామరులకు జోహారులు చేస్తూ రచింపబడ్డ కావ్యమే వీరాంజలి. పురాణాలలోని రమణీయ సన్నివేశాల నేరి కాళిదాసు కావ్యాలను రచించినట్లు రత్నకవి రత్నాలవంటి సందర్భాలనేరి వీరాంజలిని రచించారు నాకన్ని విధాల నచ్చిన కవిగారి

కావ్యాలలో వీరాంజలి యొకటి. ఇందులో హాడారాణి, వీరమతి, జపాన్ రమణి, కొరియాబాలురు, ఛామాశాహ, అబ్సీనియా అడవిపిల్ల, రాయల రాజ్యార్ద్రత యనే ఘట్టాలున్నాయి. కవిగారి తమ్మునికి "మోతియోం కాహార్" అనే గ్రంథం చాలా ఇష్టమైనది. తమ్ముని ప్రీతికై వ్రజనందనశర్మ కృతమైన పై గ్రంథాన్ని "వీరాంజలి" గా అనువదించారు.

హాడారాణి : రాణా ఆజ్ఞానుసారం చందావతు అనే వీరుడు తన ప్రియురాలిని విడచి యుద్ధానికి సన్నద్ధుడై పురోహితునిచే తనభార్యకు పతివ్రతా ధర్మములను బోధింపజేయును. అతడు వెడలిన పిమ్మట యామె పురోహితునిద్వారా భర్తకు లేఖను పంపి ఆత్మహత్యగావించు కొనును. ఇదీ కథ.

ఉపదేశంతోనే కావ్యమారంభమగుట విశేషము. బిడ్డకు మేలు చేయని తండ్రి తండ్రికాడని చెప్పే యీ పద్యం మనోరంజకం.

"కని పెంచి పెద్ద జేసిన తనయుకు నహితమ్ముగూర్ప దలచెడివానిన్
జనకపదమ్మున పిలువగ, జనదాతడు విపినజంతుసముడునుకాడే"

వీరుల ధర్మాలను జెప్పే యీ పద్యాలు పునఃపునఃపఠనీయాలు

"ధర్మతత్పరుడైన సత్ క్షత్రియుండుప్రాణములధార వోసియున్
బాలనిపుడు
కావగాజొప్పు చే తగుకార్యమున్న పుత్రపకీడుమూడిన మూడుగాక"

"దేవ ధర్మమ్ములనుగావ దీటుబూనియుద్ధమునకేగసమకట్టుయోధవరుడు
మందమతినైన ధర్మమ్ము మంటగలియు మీకడక దుర్బలమ్మని నాకు
దెలియు"

"త్రయస్త్రింశదమీభావాః విజ్ఞేయానాట్యయోక్తృభిః" అని చెప్పబడిన సంచారిభావాలలో నొకటైన మృతిని 'కావి పిదప చందా

పత్తు కానబడదు' అని సుకుమారంగా చెప్పడం సౌకుమార్యమనేగుణ మవుతుంది. కావ్యాలంకార సూత్రములనే గ్రంథంలో వామనుడు 'అపారుష్యం సౌకుమార్యం' అని సూత్రీకరించాడు. "అసురలలనా లేఖ్యమాసాద్య సద్యః" అని మృతిని తెలియకుండా కాళిదాసు వర్ణించాడని కవులు ప్రశంసించారు. అలాగే కవిగారి పై వర్ణనలలోగూడ సౌకుమార్యం ఉంది.

వీరమతి : అల్లాఉద్దీన్ పాలించే రోజులలో దేవగిరిలో రామదేవుడు, వీరపతి యనే ఇరువురు వీరులుండేవారు. ఇద్దరికీ గౌరి, వీరమతి యనే కొమార్తెలుండేవారు. వీరపతి యకాలమరణమును బొంద రామదేవుడు వీరమతినిగూడ పెంచి కృష్ణారావుకిచ్చి వివాహంచేస్తాడు కృష్ణారావును సేనాధిపతిని చేస్తాడు. కాని కుటిలుడై కృష్ణారావు శత్రువులతో రాజీపడి రహస్యంగా వారి స్థావరానికి సంధి నిర్ణయానికి వెళ్లును. వీరమతి గొప్ప దేశభక్తురాలు. ఆమె భర్త ననుమానించి మారువేషమున నాతని ననుసరించును. కృష్ణారావు రిపులతో సంధి జేసికొని దేశద్రోహమునకు పాటుబడుచున్నాడని వీరమతి గ్రహించును ఆమెలో దేశభక్తి, కర్తవ్యదీక్ష పెల్లుబికెను. దేశరక్షణామతియైన వీరమతి భర్తయగు కృష్ణారావును సంహరించి, తాను ఆత్మహత్య జేసికొని మాతృభూమిని కాపాడినది.

మరణిస్తూ కృష్ణారావు తన తప్పిదమెఱిగి పరిపరివిధముల విలపించి, తనవంటి దేశద్రోహిననణచిన భార్యను ఎలా ప్రశంసిస్తున్నాడో చూడండి. —

"నాప్రియా సత్క్రతువె నీవొనర్చినావు
అనువునెఱిగి దేశద్రోహినణచినావు"

యజ్ఞాలు చెయడమే గొప్పకాదు. శిష్టుల కాపాడుట, దుష్టుల నణచుటయు మహాయాగములే. భగవద్గీత యంతరర్థమిదియే. "ఆత

తాయినమాయాన్తం హన్యాదేవావిచారయన్" అన్న శ్రీమద్భాగవత పరమార్థమిదియే. ఇందులో క్రతుశబ్దమొక యాణిముత్తెము. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ కవిత్వతత్త్వ విచారమున దేశభక్తిగల కవితయే గొప్పదని సెలవిచ్చిరి. పై భర్త మాటకు వీరమతి ప్రత్యుత్తరమిది. —

"నాథమీరలు నాప్రాణనాథులగుదు
రఖిలమును నాకు మీరలే యగుదురింక
నగుసురాత్మప్రియుల్ నాకునైన నెంతొ
ప్రియతరము దేశమిదినాకు ప్రియుని కంటె"

గూఢంగా శత్రువుల, భర్తనుచూచే వీరమతి దీనురాలైన దేవగిరి లక్ష్మి యనుట కవి వర్ణనానైపుణ్యానికి తార్కాణము.

## జపానురమణి

జపానుకు రష్యాకు ముమ్మరంగా యుద్ధం జరుగుతున్నరోజుల్లో జపానులోని ముఖ్యమైనదుర్గాన్ని పట్టుకోవాలని రష్యావారుసంకల్పించి ఆ దుర్గాధ్యక్షునికి ఆశచూపారు. జపాను సైనికులు భోజనాలు చేసే సమయంలో దుర్గ ద్వారం తెరవాలని అధ్యక్షునితో చెప్పారు. జపానుకు గవర్నర్ నీవే అవుతావని ధనంకూడ యిచ్చారు. ఆ దుర్గాధ్యక్షుని భార్యమాత్రం ఇందుకంగీకరించలేదు. అందరూ భోజనాలు చేస్తూండగా యాతడు ద్వారం తలుపులు తీసాడు. ఆతని భార్య ఆపదను తెలియజేసే గంటమ్రోగించింది. జపాను సైనికులు వెంటనే గుండ్లను కురిపించి రిపులపాలిట్రోలిరి. ఈ గాథనే "జపానురమణి" అనే కావ్యంలో వర్ణించారు. ఈ కావ్యంలోని మనోహరమైన పంక్తులను చూడండి —

"జన్మభూమాత పరులహస్తములలోన
బడిగులాముల యిడుములగుడుచుననెడి
భావమామెకు మిక్కిలి బాధ గొలిప
ద్రోహమూలక వృద్ధికి రోసెనాపె"

"నెలత దేశభక్తివలన నెగ్గె జపానే."

## కొరియా బాలురు

కొరియాదేశం జపానుక్రింద నలిగి పారతంత్ర్యమనుభవించే రోజులవి. దేశభక్తిగీతం పాడినా జెండా పట్టినా కొరియా దేశీయులను జపానువారు బాధిస్తున్నారు. స్కూల్లు పగలాన జరిగిన సభలో ధనికులు జపానువారి రాజభక్తిని కీర్తిస్తున్నారు. కొందరు బాలురు జెండాలు పట్టి వీరగీతాలు పాడుతూ తిరుగసాగిరి. సైనికులు కొరడాలతో బాదుచుండిరి. గాయపడిన బాలురకు వైద్యశాలయందలి కొందరు బాలికలు కట్లుగట్టిరి. కొందరు బాలురను న్యాయాధిపతి చెంతకు గొంపోయి హింసించి చంపిరి. వీరి సాహసాన్ని నిరూపించే చిన్నికావ్యమే ఇది.

"కొరియాతల్లికి పెద్దబిడ్డలయి యుక్కుంగొన్ననో యున్నలా
రరోదాళించెడి తల్లియేడ్పువినగాదాదో యిటల్ తల్లినె
త్తురు తోడన్ పరదేశరాజులకు సంతోషమ్ముగావింప జా
తురె కానిండిక మాదునెత్తురుల సంతోషమ్ముగా ద్రావుడీ"

"దైవముచేత బ్రసాదితమ్ములై యొప్పెడి జన్మహక్కులివి
యోర్వనిచో నికమేము నోర్తుమే"

గుండెలు జలదరింపజేసే సన్నివేశాలుగల యీ కావ్యంలో రత్నకవిగారు "మాధుర్యసౌకుమార్యోపపన్నా పాంచాలి" యనెడి రీతిని వాడిరి.

## భామాశాహ

రాజపుత్ర వీరుడగు రాణాప్రతాపసింహుడు ఔరంగజేబు నుండి దేశమును రక్షించుకొనలేంచి, చివరకు అరణ్యమున జీవించుచుండెను. భార్యాబిడ్డలాకలితో నలమటించుచుండిరి. వారి బాధను చూడలేక సంధిపత్రమును బంప సన్నద్ధుడాయెను. ఇది విని స్వధర్మమును విడవలదని రాణాప్రతాపునకు బోధించి భామాశాహాయను వైశ్యుడు తన ధనమంతయు దేశరక్షణకై నొసంగెను. ప్రతాపుడు చివరకు శత్రువుల బాఱ దోలి విజయుడాయెను. కావ్యంలోని యీ క్రింది పంక్తులు మణిపూసలు.

"స్వాతంత్ర్యమ్ము గడించుగాక జననీ స్వర్గమ్ము కాపాడవే"
"హైందవాత్మ ప్రతిష్ఠ సాహరణ మొందు"

## అబ్బీనియా అడవిపిల్ల

అబ్బీనియా దేశంలో చిట్టడవిలో ఒకపల్లె. పల్లెలో పశుచు పిల్ల గలదు. ఆమె నల్లనిది బాల్యం నుండి యనేక పురాణగాథలను వినినది విద్యావిహీనురాలైనను, జ్ఞానము, దేశభక్తి యామెయందు గలవు. ఇటలీవారు దండెత్తి అబ్బీనియా సైనికులను తరిమివేయసాగిరి అట్టితటి సైనికులు పరుగిడుచుగా తమ రహస్యమును చెప్పవలదని అడవిపిల్లతో చెప్పి వెడలిరి. సైనికులా ప్రాంతమునకు వచ్చి వారిజాడ కొఱకనేక విధముల అడవిపిల్లను హింసించిరి. రక్తధారాసిక్తమైయామె చురకత్తితో నాలుకను కోసికొని నేలపై బడెను.

ఆమె నాలుకను కోసికొనుటను కవిగారెట్లు వర్ణించిరో చూడుడు

"పాపము బాధాభరమోయి బాలమొలన్ గలకత్తి నొకటిన్
జేపడ దీసి నాలుకన్ చివ్వునగోసికొనెన్ కటకటా"
"ప్రాణములబాసె దేశభద్రత గుటించి"

## రాయల రాజ్యార్థత

శ్రీకృష్ణదేవరాయల తండ్రి మరణ మాసన్నముకాగా యతనొకడు తన కుమారుల బిలచి తన వ్రేలినుండి యుంగరమును తీని రాజ్యాధికారమును బడయుడనెను. ఉంగరము వ్రేలి న

రాకుండినచో నందరూ నిశ్చేష్టులై మృత్యువాసన్నముగ నుండినను యుపేక్షించుచుండిరి. కృష్ణదేవరాయలు వ్రేలిని ఖండించి యుంగరమును, రాజ్యాధికారమును బడసెను. ఈ కావ్య ఖండిక యందలి గాధ యిది. ఈ కబ్బము నుండి వ్రేలిని ఖండించిన రసవత్తరఘట్టము నిట యుట్టంకించుచుంటి.

"సుతుని మహాత్తరంబయిన సూక్ష్మమతిన్ గ్రహియించిపొంగుచున్
బ్రతుకున నాసబోసిన త్వరందన రత్నకిరీట మప్పుడే
సుతుడగు కృష్ణదేవు శిరసున్ ధరియింపగ జేసెదెబ్బతో
జితికినవ్రేలు నెత్తురులు చిమ్ముచు జివ్వవలాగుచుండినన్"

## మైనా దేవి

శ్రీ రత్నకవిగారి కావ్య రత్నాలలో మైనాదేవి యొకటి. ఈ కావ్యమును గూర్చి బొంబాయి సాహిత్యపత్రికా సంపాదకులైన శ్రీ S. R Tikekar గారిట్లనిరి —

"This story is bound to be of great use to them" చారిత్రకాధారమునుగాంచి Tikekar గారు 'I don't I know how to thank you adequately for your kindness' అనిరి. సర్ థామస్ హేడైరీని, ది. 6-9-1957 నాటి Times పత్రికను ది. 10-9-1957 హార్కారా పత్రికను కవిగారు లెస్సగా పరిశీలించిరి. శ్రీ గుఱ్ఱం జాషువాగారు మైనాదేవి మొరాన్కన్య కావ్యాలను గూర్చి ఇట్లనిరి.

"కావ్యములయందచందములున్నవి. వ్యర్థపదములు లేవు. నడకలో బెడగుదనము, పలుకులో తీపితో ముద్దులమూటగట్టుచున్నవి. "1956 జులై 15 నాటి ఆదివారం ఆంధ్రపత్రికలో "నానాసాహెబు కూతురు - మైనాదేవి" యను వ్యాసమును కవిగారు రచించిరి. దీని ప్రచురణకు శ్రీ సిరిపెగడ వెంకటరావుగారు శ్రీ లక్ష్మీనరసింహారావు (దేశపాండ్యా సిరిదేపల్లి నైజాం) గారు చేయూతనిచ్చిరి. చిత్రమయ జగత్తు నుండి యనూదితమైన సుజాత (ప్రభవ సం॥ మాఘం) పత్రికలో శ్రీ జి. వెంకోబుగారిచే ప్రకటించబడిన 'కళంకము' అను కధ దీనికాధారము. పై పత్రికల యందలి చారిత్రకాధారములతో యీ

## భామాశాహ

రాజపుత్ర వీరుడగు రాణాప్రతాపసింహుడు ఔరంగజేబు నుండి దేశమును రక్షించుకొన నెంచి, చివరకు అరణ్యమున జీవించుచుండెను. భార్యాబిడ్డలాకలితో నలమటించుచుండిరి. వారి బాధను చూడలేక సంధిపత్రమును బంప సన్నద్ధుడాయెను. ఇది విని స్వధర్మమును వీడ వలదని రాణాప్రతాపునకు బోధించి భామాశాహాయను వైశ్యుడు తన ధనమంతయు దేశరక్షణకై నొసంగెను. ప్రతాపుడు చివరకు శత్రువుల బారి దోలి విజయుడాయెను. కావ్యంబులోని యీ క్రింది పంక్తులు మణిపూసలు.

"స్వాతంత్ర్యమ్ము గడించు గాక జననీ స్వర్గమ్ము కాపాడవే"
"హైందవాత్మ ప్రతిష్ఠ సంహరణ మొందు"

## అబ్సీనియా అడవిపిల్ల

అబ్సీనియా దేశంలో చిట్టడవిలో ఒకపల్లె. పల్లెలో పడుచు పిల్ల గలదు. ఆమె నల్లనిది బాల్యం నుండి యనేక పురాణగాథలను వినినది విద్యావిహీనురాలైనను, జ్ఞానము, దేశభక్తి యామెయందు గలవు. ఇటలీవారు దండెత్తి అబ్సీనియా సైనికులను తరిమివేయసాగిరి అట్టితఱి సైనికులు పరుగిడుచుగా తమ రహస్యమును చెప్పవలదని అడవిపిల్లతో చెప్పి వెడలిరి. సైనికులా ప్రాంతమునకు వచ్చి వారిజాడ కొఱకనేక విధముల అడవిపిల్లను హింసించిరి. రక్తధారాసిక్తయై యామె చురకత్తితో నాలుకను కోసికొని నేలపై బడెను.

ఆమె నాలుకను కోసికొనుటను కవిగారెట్లు వర్ణించిరో చూడుడు

"పాపము బాధాభరమయి బాలమొలన్ గలకత్తి నొకటిన్
జేపడ దీసి నాలుకన్ చివ్వునగోసికొనెన్ కటకటా"
"ప్రాణములబాసె దేశభద్రత గుఱించి"

## రాయల రాజ్యార్హత

శ్రీకృష్ణదేవరాయల తండ్రి మరణ మాసన్నముకాగా యా ముసలోడు తన కుమారుల బిలచి తన వ్రేలినుండి యుంగరమును తీ కొని రాజ్యాధికారమును బడయుడనెను. ఉంగరము వ్రేలి న

జననినర్చించుదో లేక జన్మభూమి, కెదురుగానిల్చి కత్తినె త్తెదవో నేడు"

దేశభక్తి, మునుల గౌరవమును పొందని వానిని గూర్చి ఇలాకవి నింది స్తున్నారు.

"ఒక జీవియాతగానొంది యాత్మని కథ, కల్పిపేవగానిల్చినదియు గాక
ఏమతికింపితమ్మ పథమొమ్మదాని, తీర్చియీయగ లేని దేవె కాక
మనచేయునిత్యకర్మలకు దూరమ్మగా, నిలచి భీషణదృష్టిగలదిగాక
అణువాది బ్రహ్మపర్యంతము మనదగు రీతి జెప్పగలేని ప్రేతకాక
పరమపావనసూత్రసంబద్ధమైన దార్యధర్మము నీ రక్తమూర్యదత్త
మెట్టి బాంధవ్యమో చెప్పనేల తిరిగి తల్లి గర్భమ్ము గోయు పుత్రకు
డెవండో"

పరదాస్యము నంగీకరించిన వానిని కవిగారిట్లు తీవ్రముగా విమర్శించిరి. —

"తోడబుట్టిన వారిమైతిళులాలిచి
పరులకాళ్ళకు చెప్పులప్పముగాగ
తొడిగి ముద్దాడి కండలగుడుబెట్టు
వ్రాత నీ తలగలదా నిర్వాకము పొమ్మ"

సౌధాగ్రముననున్న మైనాదేవి హేరోడుకు సౌధ మహిమను దెల్పు యీ క్రింది పద్యమున సహృదయుల నరనరముల దేశభక్తిని నింపగల కవిగారి భావనదివేగమును గనుడు—

"ఈయింటపాపనై అమ్మ అొమ్మపాల్
జీకి నేర్చితివేమొ చిఱుత నగవు
ఈ నేల పారాడి యింత యెదుగిడ నేర్చ
గిలుకుటందియల చిందులిడగ లేదె
ఈ గూటి నీడ నాకెన్ని రేలుపవళ్ళు
తమనోడి బ్రతుకు సత్కృతుల గోష్ఠి
ఈ గవాక్షములు నాకెన్ని బొమ్మలు చూపి
చదివించె గగన పుస్తకపు పుటల"

ఇచట ప్రతి రేణువును ప్రాణమిచ్చి నన్ను పెంచి పెద్దగ చేసిన వీర

మాత కృప వహించవో ఆత్మ వెల్గించుకోనవో నాయెడలు కాల్చి నిలుపు మమ్మాగ్రహమ్ము" మేరీ లేఖలోని ఈపద్యం కరుణారసనిర్భరం "నా చెలియ నాదు ప్రాణము నా సమస్త, జీవనమ్మగదరిన చిన్నమేరి కాపడతటస్థమైనట్టులరయుదేని, కావుమో తండ్రియిదినాదుకడమకోర్కె' తిక్కనవలె నచ్చపుశాస కావ్యమును నడిపింపగలమేటి యితడు. అచ్చ తెనుగును గాంచుము—

"ఆ నడికిరేయి తెలువెల్గులీను వలిప
మొందు ధరియించి ముద్దు నెమ్మొగములోన
వగపు చీకట్లు తాండవింపగ నలంగు
పదియునారేండ్ల మహరాష్ట్రి బాల యొకతె"

కాదంబర్యాది గ్రంథములందు వోలె చక్కని వర్ణనలు గలవు. ప్రకృతి వర్ణన—

"నాడు షోడశ కళలపూర్ణముగ వెల్గు
వాడు చందురు నాటంక పరుపనొక్క
మబ్బు తునకైన లేని నిర్మలవియత్తు
నిద్రిత జగత్తు తళుకు వెన్నెల నలందె"

ప్రబంధములయందు అర్థ సౌందర్యములేని రోదన వర్ణనలనేకములు గలవు నన్నయ చేసిన యాశ్రమ వర్ణనమున ఔచిత్యమున్నదని ఇతరుల వర్ణనమున యట్టిది లేదని, ఔచిత్యమే కావ్యమునకాయువు పట్టని కట్టమంచి రామలింగారెడ్డిగారనిరి. రోదనమును ఔచిత్యవంతముగ, రసస్ఫోరకముగ రచించిన మహాశిల్పి రత్నకవి. మైనా రోదన వర్ణన మెంత భావ గంభీరమో చూడుడు. తిక్కన శైలికుదాహృతియిది.

"కలువకందమూదిద్దు కన్నె కన్నులలోన, దాగున్నదే చిమ్మరేగు కడలి నిండు వెన్నెల తేసి నిరసించు ముద్దుమో, ముసముసలాడునే యేడుపనెడి మొయిలు

తళుకుబంగరుకింత కళలేదెయనిపించు, చిరుమేని వాడ్చెనే చెనటివనట పుడమిపొమ్మగ పేరుబడిన నవ్వులమొగ్గ, కబ్బుబ్బ తగిలెనేదెబ్బయెంతో అంతచక్కని తల్లికాయింత చిఱుత, యీడులోపలనే భరియింపరాని దుఃఖ భారమ్ము నాయను తోడులేని, దిక్కుమాలినతనమకటకట"

'కాలేచ గ్రహణ త్యాగౌ' అన్న ధ్వనికారుని సూక్తిని 'లతికాపాశేన బద్ధ్వాదృఢం' అన్న అమరుకుని దోహదమందుకొని కవిగారీపద్యమును రచించిరి. 'అథసాపునరేవ విహ్వలా' యని ప్రారంభించి రతీ విలాపముతో సహృదయుల నుఱ్ఱూతలూగించిన కవి కాళిదాసుడు. ఆశ్లే మైనా మృతిని గాంచి యాతడు విలపించిన విధము కాళిదాసుని రతీ విలాపమును స్మరింపచేయుచున్నది. చూడుడు—

'ఒకగుప్పెడచటిబూదికరమ్ముతో దీసి, యొదకెనుకొను జనయిత్రియను మ
ఒకపట్టెడచటి బూదికరమ్ముతో దీసి, తలరుద్దుకొనుచు మాతల్లియనుచు'
మైనాయగ్నిలోబడినపుడు కవిగారిమాట—

"పాపులు త్రోయనెత్తుకొని పావకుడాపెను కుక్షిలోనికిన్
జేపడదిసి తల్లిరో విశృంఖల నీతలమింక నీవు ఏ
పాపుల పీడలేక సుఖభావినివై నిదురింపుమన్నటుల్
దోపగ భాగ్యశాలిని "నుదో"యని మూసె కృశానుకీలలన్"

మైనా మరణ వార్తను రామభూపాలుడు యోగి వేషముననున్న తాంతియాకు చెప్పు విధము—

"పోయిన దాసుమమ్ము సుర భావములవీడి నిలింప పుణ్య పూ
జాయతనమ్ములో జరుగునర్చనలందు నిరంతర సౌరభ
శ్రాయమధూత్కరమ్ములు వేసన్ విరజిమ్ము సునిర్జరాళికిన్
ధ్యేయ పదార్థమాటకని తెల్పక తెల్పెను రామపాలుడున్"
"అట్టియెడ నా శతఘ్నికావ్యగ్రహస్న శిఖలకాహుతియయ్యెనే
చివురుకన్నె"

మైనా మరణవార్త విన్న తాంతియా మాట—
"ధర్మదేవతపుట్టిల్లు కర్మభూమి, శాంతిసత్యమహింస సంచరిలు వీధి
హైందవ క్షోణియిట నింతయాసురోద్ధ, తోగ్ర చండనాట్యమ్ము
నీరోనర్చినారె"

'ఇందు 62 నుండి 70 వరకు గల పద్యములు రస నిర్భరములు. దేశభక్తినుద్దేశించే యీ పంక్తులు సుందరతరాలు.
'జననమిచ్చి పోషించినస్వర్గభూమి, పుడమితల్లమానికమ్మగుపుణ్యభూమి
పడగరాని చెఱన్బడి బడలుచుండె, లేరెతోడుకులుయని నిద్రలేపవలయు

తల్లిబుడంపునబడి తేనెద్రావు నెవడో, మాతృసేవకు రాని సోమరి
యెవండో
దైవనిలయము ఘాంతధర్మశాల, ఇట ప్రసాదము తీర్థము నింతగోరియు
మ్రొక్కి వెడలక గుడిగూల్చు ముష్కరులను, జూపస్వామికి కోపము
రేపవలయు"

డెబ్బదిరెండు పుటలు గల యీ కావ్యం 1940లో ముద్రింపబడినది.

## మొరాన్ కన్య

తన కవితా వ్యవసాయానికిముందు కవిగారిమాటలిటులున్నవి—

"కవులు సుధామయాంధ్ర రసకావ్యకళా విలసత్ప్రసూనరా
జివిరచితాతి సౌరభవిచిత్ర సుదామములల్లిరప్పుడే
అవి యిపుడానరస్వతి గళావనినూగుచు దివ్యగంధముల్
భువి వెదజల్లుచుండనిక పుష్పము తేరెద నేనొకప్పి"

"నా సహజ ప్రతిన్ రచింతు నవ సౌరభముండిన జాలు పూజకున్"

1940లో ముద్రింపబడిన యీ కావ్యం రంజిత్ సింగ్ పాలనా కాలంలోనిగాథ "రాజయితేనేమి" అను శీర్షికలో 1939లో జనవాణి జన్మదినసంచికలో వచ్చిన కథ యీ రచనకు మూలం. పండిత సుదర్శన కృతికి యీపత్రికలోనిది స్వేచ్ఛానువాదం.

రత్నకవిగారి వ్యాకరణ ప్రజ్ఞ:

1. బృందిష్ఠ వరిష్ఠ శిత్యత్యాహ్వంద్రి ద్రష్టయై "ప్రియ స్థిర స్ఫిరోరు బహుల............." అనే సూత్రంచేసట ఉరు శబ్దమునకు వర్ ఆదేశము. బృందారకకు బృందాదేశం వచ్చినవి.

2. ప్రథ్వియమ్యోన్............ "ఖోతో గుణవచనాత్" అనే పాణినీయ సూత్రం ప్రకారం. జీష్రాగ సిద్ధించిన ప్రథ్వియను రూపమిటవాడబడినది.

3. అగ్రియత్వము : అగ్రేభవం అగ్రియం, తస్యభావః అగ్రియత్వమ్.

కవిగారి సంస్కృతభాషా ప్రజ్ఞ:

"త్రద్రిష్టక్షుతధ రక్షీశర బృహద్ధాత్రీధరం జానొపూ
ర్వాద్రేక ప్రచలద్రుడిష్టోత్కృంల రంపహోద్దీప్తి చల్లార శ
త్రుద్రాఘిష్ఠ సతీత్కడింబ మచలద్రుద్ధూలరింభోళిగా
భద్రంతే రణజిత్సువీర భవతు స్వాస్త్యస్తు తే, యంచనున్"

ప్రకటప్రౌఢతపరరాణ్ణికరవ్యాపాదనోగ్ర నిర్ణిద్రబల
ప్రకృతులు హూణులె తత్త్రుక్కధనోకబాడబశిఖిగభీతిగొందెదరుగదా"

సీసపద్యమందలి సంస్కృతభాష, సన్నంతపదాలుచూస్తే కృష్ణదేవరాయల కృతమగు "నాముక్తమాల్యద" యందలి "ఖగటత్ప్రయోధివీథ్య రసాతలానోర్వ్య పిండీకృతాంగ భీతాండజములు" యనెడి ప్రౌఢరచనముస్ఫురణకు వచ్చుచుండును. తాదృశరచనగాంచుడు.—

"అతని సంకల్పానుగత మహారంభభుజా స్తోక సిద్ధ్యన్న భల్లూకదీక్ష
అతని జగజ్జీవనాధ్వంసక సూత్రాయమాణదైవీభక్తి ముద్ధిదృక్షు
అతని మూఢజనతాహా మ్నతిదళనసంసిద్ధ కరాళవాణీబుభుక్షు
అతని రాష్ట్రప్రజాహ్లాద కైంకర్యసంభూత భూరిశ్రమభృత్తితిక్ష"

"మేలుపసిండిగాజులసమేళపు వచ్చులకీల్క డెంపుడాకెలు" అని అచ్చతెనుగువాడి తన స్వాతంత్ర్యమును చేమకూర వెంకటకవిప్రదర్శించెను. అట్లే రత్నకవిగారును తమఅచ్చుపుబాసయందుకవితగట్లల్లిరోగాంచుడు

"జలజలపూలురాలుపువుజప్పరమెక్కెడిహాయిగా వెతల్
తొలగ తలంపులన్ జవులులోగకలే గెడివేళ కోకిలల్
గలరవమాలపింప పసిగాడ్పుల సంజప్రవేశమై యెటో
తెలియుకవచ్చు కామిని గతిన్ ప్రభుపాలన తన్పుబాలితున్"

కావ్యమందలి యుపదేశాలు :

"మతముపవిత్రము జీవన్మృతుడతడెవ్వాడుదానిమీటి చరించున్
బ్రతుకతనికి తగదని తీవ్రతరస్ఫుటబోధసేయుసడలడు సభలన్"

"యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోజనః" యనెడి గీతాపంక్తి యిట్లనూదితము—

'ఎట్టెటు శ్రేష్ఠుడు నడచెడు నట్టటులే జనులు నడతు రాతురము మెయిన్'

తిక్కనమహాకవి విరాటపర్వమున కీచకునిద్వారా, 'నెత్తమ్మిరేకుల మెత్తదనమంతయు నన్నునబోసి నట్లందముంది' అని అద్భుతముగ ద్రోపదీసౌందర్యమును వర్ణించినాడు. ఇందలి భాష, భావము అనన్యసామాన్యములని సహృదయులందరిచే ముక్తకంఠముగ ప్రశంసింపబడినవి అట్టివర్ణనమునకెంత మాత్రము దీసిపోని మెరాన్‌కన్యా సౌందర్యమును కవిగారెట్లు వర్ణించిరో చూడుడు. —

"దాని పయ్యెదగూండ్లదడియుచక్కవకవన్, శాటించునెన్నెన్ని వేటకనులు
దాని పాంజేబుల తళుక్కుమీగాళ్ళతో తడబడుకనుచూపుజడలనెన్ని
దాని మేలిమిమేను దాగిన జిలుగుపావడకెన్నిచూపులు ముదుపులంపు
దానికెమ్మోవిలో తడిసి చిందినవవ్వు కలువలకెన్ని కన్నవలపోట్టి"
"సన్నగా కమ్మగా జాలుజాలుగవచ్చు మకరంద ధారలమాటుకొనెనో"
"అలలైనకళరవమ్ముల సుధాంబుధిపైన ప్లావుటోడవిహారములకు చనునో"

పికహంసాదులనుండితత్తదైశిష్ట్యమును గ్రహించిమొరాన్ కన్య తన నాట్యమున ప్రదర్శించుచున్నదని చేసిన వర్ణనము మెత్తగా డెంద మున గుచ్చుకొని తీయనిబాధను కలిగించుచున్నదన వచ్చును.

"లలితవసన్తకోకిలగళధ్వనిలోన కలమాధురీకళాకళికలేరి
కలహంసచరణమంజులమందగతిలోన దరళితనృత్తనృత్తముల నేరి
మలయానిలాందోళచలితలతాళిలో సముదీర్ణ హావభావములనేరి
శరదిందుశీతహాసతరంగపాళులన్ మోహనశీధుబిందువుల నేరి
పాటలోనాటలో జొచ్చుపాటుగొలుపు నభినయమ్ములలో రసవ్యాప్తిలోన
మిళితమొనరించి యువకచంచలహృదంతరములగదలించినైచు మొరాను సభల"

మొరానును వర్ణించు నీ క్రింది పంక్తులు డైరీలో వ్రాసుకొనదగినవి.
'సంపగివిరిరేకు వంపు వ్రేళులకూర్పు, సుమపాణిపుటికొక్క సొగసుగొలుపు'
మొరానునృత్యమును వర్ణించు నీ క్రింది పంక్తులు మలయానిలమువీచు చుండ, దివ్యోద్యానముననున్న యనుభూతి మనకు కల్గించును.

"అది శృంగారపుముద్దు కెంజెనవి నొయ్యారమ్ముగా నొల్కుచు
న్నది శృంగారపుమత్తుపాట సకలాంగశ్రేణి బోధించుచు
న్నది శృంగారపు కమ్మవాసన .... .... .... ...."

ఇది "పాదన్యాసోలయమనుగతస్సూచితస్సమ్యగర్థః" అని మాళవికా నాట్యమును వర్ణించిన కలికులగురువగు కాళిదాసునివర్ణనమును స్మరింపజేయుచున్నది.

బోధ : "తనుజెప్పు ధర్మముంకే తనుదప్పుట ధర్మమగునే ధరణీధవుడే పనిగాని ధర్మమును తప్పిన జనులందు నధర్మవృత్తిసాగుటతడవే"

వీరి రెండు తత్త్వములను ఆధారముగా గొని మధురయాత్ర యనుపేర కవితలల్లిరి. ఖయ్యాం తత్త్వమును కవి తద్ద్వారా పూర్వపక్షముగ ప్రతిపాదించి. భారతీయ సంప్రదాయబద్ధమగు రబ్బీతత్త్వమును సిద్ధాంతరూపముగ ప్రతిపాదించిరి

గ్రంథమునకు ముందు "ఆంధ్రపత్రిక" యందు కవిగారు రచించిన ఖయ్యాం రబ్బీతత్త్వముల చర్చ ముద్రింపబడినది.

ఖయ్యాం తత్త్వమంతయు భోగలాలసతా ప్రతిపాదకము. మాఘకవి సంస్కృతమందు రచించిన "శిశుపాలవధ" కావ్యమున ఏకాదశసర్గయందును హర్షకృత నైషధమున ఏకోనవింశసర్గమున ప్రాతఃకాలవర్ణనము చేయబడినవి. అవి యెంతమనోజ్ఞవర్ణనయో ఖయ్యాం రచించినరుబాయతునందలి ప్రాతర్వర్ణనమునంతే మనోజ్ఞమైనవి. చూడుడు

రిక్కల పిట్టలన్ జడల రేపన సూరుడు రువ్వినట్టి కెం
పెక్కిన రాయి రేయి యను మొల్తుకబోర్చెను వచ్చితాకెనిం
కెక్కెడి నిదలెమ్ము గ్రహియించె వెలుంగుబురుల్ రచించి ప్రా
గ్దిక్కున వేటగాడు మినుగీరు సిగల్ సుల్తాను సౌధముల్

అనువాద పద్యమైనను యిందలి భాషా కామనీయకత కనుంగడు సహృదయులనలరించును. ప్రసిద్ధమైన గులాముతేలేరుగదా. కాన కీర్తి నశ్వరము ద్రాక్షరసమునే త్రాగమనును సుస్వాదురసపుష్పములన్ గలవు చక్కని తోటలు నీటిపట్టులన్. మధుపానముత్తమమని పికము మధువో మధువో యని కూయును. పక్షి రెక్కలువిప్ప ఆశించుచున్నది. ఎప్పుడు లేచునో తెలియదు. గాన మధుపానము హితము కాంతామధువులే జీవితసారమనును నాళీకముఖాంగి నన్ గవుంగలింప నీవొక పాట పాడుదో నాకము వేఱే లేదడవి నాకిదె నాకము చాలు నెచ్చెలి యనును. కోరుకున్న దియ్యది మసి యౌనో ఫలించునో చెప్పలేను. శాస్త్రములు ఏమియు తేల్చవని కేవలము వాదములవిడచి యున్నంతలో సుఖబడుటే మేలని యీకవి భావము. జీవితసౌఖ్యముల్ మనకు జిక్కిన మట్టున జుర్రిపోదమే యనును. సారాంశమునిట్లు ప్రతిపాదించెను. —

తెలివికోలంది పండితుల తీవ్రవివాదము సాగనిమ్ము నా
తలపయి సృష్టిచర్చకలతన్ బడియుండక నిమ్మనీవు పూ
వులపడకన్ సుధూళమున బొంగుచుహార్ద్రమ పిలుకల్గురీ
తులసుఖమొందరమ్ము చెలి తొంగలి చూపులచాటుతోటకున్

రబ్బీయిట్టి భౌతికలాలసనేవగించుకొని పవిత్రమైన యాధ్యాత్మిక తత్త్వమును ప్రపంచించెను భౌతికాభిలాషపశుత్వము. అధ్యాత్మికతను పతింపమనును, పరమశిల్పమునింత పతింపగూడదో. యావనము శాశ్వత మని యాధ్యాత్మికచింతనతో దేవుని జేరవలయునను. ఘటముల జే యుతులాల డీశ్వరుడని చెప్పబడినది ఇందుకు నమః కులాలేభ్యః అను శ్రీ రుద్రము ప్రమాణము. రబ్బీతనగ్రంధమును భగవదర్పితము గావించెను రబ్బీతత్త్వమిది—

పరమ విచిత్రశిల్పి మనపాలిటికిచ్చిన విశ్వచిత్ర మం
దరయుము నేర్పు తీర్పులు మహోమతియబ్బును దాన జ్ఞానభా
సురుడవు నేడు రావలయుచో మఱియొక్క దినాన జన్మతో
సరిపడు రేపునేటిల ప్రశాంతిగగొన్న మహానుభావులున్

జీవితసంఘర్షణనిరూపించి, యాధ్యాత్మికతను సమర్థించినకవిగారుధన్యులు

## ఓటర్లకొకమాట

"ఓటర్లకొకమాట" యనెడి ఈ చిన్నిపుస్తకము ఉప్పలపాడు గ్రామవాస్తవ్యులైన శ్రీ బొగ్గవరపు పెదఅమ్మయ్యగారి ప్రోత్సాహమున 1955 వ సంవత్సరంలో ముద్రింపబడినది. ఇందులోని పద్యాలు "సుజాత" పత్రికలో ప్రకటింపబడినవి. పూర్వమ్, ఉత్తరమ్ అను రెండు భాగములతోగల ఈ గ్రంథము భారతము, తైత్తిరీయోపనిషత్ ఇలియట్ కావ్యం, సౌభాగ్యశామేశ్వరి, గీత, వేణీసంహారము, సెంట్రల్ ఎంపైర్ ఆఫ్ఇండియా, లెగసీఆఫ్ ఇండియా, మానిఫెస్టోఆఫ్కమ్యూనిస్టు పార్టీ, కొలుక్కుహారీ గ్రంథాల ప్రామాణ్యంతో వ్రాయబడినది. ఇట్టి చిన్ని గ్రంథముకొఱకు అనేక గ్రంథముల పరిశోధించిన రత్నకవిమాట యెంత విలువైనదో గుర్తింపనగును ఓటు విలువ, ఓటరు కర్తవ్యం, భారతీయ ధర్మం, నాటి సాంఘిక పరిస్థితులు యిందు వర్ణింపబడినవి. గ్రంథమందలి వధూటి, సమష్టి, దుస్సాధము అనెడి పదములు కవి వ్యాకరణాభిరుచిని తెలియజేయుచున్నవి. "వధూటీ చిరంటీ శబ్దౌనిత్యయౌవన వాచినౌ" అని కౌముది. సమష్టిసాధురూపం. సమిష్టి గాదు. దుస్సాధ్యము ఖర్చిప్రయోగము ఫైర్ బ్రిగేడ్ మున్నగు ఆంగ్ల పదములు గ్రంథమున చోటుచేసికొన్నవి.

పద్యాలిందులో గలవు. రసాదర్శంలోని మిగిలిన పద్యాలు తెలంగాణా కల్లోలాలలో అనవాప్తాలైనవి.

గ్రంథారంభమున "ఆంధ్రవాణికి నవ్యతలనలరించు నాంగ్ల సాహితి నెవరేమియనిన గోలుతు" ననినారు. ఛాందోగ్యోపనిషత్తునందలి ఆరుణి, శ్వేతకేతువు సంభాషణ "తత్త్వమసి" గా చిత్రింపబడినది. "యతో వా ఇమాని భూతాని జాయన్తే" అనెడి శ్రుత్యర్థము చీమ దోమ తోడేలేస్గు చిఱుతపులియు, బిచ్చగాడు రారాజైన బెకలి వచ్చు, నేడనుండి యీ వివరము నింతయెఱుగరు" అని విశదీకరింపబడినది. "రుద్రగీత" లో కాళీకపాలభృత్తుల సంవాదం, దొరికినదాన్ని దొరకనిదాన్ని, ఒకర్నొకరం మహాకసిగానకుక్కతిందాం. కొరుక్కుతిందాం. అనే డాడాయిజం (Dadaism) భావాన్ని వ్యక్తీకరిస్తుంది. "నవ్యనాగరికత" లో యంత్రమయ జీవితంలోని ఉద్విగ్నతను ప్రస్ఫుటింపజేసారు. చైతన్యమును గుర్తించే వైదుష్యములేక అగమ్యోచ్ఛా ప్రసంగాటవీకూప ప్రాయములవంటి వాదముల చేయుదురని 'చైతన్య స్పృహ' లో వ్రాసారు. "ముడుగులో రారాజు" లో ఏకపాత్రాభినయచ్ఛాయ గోచరిస్తుంది.

"ఆంధ్రుడా" యను కవిత ఆంధ్రభాష ప్రాశస్త్యాన్ని తెలుపుతూంది. ఇది ప్రతి ఆంధ్ర బాలునకు కంఠస్థము కావలెను.

'అద్దెకొంపలు మనకొంపలగునె రిత్త, అన్యభాషలుమన భాషలగుటకల్ల తల్లిపూజకు పూవులదండసిత్తో, దండలల్లువానికి చేదండనిత్తో"

రవీంద్రస్మృతిలో రవీంద్రునకంజలిఘటించిరి. "త్రాగుబోతా" యనెడి కవితలో మానాభిమానములనుమరచిన త్రాగుబోతునకు బోధయొనర్చిరి. 'కవి యనే కవితలో నిరసనము, ద్వేషము, ప్రేమలకు కవి కూడలి యనిరి. "నగరాజు" లో నటరాజును ఆనందరాశి యనిరి. భరతభూమి కవిత స్వైరాదేవి యందు గలదు. 'గురుదేవులు' కవితలో శ్రీ వేలూరిని స్మరించిరి. 150 పద్యాలుగలరసాదర్శం లోని కొన్నిపద్యములుమాత్రమే లభిస్తున్నాయి. words worth వ్రాసిన truetbuty బృహదారణ్యకోపనిషత్తు ఇందనూదితాలు ఈక్రిందిపద్యంమనోజ్ఞంగా ఉంది.

"తరుణ భాస్కరుగవిసి కొందలము నొంది
నళిని అరవిచ్చి పూర్ణముగ విరిసె

చెలుదు ప్రియురాలి యొసఁద అచ్చెరువునొంద
పుణికిపుణికి హస్తముల ముదముగూర్చె"

1947 అగస్టు 15 వ తేదీనాడు స్వాతంత్ర్యోత్సాహమును బొంద "పతా" యను పేర పద్యముల రచించిరి. అనేకవీరుల కృషి ఫలముగా స్వాతంత్ర్యము వచ్చిన దనుచు కవిగారిట్లనిరి—

"నలుబదికోట్ల భారత జనమ్ములు జేయని స్వేచ్ఛనొందు
మంగళ సుదినమ్ము నేడు సముకట్టుటకై ప్రవహించినట్టిని
ర్మలసుధి రాపగా బహుతరంగములందు కణంబులెన్నొని
స్తులతర దేశభక్తుల విశుద్ధశరీరములార్చి చిమ్మెనో"

"జయగీత" యనెడి గేయం వీరభారతిని కీర్తిస్తూసాగింది. ఇలా ఇంద్రధనువువివిధసుందరభావాలతో అందచందములసంతరించుకొన్నది.

## మధురయాత్ర

"మధురయాత్ర" అనునీ పొత్తము సాహితీమేఖలద్వారా ప్లవ నామసంవత్సరమున ముద్రింపబడినది. పాంపాటి సోదరులైన పెదహనుమంతు. చినహనుమంతుగారలు తమతండ్రియగు శ్రీ అచ్చయ్యగారి స్మృత్యర్థము యీగ్రంథమును ముద్రించిరి. ఇందలిపద్యములను శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు "సుజాత" పత్రికయందు ప్రకటించిరి. శ్రీకొండపల్లి శేషగిరిరావుగారుగీసినచిత్రముమనోజ్ఞముగనున్నది.

వైద్య వేదాంత గణిత జ్యోతిశ్శాస్త్ర పండితుడగు ఉమర్ ఖయ్యాము పదునొకండవ శతాబ్దోత్తరార్ధమున పర్షియా దేశమున ఖురాసాన్ రాష్ట్రమున జన్మించి రుబాయతులనుపేర కొన్ని గీతములను రచించెను. డేరాకుట్టు వృత్తి నవలంబించుటచే నీతనికి ఖయ్యామను పేరు వచ్చెను. 19వ శతాబ్దియందలి ఫిట్ జెరాల్డ్ యను నాంగ్లకవి ఆంగ్లమున ననువదించెను. వీనియందు భౌతికాభిలాష మెండు. అబ్రహామ్ బెన్ మీర్ ఇబెన్ ఎజ్రాయను యూదు జాతి కవి స్పెయిన్ దేశమున జన్మించెను. ఇతడు కవి. వేదాంత గణిత జ్యోతిశ్శాస్త్రము యందు గ్రంథముల వ్రాసెను. ఈతడు రబ్బీ యను నామముతో ప్రసిద్ధుడై ఖయ్యాం భౌతికలాలసను నిందించి, ఆత్మతత్త్వము ప్రతిపాదించుచు కవితలల్లెను.

ఈ పద్యమందు "రాజ్ఞి ధర్మిణి ధర్మిష్ఠాః పాపే పాపరతా జనాః
రాజానమనువర్తన్తే యథా రాజా తథా ప్రజాః" అనెడి
మను స్మృతి యందలి భావము గోచరించుచున్నది. రణజిత్తు మొరాన్
కన్య ప్రేమలో బడినపుడు జనులిట్లు నిందించిరి.

"మతము పావనమన్నమతియేడకేగెనో, సానికెమ్మోవిలో జారెనేమొ
ఏకపత్నీవ్రతంబింతవానికోనుబుద్ధి వెలయాలి కడగంటదోలగినదియో"

మతము పవిత్రమనెడుబుద్ధి సానిపెదవినిగనిగలో జారెనేమో యనుట "స్వేదజలలేఖాలవణాళితేవ అగళల్లజ్జా" యనెడి కాదంబరి వాక్యమందలి ఉత్ప్రేక్షను స్మరింపజేయుచున్నది.

వ్యాకరణ ప్రజ్ఞ : 'నేత్రయుగాంతకోణమున దృశించి' ఇట 'దృశిర్ ప్రేక్షణే' యనెడి సంస్కృతధాతువునకు ఇంచుకాగమముచేసి తెప్పగా వాడబడింది ఇదిఅంతసాధారణప్రయోగముకాదు.'ఘృణీపరిణాహము "కిరణోస్రమయూఖాంశుగభస్తిఘృణిఘృష్టయః" అని అమరముచే ఘృణియనగా కిరణమని తెలియును. ఘృణి యని యుండగా రత్న కవి ఘృణీ యని వాడిరి. యువతిః, యువతీ యనినట్లు కృదికారాద క్తినః యను సూత్రముచే నిట ఘృణీ యని సిద్ధించును.

రణజిత్తుతనను వీడునేమోయని జననిందను విన్న మొరాను విలపించిన సందర్భమున అంగరసముగా కరుణమొలికించబడినది.

"దయయొదాక్షిణ్యమును మీయాత్మలోనదలచుట మహాపరాధమా ధరణినాధ ప్రేమమెరుగని దారుణాభీకరోగ్ర వజ్రములు రాజ మీస్వభావమ్ములయ్యె"

అలంకారములు :

1). "సానికెమ్మోవిలో జారెనేమొ" అనుస్థలమున ఉత్ప్రేక్షగలదు. "సంభావనాస్యాదుత్ప్రేక్షావస్తు హేతుఫలాత్మనా" యనిచంద్రాలోక లక్షణము.

2). "హృన్నిడమునన్ గృపావిరహ నిస్తులవేదనలుప్పతిల్లె" ఇటసావయవరూపకము గలదు. "ఆరోపవిషయస్యస్యాదతిరోహితరూపిణః ఉపరంజకమారోప్యమాణం తద్రూపకం మతమ్" అనిరూపకాలంకారలక్షణము చిత్రమీమాంసలో గలదు. రణజిత్తుప్రతాపమును అకాలిపు లసింహుడిట్లుప్రశంసించెను.

"ఎవని కత్తిపతాముల కవచములను దూరి నిత్యాసృగభిషేకతుష్టినొందె ఎవని ప్రతిభాపతాక మిన్నెక్కియాడె..............." ఇంతఅద్భుతమైనకబ్బముగనుకనే మాడపాటివారు మెచ్చుకొనిరి.

కథ : పాంచాలకేసరి యని ప్రసిద్ధిగాంచిన రణజిత్తు నలుబది వత్సరములు పాలించెను. పులసింహుడీతని అనుంగుబంటు. లాహోరునందు మొరాన్ అను వేశ్యానాట్యమునుగాంచి సమ్మోహితుడై యామెను వివాహమాడెను. జనులు నిందించిరి. రాజే తప్పుజేసెనని పులసింహుడు రణజిత్తును గురుపీఠానికిదెచ్చి ప్రజలసమక్షంలోనాల్గుశిక్షలు విధించును. 1. గురుపీఠానికి వచ్చేవారి జోళ్ళను బాగుచేయుట 2. అందరికీముఖము కడుగుకొనుటకు పుల్లలనందించుట. 3. లక్షాపాతికవేలు గురుపీఠానికి విరాళమిచ్చుట. 4. చెట్టుకు కట్టివేయబడి 101 దెబ్బలనుదినుట. రాజు రెండుదెబ్బలు తినిన పిమ్మట పులసింహుడు ప్రజలందరికీ రణజిత్తు ధైర్యసాహసములనువివరించివిడిపించును. రాజు ప్రజలను క్షమాపణ వేడును

మాడపాటివారీ కావ్యమునిట్లు ప్రశంసించిరి.

"ఇదిమరువరాని జాతీయహృదయఘనత చాటిచెప్పెడి సత్కవీశ్వరుని దెనమూసిపోవని కావ్యమ్ము మహిపులిట్టి శక్తిగుర్తించి మెలగుటపసర్వశుభము" రత్నకవిని మహాకవిని జేసిన కావ్యమిదె. కవిగారి కావ్యములందిది మహోత్కృష్టమని దీనిని ప్రశంసింపమాటలు చాలవని మనవిచేసికొనుచున్నాను.

## ఇంద్రధనువు

వెంకటరత్నంగారిచే రచింపబడిన "ఇంద్రధనువు" కవితాసంకలనం సాహితీమేఖలద్వారా వికృతినామ సంవత్సరంలో ముద్రింపబడినది. భిన్నభిన్న కాలాలలో రచింపబడిన యీ కవితలు ప్రతిభ, కృష్ణ, విభూతి, తరణి, ఆంధ్రశ్రీ, ఆంధ్రకేసరి, గోలకొండ, సుజాత, శోభ పత్రికలలో ప్రకటింపబడినవి. శ్రీ పోచంపల్లి లక్ష్మీనరసింహారావుగారి ప్రోద్బలంతో ముద్రింపబడినది. ఇందులోని కొన్ని కవితలు "వనవాటి" గ్రంథరూపంగా వెలువడినవి. ఇందులోగల ధర్మజనిర్వేదం రెట్టింపయి విడిగాంచింపబడినది. అదిఇతఃపూర్వము సమీక్షింపబడినది. ఆహ్వానము, ప్రతిధ్వని వంటి కవితలలో కవిగారి స్వీయచరిత్ర ఘట్టములు గలవు. "రసావర్ణం" అనే కవిగారి యితర గ్రంథములోని

ధర్మదీక్షవహింపవలెనని చెప్పెడిఈ క్రిందిపద్యమెంతమనోజ్ఞమోచూడుడు
"సత్యమహింసయున్ మిగుల చక్కని సూత్రములందు బాపూజీ
నిత్యము సంస్మరించి యవనిన్ విడిపోయెను నమ్మినాడురా
భృత్యులమౌచు భారతము ప్రీతి మెయిన్ దిలకించి చూడుమా
సత్యమహింసయున్ బలినొసంగుము ధర్మము చెంతనుండుచున్"

నాయకులు పేరుకోసం తపన చెందెదరని "మాటలు నమ్మెడి వేళకాదురా" యని చెప్పిరి. భారతీయ సంప్రదాయాన్ని తెలియజేసూ చవులూరించు పద్యమును గాంచుడు —
"అనిబిసెంటమ్మహిందవియయ్యేనేలమాకున్ను ముల్లమువై దికమమతయేల
సీయఫంద్రదాసుటాగోరుశిష్యుడేల! అని నరపింద దర్శనమంత దేని?"
"ఏవలనుసైన వోట్లు తమవై పుకులాగెడి" వారని నాయకుల విమర్శించిరి. "ఎన్నికరోజులాదిమతియెన్నికవచ్చెడిదాకనాయకుల్ నిన్నుతలంచరోరి"అనుమాట యదార్థము. వీరిని వారు వారిని వీరును తిట్టి మహాత్మాచారసంచారములెన్నో నల్పిన ప్రజాపతులెల్లరు సంధికై పరిష్కారము చేసికొందురట. యని నాయకులపరిహసించిరి. ఓటర్లకు కను విప్పుకలిగించుచు ప్రతివ్యక్తికి నవశ్యపఠనీయ మగనున్నది గ్రంథము.

## ఉపసంహారము

ఈవిధముగననేక గ్రంథములరచించిన వేంకటరత్నకవిగారు ఆంధ్రుడగుటమనయందరి యదృష్టము. కథలునాటకములువ్యాసములు కావ్యములు. శాస్త్ర గ్రంథములయందు సర్వతోముఖముగ ప్రసరించి నవీరిప్రజ్ఞ యమేయము."దైవంతునసమాతే దీర్ఘకాలమవ్యాహతరమణీయం వస్తు"అనినేనందును. కవిగాని, పండితుడుగాని, విమర్శకుడుగాని, దాతగాని, సహృదయుడుగాని, సంస్థావ్యవస్థాపకుడుగాని ప్రయత్నము చేగా వొచ్చును. కానియిన్నిగుణములొక్కచోటనే నెలకొని యున్న మహామనిషిగమారుటమాత్రము అరుదనిచెప్పవచ్చు.

ఈశతాబ్దమునందలి గణనీయకవులలో వేంకటరత్నకవిగారు ప్రసిద్ధులు. "స్వయంతీర్ణః పరాంస్తారయేత్" అనున్యాయమునునుసరించి తాము సంస్కృతాంతరంగులై యితరులను గూడ ధార్మికపథమున నడిపింపనెంచికృతార్థులైనధన్యులు. వీరిప్రభావము అనేకులపైనుండును వీరిగ్రంథములు చిరస్థాయిగనిలుచును.

# BIBLIOGRAPHY

1) కిరాతార్జునీయం
2) శ్రీరుద్రము
3) మేఘసందేశము
4) అష్టాధ్యాయి
5) అమరకోశము
6) మనుస్మృతి
7) కాదంబరి
8) భగవద్గీత
9) విజయవిలాసము
10) ఆముక్తమాల్యద
11) ధ్వన్యాలోకము
12) అమరుశతకము
13) కుమారసంభవము
14) రఘువంశము
15) శ్రీమద్భాగవతము
16) కవిత్వతత్త్వవిచారం
17) సాహిత్యదర్పణము
18) నాట్యశాస్త్రము
19) శిశుపాలవధము
20) ఉత్తరరామచరిత్రం
21) కావ్యప్రకాశః
22) వృషాధిపశతకము
23) చంద్రాలోకః
24) హితోపదేశః
25) పారిజాతాపహరణము
26) మాళవికాగ్నిమిత్రమ్
27) మహాభాష్యము
28) కావ్యాలంకారసంగ్రహః
29) చింతామణి
30) అభిజ్ఞానశాకుంతలమ్
31) నైషధీయచరితము
32) సుభాషితరత్నభాండాగారం
33) పురుషసూక్తమ్
34) వివేకచూడామణిః
35) సంక్షేపశారీరకమ్
3 ) సర్వదర్శనసంగ్రహః
37) గౌతమన్యాయశాస్త్రం
38) యోగసూత్రమ్
39) మీమాంసాసూత్రాణి
40) పంచదశి
41) కారికావళి
42) ఆంధ్రభాగవతము
43) కావ్యాదర్శః
44) సమయోచితపద్యమాలికా
45) నీతిశతకమ్
46) దశరూపకమ్
47) రాజతరంగిణి
48) స్వప్న ప్రకాశికా
49) ముకుందమాలా
50) పాండవగీత
51) ముక్తావళి
52) కఠోపనిషత్
53) శాంతిశతకమ్
54) తర్కసంగ్రహః
55) ఆంధ్రనాయకశతకం
56) మహిమ్నస్తవమ్
57) వైరాగ్యశతకము
58) బ్రహ్మసూత్రభాష్యమ్
59) నిరుక్తమ్
60) నీతిశతకమ్
61) వాల్మీకిరామాయణమ్
62) రసగంగాధరః